ఆంధ్రజ్యోతి
ప్రచురణ
www.navyaweekly.com

# నవ్య
వీక్లీ

12-4-2017
₹:20





- శ్రీ సీతారాముల కల్యాణము చూతము రారండి!
- మరణానికి మగువలు దూరం

## సరదాగా....

### తీపిగుర్తు

విక్రమపురిని నవనీతుడు అనే రాజు పరిపాలిస్తున్నాడు. అతడికి పిచ్చిరాజు అనే పేరుకూడా ఉంది. తన పిచ్చి చేష్టలతో, పనులతో ప్రజలను అష్ట కష్టాలు పెట్టేవాడు. ఒకరోజు ఆ రాజుకు పాత ఖైదీ లందరినీ విడుదల చేయాలనిపించింది. అందు కోసం జైలుకు వెళ్లాడు. అక్కడ ఓ ముసలి ఖైదీతో..

**రాజు:** ఎప్పటి నుంచి ఈ జైలులో ఉన్నావు?

**ఖైది (ఆశగా):** మహారాజా! గతించిన మీ నాన్నగారి హయాం నుంచి ఇక్కడే మగ్గుతున్నాను.

అది విని రాజుగారి కళ్లలో నీళ్లు సుడులు తిరిగి ఇలా అన్నాడు "ఈ ఖైదీ మానాన్నగారి తీపిగుర్తు! జైలులోనే ఉంచండి."

### ఒక ప్రశ్న ?

**టిం**కూ, బంటి ఇద్దరూ అన్నదమ్ములు. ఇద్దరూ కలిసిమెలిసి ఉంటారు. టింకూ బంటికన్నా రెండు సంవత్సరాలు పెద్ద. ఇద్దరూ కలిసే చదువుకుంటారు. ఆడుకుంటారు. ఒకరోజు టింకూ, బంటి తమ స్నేహితులతో కలిసి ఆడుకుంటున్నారు. ఆట మధ్యలో టింకూ బంటిని ఒక ప్రశ్న అడిగాడు. సరైన సమాధానం చెబితే ఐస్‌క్రీం కొనిపెడతానని అన్నాడు. టింకూ అడిగిన ప్రశ్న ఏంటంటే, "రోడ్డంతా నిర్మానుష్యంగా ఉంది. ఒక్క పురుగూ, వాహనాల జాడా లేదు. నల్ల టోపి, నల్ల కళ్లద్దాలు, నల్లరంగు సూటుబూటు, నల్ల జర్కిన్ వేసుకుని, నల్ల స్టిక్ పట్టుకుని ఒక వ్యక్తి ఆ రోడ్డు మధ్యలో నడుస్తున్నాడు. కాసేపటి తర్వాత ఒక నల్లటి రంగు ఆడీకారు చాలా వేగంగా అంటే దాదాపు 160 కిలోమీటర్ల వేగంతో వస్తోంది. ఆ వ్యక్తిని గుద్దుతుందా అనేంత దగ్గరగా వెళ్లి ఆ కారు ఆగింది. ఆ కారులోని వ్యక్తికి నల్లటి రంగు వ్యక్తి ఎలా కనిపించాడు? దీనికి బంటి బాగా ఆలోచించి సరైన సమాధానం చెప్పి వాళ్ల అన్నయ్య చేత ఐస్‌క్రీం కొనిపించుకున్నాడు. మరి మీరూ సమాధానం ఆలోచించండి.

### సమాధానం

టింకూ అడిగిన ప్రశ్నలో నిర్మానుష్యమైన ప్రదేశంలో, రోడ్డు మధ్యలో ఆ నల్లటి రంగు వ్యక్తి వెళుతున్నాడు అని చెప్పాడు కానీ అది పగలా రాత్రా అనేది చెప్పలేదు. రాత్రయితే కారు నడిపే వ్యక్తికి, రోడ్డు మధ్యలో నడుస్తున్న వ్యక్తి కనిపించే అవకాశమే లేదు. అదే పగలైతే కనపడతాడు. ఆ నల్లటి రంగు వ్యక్తి నడుస్తోంది పగటి వేళలో కాబట్టే, కారు నడిపే వ్యక్తి గుర్తించాడని బంటి సమాధానం చెప్పాడు.

ఇవేమి నాకు నచ్చు లేదు గానీ..
మీ ఆవిడ లేటెస్టుగా కొనుక్కున్న
చీరలు యింట్లో నుండి
తెప్పించండి చూస్తా!!

దానికి ట్రాజెడీ స్టోరీలు
చెప్పొద్దన్నాను కదా!? వెంటనే
కరిగి పోయి కురుస్తుంది..

మేము ఖాళీ చేయడం లేదు.. ఈ బోర్డు ప్రతి
రాత్రి తగిలించి ఉదయాన్నే తీసి వేస్తాను..
మన కాలనీ లో దొంగలు తిరుగుతున్నారట...

TOLET





## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: అనుష్క
ఫొటో: గోపీకృష్ణ


**రచనలు, కథలు పంపవలసిన చిరునామా**
*నవ్య వీక్లి, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్33.* email: navyaweekly@andhrajyothy.com





## ఆస్తి

వారం పదిరోజుల్లో తండ్రి చనిపోనున్నాడు. ఆస్తి అంతా తనకే దక్కుతుంది. ఇక ఆనందమే ఆనందం అనుకున్నాడు రఘుబాబు. అందమైన అమ్మాయిని పెళ్ళి చేసుకుని సుఖించాలనుకున్నాడు. అమ్మాయి వేటలో పడి ఓ బార్‌కి వెళ్లాడు. అక్కడ ఓ అందమైన అమ్మాయిని చూశాడు. అడిగాడిలా.

"త్వరలో మా నాన్న చనిపోబోతున్నాడు. ఆయన ఆస్తి అంతటికీ నేనే వారసుణ్ణి! నన్ను పెళ్ళి చేసుకుంటావా?"

"చెప్పవేం, పద" అంది అమ్మాయి. రఘుబాబుసహా ఇంటికి వచ్చింది.

మూడు రోజులు గడిచాయి.

నాలుగో రోజు ఆ అందమైన అమ్మాయి తండ్రిని పెళ్ళి చేసుకుని, రఘుబాబుకి 'పిన్ని' అయి కూర్చుంది.'

## పుప్పిపన్ను

అతను ఓ వడ్డీవ్యాపారి. డెంటిస్ట్‌ని కలిశాడు. పుప్పి పళ్ళు తియ్యాలి సార్! మీ ఫీజు అదీ చెప్పండంటూ అడిగాడు.

"ఫీజు అన్నది మీరు తీసుకునే మా సర్వీసు మీద ఆధారపడి ఉంటుంది. ఇక్కడ ఈ ఆసుపత్రిలో కాకుండా మీరు మా ప్రైవేట్ క్లినిక్‌కి వచ్చారనుకోండి, అక్కడ నేను మిమ్మల్ని ట్రీట్ చేసే విధానమే వేరుగా ఉంటుంది. మంచి ఎనెస్థిటిస్ట్‌ని పిలుస్తాను, నొప్పి తెలీకుండా మత్తుమందిస్తాడతను. అలాగే ఓ మంచి నర్సును పిలుస్తాను. ఆమె నాకూ మీకూ సహకరించి ఇబ్బంది లేకుండా చూస్తుంది."

"బాగుంది, పన్నుకి ఎంత తీసుకుంటారో?"

"వెయ్యి రూపాయలు"

"అయ్యబాబోయ్! అంత ఖరీదా? ఇంకో మాట చెప్పండి." అడిగాడతను.

"అయితే నేనే మత్తుమందిస్తాను, నర్సు చేసే పని కూడా నేనే చేస్తాను. కాకపోతే పళ్ళు తీసేటప్పుడు కొంచెం నొప్పీ, కొంత రక్తం రావడం ఉంటుంది. మీరు బాధపడకూడదు. అప్పుడు పంటికి అయిదువందలు చెల్లిస్తే చాలు." అన్నాడు డెంటిస్ట్.

"ఇది బాగానే ఉందికాని, కొంచెం ఆలోచించండి, అంత ఇచ్చుకోలేను." అన్నాడతను. రగిలిపోయాడు డెంటిస్ట్. కోపంగా చెప్పాడిలా.

"ఇంటి నుంచి పటకారూ, సుత్తీ తెస్తాను. పళ్ళు తీస్తాను. భరించలేని నొప్పి అన్నా, ఏంటి బాబూ ఇంత రక్తం అన్నా నా పూచీ లేదు. అప్పుడు పంటికి యాభై రూపాయలే తీసుకుంటాను. మీకు ఓకేనా?"

"ఓకే డాక్టర్! రేపుదయం మా ఆవిణ్ణి తీసుకొస్తాను. పళ్ళు తీసి పెట్టండి." చెప్పాడతను.

–వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి బాధనయినా మరపిస్తుంది.

నవ్య

సంపుటి: 14 సంచిక: 6

12-4-2017



మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ

# మొదటి పేజి

## అందం! ఆనందం!

బాబు బొద్దుగా ముద్దుగా ఉండేవాడు. చూడగానే వాణ్ణంతా ఎత్తుకునేవారు. ఎత్తుకుని, అమ్మో! బరువు అని కిందికి దించేసేవారు. బాలభీముడు అని నవ్వేవారు. రెండేళ్ళకే బాబుకి టాబ్ అలవాటు అయింది. దానిని వాళ్ళత్త అమెరికా నుంచి తెచ్చి ఇచ్చింది. మూడేళ్ళకే స్మార్ట్‌ఫోన్ సొంతం అయింది. దానిని వాళ్ళమ్మమ్మ ఇచ్చింది. స్వీట్లంటే తెగ ఇష్టం వాడికి. అందుకని వాళ్ళ నాయనమ్మ చెయ్యని స్వీట్ లేదు. అలాగే టీవి అంటే తెగ ముచ్చటపడేవాడు బాబు. దాంతో వాడి చదువంతా టీవి ముందే! తిండంతా టీవి ముందే! వీధిపిల్లలతో ఆడేవాడు కాదు బాబు. అలగాపిల్లలతో ఆటలేంటి అని వాళ్ళ నాన్న వద్దనేవాడు. అది బాబు వాళ్ళ తాతకి నచ్చేది కాదు. పిల్లలంటే ఆడుకోవాలి, పాడుకోవాలనేవాడాయన.

బాబు వాళ్ళ తాతకి డెబ్బయి ఏళ్ళు. డెబ్బయి ఏళ్ళవాడయినా ఆయన యాభై-యాభై అయిదేళ్ళవాడిలా కనిపిస్తాడు. బలంగా ఉంటాడు. గట్టిగా ఉంటాడు. పొద్దున నదిలో ఈతతో అతని దినచర్య ప్రారంభమై, సాయంత్రం మళ్ళీ ఈతతో ముగుస్తుంది. సాయంత్రం ఈతకు ముందు నది ఒడ్డున పిల్లలతో ఆయన కబడ్డీ ఆడతాడు. ఒంటికాలు మీద పరుగుదీస్తాడు. అక్కడి కోవెలలో కూర్చుని పెద్దగా పాడతాడు. ఈ పాటలూ, ఆటలూ కొడుక్కి నచ్చవు. ఆ విషయమై తండ్రీ కొడుకులిద్దరూ రోజూ గొడవపడేవారు. ఆ గొడవలంటే బాబుకి ఇష్టం. నాన్నా తాతయ్యా కేకలేసుకుంటుంటే కితకితలుపెట్టినట్టె నవ్వేవాడు బాబు. ఆ నవ్వు తాతయ్యకి ఇష్టం. బాబు నవ్వుకోసం తాతయ్య చెయ్యని పని లేదు. కోతిచేష్టలు చేసేవాడాయన. కొంగలా మెడ సాచేవాడు. కళ్ళు గుండ్రంగా తిప్పేవాడు.

తాతయ్య చేష్టలు తలచుకుంటూ స్కూలు నుంచి వస్తోంటే ఒకరోజు నీరసంగా అనిపించింది బాబుకి. ఛాతి పట్టినట్టనిపించింది. తెలియని నొప్పి అనిపించింది. నడవలేక నడవలేక ఇంటికి వచ్చాడు. వస్తూనే గుమ్మంలో కూలబడ్డాడు. ఎంత పిలిచినా పలకలేదు. స్పృహ కోల్పోయాడు. బాబును తీసుకుని పరుగున ఆసుపత్రికి చేరుకున్నారంతా. రకరకాల పరీక్షలు జరిగాయి. డాక్టర్లు బాబుకి బిపి అన్నారు. షుగర్ అన్నారు. గుండెపోటు అన్నారు. ఆపరేషన్ అంటూ పరుగులు పెట్టారు. ఆఖరికి చనిపోయాడన్నారు. అంతే! భోరుమన్నారంతా. పద్నాలుగేళ్ళ బాలభీముడు పోయాడంటూ గొల్లుమన్నారు.



బాబు టాబ్ ఉంది. దానిని చూస్తూ అమెరికా అత్తయ్య ఏడిచింది. బాబు స్మార్ట్‌ఫోన్ ఉంది. దానిని చూస్తూ బాబు అమ్మమ్మ ఏడిచింది. స్వీట్లున్నాయి. వాటిని చూస్తూ, వాటిని తయారు చేసిన నాయనమ్మ ఏడిచింది. టీవి ఉంది. అందులో పిల్లల ఛానెల్స్ చూస్తూ తల్లిదండ్రులు ఏడ్చారు. గుండెలో బాధగా ఉన్నా, గొంతు రొద చేస్తున్నా ఏడవనిది తాతయ్య ఒక్కడే! ఆలోచిస్తున్నాడాయన. ఈ టాబ్‌లూ, టీవీలూ, స్వీట్లూ, ఫోన్లే బాబుని బలి తీసుకున్నాయి. ఆటలూ, పాటలూ లేకపోవడమే వాడి అనారోగ్యానికి కారణం అనిపించింది. ఆ మాటే కొడుకుతో అన్నాడాయన. అయితే ఈసారి తండ్రితో కొడుకు గొడవపడలేదు. ఆయన్ని వాటేసుకుని కన్నీరుపెట్టుకున్నాడు. కొడుకుని ఓదారుస్తూ నాకో చిన్న సాయం చేస్తావా? అడిగాడు తండ్రి. చెప్పండి! ఏం చెయ్యమంటారు? అడిగాడు కొడుకు. నేను అలగాపిల్లలతో ఆడుతాను! పాడతాను! వారినే కాదు, ఊరి పిల్లలందరినీ చేరదీసి, వారిని ఆరోగ్యవంతుల్ని చేస్తాను. వారెవ్వరూ రేపు నా మనవడిలా చిన్నతనంలోనే చితికిపోకూడదు. ఇందుకు నువ్వు నన్ను తిట్టకూడదు, పైగా ప్రోత్సహించాలి అన్నాడు. సమాధానంగా నాన్నా అంటూ తండ్రిని మరింత గట్టిగా వాటేసుకున్నాడు కొడుకు.

ఆ రోజు నుంచి అక్కడి నదిలో బాల్యం ప్రవహించసాగింది. మైదానంలో పరుగెత్తసాగింది. పాటలు పాడసాగింది. దానిని ఎప్పటికప్పుడు కాపాడుతూ, అది మరింత వన్నెకెక్కేందుకు వేరుసెనగపప్పు, జీడిపప్పు, బాదంపప్పుని అందజేస్తూ ఆనందించాడు తాతయ్య. పిల్లలకోసం, వారి ఆరోగ్యం కోసం వారానికి ఓ రోజు ఎవరూ టీవి చూడరాదన్నాడాయన. దానికి సెలవు ప్రకటించమన్నాడు. సరేనంది ఊరు. అలాగే పిల్లలకు అందుబాటులో టాబ్‌లూ, ఫోన్లూ ఉంచరాదన్నాడు. అలాగేనంది ఊరు. అప్పుడప్పుడూ తప్ప స్వీట్లు అలవాటుగా తినరాదన్నాడు. ఒప్పుకుంది ఊరు. కొన్నాళ్ళు గడిచాయి. తాతయ్యపోయాడు. పోతే మాత్రం తాతయ్య ఉన్నట్టుగానే ఉంది. తాతయ్యకి ఇష్టమైనవారం ఆదివారం. ఆ వారం ఎవరూ టీవిని చూడరక్కడ. అలాగే ఆ రోజంతా ఆటలే ఆటలు. దాంతో అక్కడి బాల్యానికి గుండెపోటు లేదు. షుగర్‌లేదు. అంతా అందమే! ఆనందమే!!




## సర్‌ప్రైజ్ చేస్తారు

అకేషన్ ఏదయినా సరే కేక్ కట్‌చేయటం పరిపాటిగా మారింది. బర్తుడేలకయితే అర్ధరాత్రి పన్నెండు దాటితే చాలు కేక్ కట్‌చేసి హడావిడి చేస్తున్నారు. స్నేహితుల పుట్టినరోజు అంటే చాలు... సర్‌ప్రైజ్ కేకులు, గిఫ్టులు మామూలే. ఇదంతా ముందస్తు ప్రణాళిక వేసుకున్నవాళ్ళకి. మరి అప్పటికప్పుడు సెలబ్రేట్ చేయాలంటే మాత్రం కాస్తంత కష్టమే. అంతరాత్రిపూట, అప్పటికప్పుడు కేకులు, బొకేలు, గిఫ్టులు దొరకవు. పగల గొట్టడానికి బెలూన్లు ఉండవు. అయితే ఒక్క క్లిక్ చేయండి చాలు, అవన్నీ అమర్చి పెడతాం... సర్‌ప్రైజ్ ఇచ్చేస్తాం అంటున్నారు మిడ్‌నైట్ కేక్ అనే స్టార్టప్ నిర్వాహకులు.

మలాయ్, నమన్ అనే ఇద్దరు సోదరులు ఎనిమిది వేల రూపాయలతో 2012లో ఈ వెబ్‌సైట్ స్టార్ట్ చేశారు. మొదట్లో పెద్దగా రెస్పాన్స్ లేదు. రెండు నెలల తర్వాత బుకింగ్స్ మొదలయ్యాయి. ఇక ఆ తర్వాత వెనక్కి తిరిగి చూసుకోలేదు. ఎలా ఆర్డరివ్వాలంటే, వీరి సైట్లోకి వెళ్లి నచ్చిన కేక్ ఆర్డర్ ఇస్తే చాలు. మిగతాదంతా వాళ్ళే చూసుకుంటారు. ఠంచనుగా 12 గంటలకు తలుపు తడతారు. కేక్ ఒక్కటే కాదు. బొకే, బెలూన్లు, హాండ్ క్రాఫ్టెడ్ గ్రీటింగ్ కార్డు, ఒక డిజిటల్ కెమెరా, దాంతోపాటు వీడియో క్యామ్, గిటారిస్టు, ఒక యాంకర్... ఒకసారి ఊహించుకోండి సీన్ ఎలా ఉంటుందో! అదీ ఈ స్టార్టప్ స్పెషాలిటీ. ఒక్క బర్త్‌డే అనే కాదు. వాలెంటైన్స్ డే, మ్యారేజ్ యానివర్సరీ, మదర్స్ డే ఇలా సందర్భం ఏదైనా ఈవెంట్‌ని కలకాలం గుర్తుండిపోయేలా చేస్తారు. ఫోటోలతో మంచి ఆల్బమ్ చేసిస్తారు. వీడియోని అందంగా ఎడిట్ చేసి సీడీ రూపంలో అందజేస్తారు. ఈ స్టార్టప్ ఇంకో స్పెషాలిటీ ఏంటంటే, ఉదాహరణకు మీకు నచ్చిన వాళ్ళు బర్త్ డే టైంలో ట్రైన్ జర్నీలో ఉన్నారనుకోండి. ఆ టైంలో కూడా కేక్ డెలివరీ చేస్తారు. అలా ఎన్నోసార్లు రైల్వే స్టేషన్లలో బర్త్‌డే చేసుకునేలా చేసి చిరకాలం గుర్తుండిపోయే సర్వీస్ ఇచ్చారు. ప్రస్తుతానికి ఇండియాలోని 200 సిటీల్లో మిడ్‌నైట్ కేక్ సర్వీస్ ఉంది.




# మెయిల్ బాక్స్

### రహమతుల్లాకు అనంతకోటి వందనాలు

కులమతాల కాలుష్యం సంగీత సాహిత్యాలకు అంటదని నిరూపించారు డాక్టర్ రహమతుల్లా. ఆ వ్యాసం మొదట్లో చెప్పినవిధంగానే చదివిన తర్వాత మేం ఆశ్చర్యపోయాం. . సంగీత వైద్యులని డాక్టర్ పినాకపాణిగారిని స్మరించుకునేవాళ్ళం. ఇప్పుడు 'సంగీతవైద్యుడు' అని రహమతుల్లాగారిని పిలవాలి. రహమతుల్లాగారు తెలుగు భాషాభిమానులు కావడం మరో విశేషం. వైద్యంతో రోగులకు ఉపశమనం కలిగిస్తూ సంగీతావధానంతో రసజ్ఞులను ఉత్తేజితులను చేస్తున్న వైద్యుడు రహమతుల్లా గారికి అనంతకోటి వందనాలు. థేమ్సు వద్దు, గోదావరి ముద్దు కథ ఎంతో బాగుంది.

—అయికమలమ్మ , హైదరాబాద్

### డూప్స్ సూపర్బ్

'మీరు కాని మీరు' మనిషిని పోలిన మనిషి కథనం ఆసక్తిదాయకం. మనిషిని పోలిన మనుషులు ఉంటారని విన్నాంగానీ, ఇలా కళ్ళారా చదివాం. చాలా బాగుంది. సామాన్యుల నుంచి సెలబ్రిటీల వరకు వారి వారి డూప్స్ అదుర్స్‌గా అనిపించారు. చక్కటి సజీవ సాక్ష్యాలను అందించిన రచయితకు ధన్యవాదాలు.

'నవగ్రహ పురాణం' పుస్తకావిష్కరణ సభ విశేషాల ద్వారా చాలా విషయాలు తెలిశాయి.

—నీలిమ సబ్బిశెట్టి, రాజానగరం తూర్పుగోదావరి

### థేమ్సు వద్దు

ఎటో వెళ్ళిపోయింది మనసు అంటే మరి వెళ్ళదా? డి.ఆర్.ఇంద్రగారి 'థేమ్సు వద్దు గోదావరే ముద్దు' కథ ఇచ్చిన కిక్కే అటువంటిది మరి. బహిర్భూమి అలవాట్లను లండన్ ట్రిప్‌తో పోల్చి దేశంలో ముప్పాతిక జనానికి ఈ లండన్ ట్రిప్పులే గొప్ప. ఎక్కడ దొరుకుతాయి ఇటువంటి చురకలు? నవ్యలోతప్ప! గ్రేట్.

—టి.సాయిసంతోషిణి రీతిక, అనకాపల్లి

### రహమతుల్లా పరిచయం బాగుంది

ఒడిసా వాసి డాక్టర్ రహమతుల్లా. ఆయన చైతన్య వ్యవస్థాపక కార్యనిర్వాహకులు. గానగంధర్వుడు, మధురగాయకుడు ఘంటసాల అవధానాగ్రేసరుడు డాక్టర్ రహమతుల్లా పరిచయం చాలా బాగుంది. అందరితో కలుపుగోలుతనంగా, ప్రజాసేవ, సాహిత్య, సాంస్కృతిక కార్యక్రమాలు ఆ ప్రాంతంలో చాలా చక్కగా నిర్వహించేవారు ఆయన.

—జగతాపి గంగరాజు, పాతపట్నం,
శ్రీకాకుళంజిల్లా

## కళ్ళు చెమర్చే కథలు

నవ్య వీక్లీలో కథలు చాలా బాగుంటున్నాయి. బుధవారం ఎప్పుడు వస్తుందా అని ఎదురుచూడ్డమే అవుతోంది. గుండెల్ని కదిలించే కథలు ప్రచురిస్తున్నారు. 'అంటరాని వసంతం, కథ చాలా బాగుంది. కథలు కన్నీళ్ళు రప్పిస్తున్నాయి. సీరియల్స్ చాలా బాగుంటున్నాయి. ముఖ్యంగా వెట్టి, మహానంది సీరియల్స్. మీకు హాట్సాఫ్.

—ఆర్.వి.జి.కె. ప్రసాద్, సికింద్రాబాద్

## గుండెను కదిలించిన కథ

గుమ్మడి రవీంద్రనాథ్‌గారు 'ఆటిజమ్'పై రాసిన మమతలస్నేహం కథ చదివి కళ్ళు చెమర్చాయి. అది మాకు బాగా కనెక్ట్ అయింది. ఆ కథలో రామం లానే 18 ఏళ్ళ మా మనవడు ఆ వ్యాధితోనే సఫర్ అవుతున్నాడు. మాట రాదు, చెప్పింది అర్థం కాదు, బైట ప్రపంచం తెలియడం లేదు. పక్కన బాంబు పడినా స్పందించలేడు. పాము, పురుగులతో ఆడుకోడానికి చూస్తాడు. అన్నీ మేమే చెయ్యాలి. ఈ కథ మా హృదయాల్ని కదిలించింది.

—తాళాబత్తుల సూర్యకుమారి, విశాఖపట్నం

### బాచికి త్రీచీర్స్

కార్టూన్లు నవ్విస్తూనే కవ్విస్తున్నాయి. వాస్తవాన్ని అందరికీ ఎరిగిస్తాయి. కనువిప్పు కలిగిస్తాయి. ఈ వారం బాచి గారి తీన్‌మార్ నిజంగా తీన్‌మారే. గెంటేసిన తండ్రి బెగ్గరైతే వెతుక్కుంటూ వెళ్ళిన 'చిల్లర కొడుకు, ఏ.టి.ఎం. కు వెళ్తూ అర్నెల్ల వరకూ రావడం కుదరదన్న మొగుడు, మీరు ఏటి ఎంకు వెళ్ళడం ఎందుకు అదే మనింటిదాకా వచ్చిందని ఆ క్యూని చూసి చెప్పిన భార్య....సూపర్బ్! బాచిగారు మీకు త్రీచీర్స్! ఇలాగే మీరు ఇంకా చెలరేగిపోవాలి. మీకు, నవ్య వీక్లీకి ధన్యవాదాలు.

—ఎన్.కె.నాగేశ్వరరావు, పెనుగొండ. ప.గో.జిల్లా

### చక్కని కాఫీ

మార్నింగ్ కాఫీలోని అంశాలు గిలిగింతలు పెట్టి చక్కని కాఫీ తాగిన అనుభూతి మిగిల్చాయి. ఎందుకంటే చమత్కారబలంతో మరీ మరీ చదివించింది. డా.రహమతుల్లా తన కృషి, ప్రతిభతో సినిమా పాటల సమాచారానికి చెదరని, చెరిగిపోని విధంగా నిత్యకృషీవలునిగా రూపొంది, సంగీత ప్రియులకు ఆరాధ్యుడవుతున్నాడు.

—డా.శివభూషణం, కర్నూలు

# అవమానం అందలం ఎక్కించింది

కార్లంటే చాలామందికి ఇష్టం ఉంటుంది. అందులో ఖరీదైన, విలాసవంతమైన కార్లంటే చాలామంది సంపన్నవర్గాల వారికి ఇష్టం. అలా ప్రపంచంలోని విలాసవంతమైన కార్ల తయారీ కంపెనీల్లో లండొర్గిని కంపెనీ ముందు వరుసలో ఉంటుందని చెప్పొచ్చు. మామూలు కార్లు కాకుండా కేవలం అత్యంత ఖరీదైన కార్లను మాత్రమే ఈకంపెనీ తయారు చేస్తుంది. రోడ్డుపై రివ్వున దూసుకెళ్లే లంబోర్గిని కార్లు చాలా మందికి ఫేవరెట్ అంటే అతిశయోక్తి కాదు.అలాంటి లంబోర్గిని సంస్థ ఒకప్పుడు కార్లకు బదులుగా ట్రాక్టర్లను తయారు చేసేది. నెలకు ఒక్క ట్రాక్టర్లు కూడా సరిగా తయారు చేయలేని చిన్న సంస్థగా ఉండేది. ఇప్పుడు కార్ల తయారీ రంగంలో అగ్రగామి సంస్థగా నిలిచింది. ఇందుకు కారణం లంబోర్గిని సంస్థ యజమానికి ఎదురైన అవమానమే. అదేంటో మీరూ తెలుసుకోండి! లంబోర్గిని సంస్థ యజమాని ఫెర్రుకియో లంబోర్గినికి రెండో ప్రపంచ యుద్ధం సమయంలో వైమానిక సిబ్బందితో పరిచయం ఏర్పడటంతో వాహనాల ఇంజన్లు, మెకానికల్ సిస్టమ్‌పై ఆసక్తి పెరిగింది. యుద్ధం అయిపోయాక లంబోర్గిని ఉత్తర ఇటలీలో కార్లు, బైకులు రిపేర్ చేసే మెకానిక్ షాపు ప్రారంభించాడు. అప్పుడే లంబోర్గినికి ఓ ఆలోచన వచ్చింది. యుద్ధం సమయంలో ఉపయోగించి వదిలేసిన వాహనాల భాగాలు తీసుకొని ట్రాక్టర్లు తయారు చేసి విక్రయించాలనుకున్నాడు. వెంటనే కర్మాగారం ప్రారంభించి ట్రాక్టర్లు తయారు చేయడం మొదలుపెట్టాడు. కానీ ఆ కర్మాగారం నుంచి నెలకు కేవలం ఒక్క ట్రాక్టర్ మాత్రమే తయారయి బయటకి వచ్చేది. వ్యవసాయంలో ట్రాక్టర్ల వినియోగం పెరిగేసరికి లంబోర్గిని ట్రాక్టర్లకు డిమాండ్ పెరిగింది. దీంతో వ్యాపారం లాభాసాటిగా సాగింది. అలా వ్యాపారం పెంచుకుంటూ 1960లో లంబోర్గిని ఆయిల్ బర్నింగ్ హీటర్లు, ఏసీలు తయారు చేసే కంపెనీలను స్థాపించాడు. కార్లంటే మోజుపడే లంబోర్గిని చాలా రకాల స్పోర్ట్స్ కార్లు కొన్నాడు. అప్పటికే విలాసవంతమైన లగ్జరీ కార్ల కంపెనీ ఫెరారీ 250 జీటీ కారును కూడా సొంతం చేసుకున్నాడు. అయితే ఆ ఫెరారీ కారులో క్లచ్ సరిగా పడక సమస్య ఏర్పడింది. దాన్ని గుర్తించి ఫెరారీ యజమాని ఎంజో ఫెరారీ వద్దకు వెళ్లి క్లచ్ సమస్య గురించి ఫిర్యాదు చేశాడు. దానికి ఎంజో ఫెరారీ సరైన సమాధానం చెప్పకపోగా కారులో ఎలాంటి సమస్యాలేదు. డ్రైవర్‌తోనే సమస్య. తమరు కారును కాకుండా ట్రాక్టర్‌ని నడపడమే మంచిదంటూ అవహేళన చేశాడు. ఆ సమాధానం లింబోర్గినిని బాధించింది. ఆబాధలోంచే తానే ఒక సొంత కారును ఎందుకు తయారు చేయకూడదని అనుకున్నాడు. అలా 1963 సంవత్సరంలో శాంటాగటా అనే ప్రాంతంలో చిన్న కర్మాగారం ఏర్పాటు చేశాడు. ఫెరారీలో పని చేసిన మాజీ ఉద్యోగులను తన సంస్థలో నియమించుకున్నాడు. అన్ని కార్ల కంటే విలాసంతవమైన అత్యధిక జీటీ గంటకు 240 కి.మీ వేగంతో వెళ్లే కారును రూపొందించాలని లక్ష్యంగా పెట్టుకున్నాడు. అనుకున్న ప్రమాణాలతో లంబోర్గిని 350 జీటీ కారును ఆవిష్కరించాడు. వృషభ రాశిలో జన్మించాడని తన కారు పేరుకు ఎద్దునే చిహ్నంగా ఉపయోగించాడు. అప్పటి నుంచి లంబోర్గిని వెనక్కి తిరిగి చూసుకోలేదు. ఫెర్రుకియో లంబోర్గిని 1993లో మరణించడంతో ప్రస్తుతం ఈ కార్ల తయారీ సంస్థను ఆడీ, ఫోక్స్‌వ్యాగన్ సంస్థలు నడిపిస్తున్నాయి.



నవ్య



# శ్రీ సీతారాముల కల్యాణము చూతము రారండి

**జానక్యాః కమలాంజలి పుటే యాః పద్మ రాగాయితాః**
**న్యస్తా రాఘవ మస్తకేచ విలసత్కుంద ప్రసూనాయితాః**
**స్యస్తా శ్యామల కాయ కాంతి కలితాః యా ఇంద్ర నీలాయితాః**
**ముక్తాస్తా శ్శుభదా భవంతు భవతాం శ్రీ రామ వైవాహికాః**

**పచ్చని మామిడి తోరణాలు, ముత్యాల పందిళ్ళు, వేదమంత్రాలు, పట్టుచీరల రెప రెపలు, జీలకర్ర బెల్లం, మూడుముళ్ళు, అక్షింతల జల్లులు, వధువు ఓరచూపులు, వరుని ఆతృత చూపులు, బంధుజన సందోహం అంతా కలిస్తే హిందూ వివాహ ఘట్టం. ఎక్కడ చూసినా నవ్వుల తుళ్ళింతలు, అమ్మల కళ్లల్లో నవ్వుల కన్నీళ్లు అంతా శోభాయమానం. ఇవి ప్రతీ పెళ్లిలోనూ కనిపించే సంఘటనలే.**

**ఏప్రిల్ 5 శ్రీరామనవమి సందర్భంగా...**

కానీ చైత్రశుక్ల నవమినాడు చేసే సీతారాముల కల్యాణానికి ఉండే ఒక ప్రత్యేకత అందరినీ ఆకట్టుకుంటుంది. పండిత పామరులందరినీ కట్టి పడేస్తుంది. సీతారామకల్యాణం రమణీయం కమనీయం. జాన కమ్మ రామయ్యల కల్యాణంలో తలంబ్రాల వేడుక మరీ అద్భుతం.

దశరథ మహారాజు లేకలేక కన్నబిడ్డ శ్రీరాముడు. కౌసల్య ఎన్నో వ్రతాలు, నోములు నోచి పొందిన ముద్దుల తనయుడు. అలాంటి రాముడిని విశ్వామిత్రుడు లోకకల్యాణం కోసం యాగరక్షణకు తీసుకువెళ్లాడు. రాముడు తమ్మునితో కలిసి రాక్షస సంహారం చేశాడు. యాగ పరిసమాప్తి జరిగింది. శాంతి ఎల్లెడలా పరిఢవిల్లింది.

ఇక తిరుగు ప్రయాణంలో జనక మహారాజు దగ్గరున్న శివధనుస్సు కథను తన శిష్యులకు చెప్పాడు విశ్వామిత్రుడు. వారిలో ఉత్సాహం ఉరకలెత్తింది. ఆ ధనుస్సును చూడాలనుకున్నారు. అంతే! రామలక్ష్మణులను వెంటబెట్టుకొని మిథిలకు చేరాడు విశ్వామిత్రుడు. జనకుడు వారికి స్వాగతం పలికాడు. సేవకుల సాయంతో శివధనుస్సును యాగశాలకు రప్పించాడు. రాముడు గురువాజ్ఞపొంది, ధనుస్సుకు నమస్కరించాడు. శివధనుర్భంగం చేశాడు. సంతోషాతిశయంతో సీతను రామునకు అర్పించాడు జనకుడు. దేవతలు దుందుభులు మ్రోగించారు. మనుజులు మహోత్సవం చేసుకున్నారు. సిద్ధులు, మునులు, లోకా సమస్తా సుఖినోభవన్తు అని దీవించారు. ఆ సీతారాముల కల్యాణం లోకానికి దివ్యసందేశాన్నిచ్చింది.

రాముని చరితం మానవులకు మార్గగామి అయితే సీతాకల్యాణం కోమలులకు కంఠోపాఠం కావాలి. సీతారాముల కల్యాణం నిత్యస్మరణీయం. అందులో శివధనుర్భంగం ఆత్మపై విజయం అంటారు కొందరు. ప్రణవాన్ని వంచిన వారికి ఆత్మను అర్పించదగును అంటోంది ఉపనిషత్తు. ఆ ప్రణవమే ధనుస్సు. ఎంత మంది ప్రయత్నించినా చివరకు రామునకే వంగింది ఆ శివధనుస్సు. ఎందుకంటే జీవుడికి దేవుడికి ఉన్న సంబంధ చిహ్నమే ధనుస్సు. అసలు ప్రణవానికి శాస్త్రార్థం ఓంకారం, ధనుస్సు అనే కదా. అందుకే దేవుడైన రాముని చేతిలోనే విరిగింది శివధనుస్సు.

శ్రీరాముడు వసంత ఋతువులో చైత్ర శుద్ధ నవమి రోజు పునర్వసు నక్షత్ర కర్కాటక లగ్న అభిజిత్ ముహూర్తాన అనగా, మధ్యాహ్నం సరిగ్గా 12:00 గంటలకు త్రేతాయుగంలో జన్మించాడు. శ్రీ మహా విష్ణువు భూలోకంలో శ్రీరాముడిగా మానవరూపంలో అవతరించిన రోజున దేశమంతటా పండుగ చేసుకుంటారు. చైత్రశుద్ధ నవమి రోజు శ్రీరాముడి వివాహం, పదునాలుగు సంవత్సరాల అరణ్యవాసం, రావణ సంహారం తరువాత శ్రీరాముడు సీతాసమేతంగా అయోధ్యలో పట్టాభిషిక్తుడైన రోజు కూడా చైత్ర శుద్ధ నవమే!

ఈ సమయంలో ఉత్తరాది రాష్ట్రాలలో బాల రాముడి జన్మదినోత్సవం చేసుకుంటారు. మన తెలుగు రాష్ట్రాల్లో మాత్రం శ్రీరామ కల్యాణం జరుపుకుటారు. తెలుగు రాష్ట్రాలలో ఊరూరా సీతారాముల విగ్రహాలకు వివాహం చేసి కల్యాణ రాముణ్ణి సాయంత్రం ఊరేగిస్తారు. మహారాష్ట్రలో చైత్ర నవరాత్రి పేరుతో

జరుపుకుంటే తెలుగు రాష్ట్రాలలో వసంతోత్సవం పేరిట తొమ్మిదిరోజులు నిర్వహిస్తారు. రామనవమి నాడు ఉదయాన్నే సూర్యుడికి ప్రార్థన చేయడంతో ఉత్సవం ప్రారంభం అవుతుంది.

శ్రీరాముడు మధ్యాహ్నం 12:00 గంటలకు పుట్టాడు కాబట్టి మధ్యాహ్న సమయంలో ప్రత్యేక ప్రార్థనలు నిర్వహిస్తారు. ఉత్తర భారతదేశంలో శ్రీరామ నవమిని అత్యంత వైభవంగా చేస్తారు. భక్తులు సాయంత్రం అందంగా అలంకరించిన రథంపై శ్రీరాముణ్ణి ఊరేగిస్తారు. ఈ ఊరేగింపులో సీతారాములు, లక్ష్మణుడు, హనుమంతుల పాత్రధారులు రథంపై ఆసీనులై ఉంటారు. ఆ రథం వెంట పురాతన వేషధారణల్లో శ్రీరాముని సైనికులు అనుసరిస్తారు.

### మధురమైనది రామనామం

రమ్యమైనది, మధురమైనది రామనామం. రామా అంటే చాలు పాపాలన్నీ పటాపంచలైపోతాయట. అందుకే 'తారకనామము కోరిన దొరకదు ధన్యుడనైతిని చాలన్నా' అని శ్రీరామదాసు సైతం రామనామం కన్నా తనకు ఏమీ అక్కర్లేదని తన కీర్తనలతో కీర్తించాడు. రామ శబ్దంలో 'రా' అనే అక్షరం పలకగానే నోరు తెరుచుకుని మనలోపల ఉన్న పాపాలు అన్నీ బయటకు వచ్చి రామనామ అగ్నిజ్వాలలో పడి దహించుకుపోతాయట. 'మ' అనే అక్షరం ఉచ్చరించినప్పుడు నోరు మూసుకుంటుంది కాబట్టి బయట మనకు కనిపించే ఆ పాపాలు ఏవీ మానవుల శరీరాలలోకి ప్రవేశించలేవు.

కైలాసంలో ఒక రోజు పార్వతీదేవి పరమశివుణ్ణి ఈ విధంగా ప్రశ్నించింది 'స్వామీ! కేనోపాయేన లఘునా విష్ణోర్నామ సహస్రకం' అని విష్ణు సహస్రనామ స్తోత్రానికి కాస్త సూక్ష్మమైన మార్గం చెప్పమని కోరింది. దానికి ఈశ్వరుడు 'ఓ పార్వతీ! నేను నిరంతరం ఆ ఫలితం కోసం జపించేది ఇదే సుమా!' అని చెప్పి ఈ శ్లోకంతో మంత్రోపదేశం చేశాడు.

**శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే !**
**సహస్ర నామతత్తుల్యం రామనామ వరాననే !!**

ఈ శ్లోకం మూడుసార్లు స్మరించినంత మాత్రానే ఒక్క విష్ణు సహస్రనామ పారాయణ ఫలితమే కాదు, భక్తులకు శివసహస్రనామ ఫలితం కూడా లభిస్తుంది. 'రామ' అంటే రమించడం అని అర్థం కాబట్టి మనం ఎప్పుడూ మన హృదయాలలో శ్రీరాముని స్మరిస్తూ ఉండాలి. ఎవరయితే భక్తులు కాశీలో జీవిస్తూ ఆ పుణ్యక్షేత్రంలో మరణిస్తారో వారి మరణ సమయాన ఆ భక్తవశంకరుడే ఈ తారకమంత్రం వారి కుడి చెవిలో చెప్పి వారికి సద్గతి కలిగిస్తాడన్నది భక్తుల ప్రగాఢ విశ్వాసం. అష్టాక్షరి మంత్రం అయిన ఓం నమో నారాయణాయలో 'రా' అనే అక్షరం, పంచాక్షరి మంత్రం అయిన ఓం నమఃశివాయలో 'మ' అనే అక్షరం కలిస్తే రామ శబ్దం ఉద్భవించింది. వీటిని జీవాక్షరాలు అంటారు. రామ అనే శబ్దం శివకేశవుల సమానత్వాన్ని తెలుపుతుంది. రామునికన్నా కూడా రామనామం గొప్పదని రామాయణ కావ్యం వెల్లడిస్తుంది.

మనిషి సలక్షణంగా తన మనుగడ సాగించాలంటే తగినంత ఉష్ణం, శీతలం తప్పనిసరిగా కావాలి. 'రామ' శబ్ద ఉచ్చారణ మనకు అలాంటి శక్తిని కలగజేస్తుంది. రామ శబ్దంలో 'రా' అన్న అక్షరం అగ్నికి, 'ఆ' అనే అక్షరం సూర్యుడికి, 'మ' అక్షరం చంద్రునికి ప్రతీక. కనుక వాటి అర్థసారం ఈ పద ఉచ్చారణలో ఇమిడి ఉంటుంది. అదేంటి రామ అన్నది రెండే అక్షరాలు కదా మూడు అర్థ విశేషాలు ఏమిటి? అనుకుంటున్నారా? చూడ్డానికి రెండుగా ఉన్నా వాస్తవానికి అవి మూడు అక్షరాలు. 'రా', 'ఆ', 'మ' అంటే రాలో ఉన్న దీర్ఘాన్ని 'ఆ' గా తీసుకుంటే అవి మొత్తం మూడు అక్షరాలే అవుతాయి.

## శ్రీరామ పూజా విధానం

శ్రీరామనవమి రోజు ఉదయం ఆరు గంటలకు నిద్రలేచి, తలంటు స్నానం చేసి పసుపు రంగు దుస్తులు ధరించాలి. పూజామందిరము, ఇల్లు మొత్తం శుభ్రం చేయాలి. పూజామందిరము, గడపకు పసుపు కుంకుమలు దిద్ది ఇంటి ముంగిటను రంగవల్లికలతో అలంకరించాలి. పూజకు ఉపయోగించే పటాలకు గంధము, కుంకుమ పెట్టి సిద్ధంగా ఉంచాలి. శ్రీ సీతారామ, భరత లక్ష్మణ శత్రుఘ్నులతో కూడిన పటము లేదా శ్రీరాముని ప్రతిమను గానీ పూజకు ఉపయోగించవచ్చు. పూజకు సన్నజాజి, తామర పువ్వులు, నైవేద్యానికి పానకం, వడపప్పు, పండ్లు సిద్ధం చేసుకోవాలి. అలాగే పూజకు ముందు శ్రీరామ అష్టోత్తరము, శ్రీరామరక్షా స్తోత్రము, శ్రీరామాష్టకము, శ్రీరామ సహస్రము, శ్రీమద్రామాయణం వంటి స్తోత్రాలతో శ్రీరాముణ్ణి స్తుతించాలి. ఇంకా రామాయణంలో ప్రత్యేకించి శ్రీరామ పట్టాభిషేక అధ్యాయ పారాయణం చేయడం ద్వారా శుభఫలితాలు చేకూరుతాయి.



### వివాహబంధానికి ఆదర్శం

భార్యాభర్తలు అంటే లక్ష్మీనారాయణ స్వరూపాలే అంటారు. కన్యాదాత కాళ్ళు కడిగి కన్యాదానం చేసేది సాక్షాత్తూ ఆ విష్ణుస్వరూపునికే అని భావిస్తాడు. అందులో ఉన్న పరమార్థాన్ని తేటతెల్లం చేయడానికే జనకుడు "ఇయం సీతా మమ సుతా సహధర్మచరీ తవ" అంటాడు. ఈమెను చేపట్టిన నీకు శుభం కలుగుతుందంటాడు. నారాయణ దత్తమైన మనస్సుకు శుభం కాక మరేమి కలుగుతుంది? భగవద్గీతలో శ్రీకృష్ణుడు ఎవరైతే తనను 'నాస్తి త్వమేవ శరణం మమ' అంటారో వారి యోగ క్షేమాలు అన్నీ నేను చూసుకుంటాను అని చెప్పాడు కదా. అందుకే నారాయణునికి దత్తం చేసిన మనస్సు నారాయణ స్వరూపమే అవుతుంది. అందుకే సీతారాములు అనురూపులు. సీత హృదయంలో ఉన్నదే రాముని హృదయంలోనూ ఉంటుంది. రాముని హృదయఫలకమే సీతాహృదయం. నూతన వధూవరులను ఆశీర్వదించేటప్పుడు సీతారాముల లాగా ఉండమనడంలోని పరమార్థమిదే. స్థూలకంటికి ఏక పత్నీవ్రతం ఆచరించినా శ్రీరాముడు సూక్ష్మంగా చెప్పున్నదీ అదే. జగం, జగన్నాథుడు వేరు కాదుకదా. సీతారాములను నిత్యం స్మరించడమే కాదు వారి జీవనయానాన్ని ఆదర్శంగా తీసుకోవాలి. వారు నడిచిన దారిలోనే మనం నడవడానికి నడుం కట్టాలి. సీతారామ కల్యాణంలోని ఆ వివాహ విశిష్టతను అవగాహన చేసుకోవాలి.

మానవ సంబంధాలు గతి తప్పి, వికృత విశృంఖల ప్రవర్తన వెర్రితలలు వేస్తున్న ఈ రోజుల్లో మనిషితో మనిషి ఎలా జీవించాలన్న విషయం తెలుసుకోవడానికి సీతారాముల జీవితాన్ని అధ్యయనం చేయవలసిన అవసరం మునుపటికన్నా ఎక్కువగా ఉన్నది ఈరోజుల్లోనే.

రామకథా శ్రవణం, రాముని గుణగుణాల అధ్యయనం, రాముణ్ణి అనుసరించే ప్రయత్నం చేయడం ఎక్కువ అవసరం.

**– బ్రహ్మశ్రీ అవధూతశర్మ**

## నైవేద్యం విశిష్టత

శ్రీరామనవమి వేసవి ప్రారంభంలో వస్తుంది కాబట్టి శ్రీరాముణ్ణి పూజించిన తరువాత, మిరియాలు, బెల్లంతో కొత్తకుండలో చేసిన పానకం, వడపప్పు నైవేద్యం చేసి పంచి పెడతారు. ఈ ప్రసాదాల వెనుక ఆయుర్వేద్య పరమార్థం కూడా ఉంది. భగవంతుడికి నివేదించే ప్రసాదాలన్నీ సమయానుకూలంగా, ఆరోగ్యాన్ని బట్టి నిర్ణయించినవే. శరద్ ఋతువు, వసంత ఋతువు యముడి కోరలు లాంటివే అని దేవీ భాగవతం చెబుతోంది. పానకంలో ఉపయోగించే మిరియాలు, ఏలకులు వసంత ఋతువులో వచ్చే గొంతు సంబంధిత వ్యాధులకు ఉపశమనం ప్రసాదిస్తూ, ఔషధంలా పనిచేస్తాయని ఆయుర్వేదం నిర్ధారిస్తుంది. అదే కాకుండా పానకం శ్రీమహావిష్ణువుకు అత్యంత ప్రీతికరమైనది.



అలాగే పెసరపప్పు శరీరంలోని ఉష్ణాన్ని తగ్గించి, చలవ చేస్తుంది. జీర్ణశక్తిని అభివృద్ధి పరుస్తుంది. దేహకాంతికీ, జ్ఞానానికీ ప్రతీక పెసరపప్పు. దీన్నే వడపప్పు అంటారు. ఇది మండుతున్న ఎండలలో 'వడదెబ్బ' కొట్టకుండా వేడి నుంచి కాపాడుతుంది. పెసరపప్పు బుధగ్రహానికి ప్రీతిపాత్రమైనది బుధ గ్రహం బుద్ధి బలానికి గుర్తు. మనలోని చెడు బుద్ధిని నశింపచేసి మంచిని పెంచుకోవాలని చెప్పడం కూడా ఇందులోని పరమార్థం.

# టూ గ్రేటర్ దాన్ వన్

పెద్దింటి అశోక్ కుమార్

**లింగన్నపేటలో బస్సు దిగేసరికి రాత్రి పది దాటింది. కరెంటు లేదు. చుట్టూ చీకటి. నాతో దిగిన వారు తలో వైపు వెళ్ళిపోతున్నారు. నేను పక్కనే ఉన్న గుడిసె హోటల్‌లోకి వెళ్ళి మల్లారెడ్డిపేట బస్సు గురించి ఆరా తీశాను.**

**"ఇప్పుడే... ఐదు నిమిషాలయింది వెళ్ళి" అన్నాడు.**

**నాకు పాణం దస్సుమంది. 'అయ్యల్లా... జెట్టన్నే పోయింది ఎట్ల మరి...' అనుకున్నాను. అక్కడికి మా ఊరు నాలుగు కిలోమీటర్లే. నడిస్తే అరగంట. కాని రాత్రి పూట. అందునా నా దగ్గర లక్ష రూపాయలున్నాయి.**

**రాత్రి బస్సును నమ్ముకుని వచ్చినందుకు నన్ను నేను తిట్టుకున్నాను. చలికాలం కావటంతో అప్పటికే షాపులన్నీ మూసుకున్నాయి. రోడ్డున పోయే ఒకటి రెండు వాహనాల చప్పుడు తప్ప అంతా నిశ్శబ్దంగా ఉంది.**



తెరిచి ఉన్న హోటల్ కూడా తడికె వేసి మూసుకున్నారు. బయటకు వస్తుంటే నాతో దిగిన మరో వ్యక్తి కనిపించాడు.

"ఎక్కడికెళ్ళాలి?" అడిగాను.

"కోరుట్లపేట..." అన్నాడు.

కోరుట్లపేట మా ఊరికి నాలుగు కిలోమీటర్ల దూరం. మా ఊరి మీది నుంచే వెళ్ళాలి. అతను కూడా రాత్రి బస్సును నమ్ముకునే వచ్చినట్లున్నాడు.

"ఎట్లపోతవు మరి.." అడిగాను.

"ఎట్లపోత... నడిచిపోత దండి దూరమా... గంట గంటన్నర గంతే.." అంటూ నడవడం మొదలెట్టాడు.

నాకు ధైర్యం వచ్చింది. కలిసి పోవచ్చునను కున్నాను. అంతకుమించి అవకాశం కూడా లేదు. ఆటోలు కూడా దొరకవక్కడ. ఆగుదామన్నా పరిచయస్తులు లేరు.

"బస్సు పాడుగాను... ఎప్పుడూ పదిన్నర దాటనిది రాకపోతుండె. ఇయ్యల్లనే జెట్టన పోయింది.." అనుకుంటూ అతని వెంట నడిచాను.

'కొన్ని అంతే అన్నా.. అవసరమన్నయి దొరుకయి. దొరికినయి అవసరముండయి. బతుకంటే అదే గదా.." అన్నాడు.

దారి వెంట కుక్కలు మమ్మల్ని చూసి మొరుగుతున్నాయి. వాటిని అదిలిస్తూ నడుస్తున్నాం. చలి బాగా విసురుతోంది. జేబులోంచి కర్చీఫ్ తీసి చెవులకు చుట్టుకున్నాను. అతడు కూడా కర్చీఫ్ కట్టుకున్నట్టున్నాడు. భుజానికో బ్యాగుంది. రెండు చేతులను ప్యాంటు జేబులో పెట్టుకుని నడుస్తున్నాడు.

"ఏ ఊరన్నా? కోరుట్లపేటకేనా.." నడుస్తూ అడిగాను.

"ఆ... కోరుట్లపేటన్నట్టే..." అన్నాడు. అలా ఎందుకన్నాడో అర్థం కాలేదు. కోరుట్లపేటలో నాకు కొంత మంది తెలుసు. అతడిని పోల్చుకుంటూ "ఏం పేరు.." అడిగాను.

"సిమ్మాద్రి..." చెప్పాడు.

సరిగా వినిపించక మళ్ళీ అడిగాను. ఈసారి కాస్త గట్టిగా చెప్పాడు. ఆ ఊరిలో ఇంతవరకూ అలాంటి పేరు వినలేదు. మాట కూడా కొంత యాసగా ఉంది.

"తెనుగోల్లా.." అడిగాను.

"కాదు. మందగొల్లోల్లం..." అన్నాడు.

మందగొల్ల జాతి ఆ ఊరిలో ఉన్నట్టు కూడా నేను వినలేదు. అదే మాటంటూ, మంద గొల్లోల్లు కోరుట్ల పేటల లేరు గదా... మీ తండ్రి పేరు..." అడిగాను అనుమానంగా.

నా అనుమానాన్ని గుర్తించినట్టున్నాడు. కొంత అసహనంగా ఏదో పేరు చెప్పాడు. ఆ పేరు కూడా వినలేదు. వెంటనే నాకు కామారెడ్డిలో డబ్బులిస్తూ దుకాణం సేటు చెప్పిన మాటలు గుర్తుకు వచ్చాయి.

# నవ్యవీక్లి-ఉపాధ్యాయుల భాస్కరరావు స్మృతి సాహితి కథల పోటీలో ద్వితీయ బహుమతి రూ.8,000 పొందిన కథ

"సేటు అన్నట్టు డబ్బులు తీసుకుంటుండగా చూసి నన్ను వెంబడించడం లేదు కదా.." అనుకున్నాను. ఒకసారి జేబును తడుముకున్నాను. కొత్త రెండువేల నోట్లు కావడంతో బెల్ట్ పాకెట్లోనే పెట్టుకున్నాను. అయినా పైకి ఉబ్బుగా కనిపిస్తున్నాయి.

అప్పటికి పోచమ్మగుడి దాటి చాలా దూరం వచ్చాం. ఊరకుక్కల అరుపులు కూడా వినిపించడం లేదు. ఎందుకైనా మంచిదని అతని వెనకనే నడుస్తున్నాను. అప్పటికి కళ్ళు చీకటికి పూర్తిగా అలవాటు పడ్డాయి. అతను స్పష్టంగా కనిపిస్తున్నాడు. నాకంటే బక్కగా పీలగా ఉన్నాడు.

'దొంగెదవలు. వీళ్ళు సత్తునా బతుకుదునా అన్నట్టు ఇట్లనే ఉంటరు. మనుసుల్ని నమ్మిత్తరు. దున్నపోతుల లెక్క ఉన్నోళ్లు ఎక్కడనో తొవ్వలు గాత్తరు..' అనుకుంటూ సెల్‌ఫోన్ తీసి ఇంటికి ఫోన్ చేశాను. ఎత్త లేదు. ఫ్రెండ్‌తో మాట్లాడుతున్నట్టుగా అతనికి వినిపించేట్టు గట్టిగా "ఆ... వత్తున్న.. వత్తున్న. బండి అందుకుని ఎదురుంగరా.." అంటూ ఏదో చెప్పబోయాను. మిస్డ్ కాల్ చూసుకున్నట్లుంది... నాభార్య నుంచి ఫోన్. మాట్లాడుతుండగానే రింగ్‌టోన్.

నా మాటలకు ఆగి నావైపు ఆసక్తిగా చూస్తున్న అతడు రింగ్‌టోన్ విని పక్కున నవ్వాడు. నేను దొరికిపోయాను. అసహనంగా ఫోన్ కట్ చేసి జేబులో వేసుకున్నాను.

"ఈ సెల్ మహా దొంగదన్నా.. మనుషుల్ని బలే నమ్మించి పట్టిస్తుంది. ఎవరో ఫోన్ చేస్తే వాడు చూస్త లేడు గదా అని ఇంట్లో ఉండి ఆఫీసులో ఉన్నమని చెప్పతం. కాని ఇంట్లో భార్యకు దొరికిపోతం. లేటయిన రోజు ఆఫీసులో ఉన్నానని నిజం చెప్పినా ఆమె నమ్మది. దోస్తుగాళ్ల గంతే" అన్నాడు.

"అమ్మో... వీడు జాదుగాడల్లె ఉన్నట్టుంది. వెంట వచ్చి తప్పుచేసిన్నా.." అనుకున్నాను. మాటల్లో పెట్టి అతని వివరాలు లాగాలనుకుని "ఇంత లేటయింది. ఎటు పొయినవు మరి. ఏ ఊరికి.." అడిగాను.

"ఎటు పొయినవు అనుడుకంటే ఎక్కడి నుంచి వత్తన్నవు అని అడుగు చెప్పత" అన్నాడు.

"ఊ... వీడు మాటకారే ఉన్నట్టున్నాడు" అనుకుని ఏదో ఒకటి చెప్పు అన్నాను.

"జైలు నుంచన్నా.. చంచల్‌గూడా సెంట్రల్ జైలు నుంచి" అన్నాడు.

పిడుగుపడ్డట్టు అదిరిపడ్డాను. నా అనుమానం మరింత బలపడింది. ఓ క్షణం నడక ఆగి పోయింది. వీడు ఖచ్చితంగా నన్ను వెంబడించి వస్తున్న దొంగే అనుకున్నాను. బింకంగా నడక మొదలుపెట్టినా భయంతో కాళ్ళు వణుకుతున్నాయి. నడుస్తూనే ఒకసారి వెనక్కి తిరిగి చూశాను. కరంటు వచ్చినట్టుంది. ఊరు దూరంగా మిణుకుమిణుకు మంటోంది. దారికి ఇరు వైపుల ఉన్న చిమ్మట్ల రొద గుయ్యిమంటోంది. చెట్లమీద పిట్టలు సర్దుకుంటున్నాయి. చిన్నగా అరుపులు వినిపిస్తున్నాయి.



భయంతో చలిమాటనే గుర్తుకు రావడం లేదు. అతడు మాత్రం చలికి వణుకుతున్నట్టున్నాడు. బిగదీసుకుని నడుస్తున్నాడు. కనీసం ఎన్నీల వచ్చినా బాగుండుననుకున్నాను. దాని జాడనే లేనట్టు ఆకాశం చిల్లులు పడ్డ నల్ల దుప్పటి కప్పుకుంది.

ఉన్నట్టుండి సిమ్మాద్రి వెనక్కితిరిగి "ఏందన్నా.. తేపతేపకు జేబు తడుముకుంటున్నావు. డబ్బు గాని దాచుకున్నావా.." అన్నాడు.

నా పంచప్రాణాలు చల్లబడ్డాయి. "నన్ను పూర్తిగా చూసిండు. వీడు నిజంగా దొంగనే" అనుకున్నాను.

అప్పటికి సాత్ నంబర్ ఎదురుగడ్డ ఎక్కినం. ఎత్తుమీద నుంచి అటు లంబాడి తండాలో, ఇటు లింగన్నపేటలో లైట్లు కనిపిస్తున్నాయి. రోడ్డువెంట పోయే లారీల చప్పుడు వినిపిస్తోంది. ఈ బోరు దిగిన మంటే రెండు కిలోమీటర్ల పొడవున అడివే. పొద్దంతనే ఒంటరి మనిషికి భయం.

అక్కడే ఆగిపోవాలా ముందుకు నడవాలా అన్న ప్రశ్న వచ్చింది. ఆగి మాత్రం చేసేదేమి లేదనిపించింది. అయినా కొద్దిసేపు నిలబడి ఆలోచించాను. నన్నే కాపలా కాస్తున్నట్టు అతడు కూడా ఆగిపోయాడు.

"అవుగనీ నీ పేరేంటన్నా.. మల్లరెడ్డిపేటనేనా..." అంటూ కల్వర్ట్ మీద కూర్చున్నాడు.

నేను భయపడితే వాడు మరింత భయపెడతాడనిపించింది. ధైర్యం తెచ్చిపెట్టుకుంటూ "కోరుట్లపేట అంటవు.. నేను తెలవదా? డీలర్ రాంరెడ్డిని. ఇటు ముస్తాబాద ఎస్సై, అటు గంభీరావుపేట ఎస్సై, మీ ఎల్లారెడ్డిపేట ఎస్సై నాకు దోస్తులే... ఇప్పుడు ఫోన్ గొడితే ఇంటి కత్తరు.." అన్నాను.

నా మాటల్ని లెక్కచేసినట్టు కనిపించలేదు సిమ్మాద్రి. ఎవరైనా బండి మీద వస్తరేమోనని వెనక్కీ ముందుకీ చూశాను. ఎవరూ రాలేదు. తప్పదన్నట్టు ముందుకు కదిలాను. అతడు కూడా ముందుకు కదిలాడు.

చీకట్లో జడలు విచ్చుకున్నట్టు దూరంగా చెట్లు ఊగుతున్నాయి. విప్పుతున్న జడల్లోంచి రాలుతున్న పువ్వుల్లా చెట్లమీద మిణుగురు పురుగులు కదులుతున్నాయి. ముందుకు నడుస్తుంటే మృత్యువు నోటిలోకి వెళ్తున్నట్టుగానే ఉంది నాకు. ఏ చిన్న చప్పుడయినా

ఆగి చూస్తున్నాను. సెల్‌ఫోన్‌ను రెడీగా చేతిలోనే పట్టుకున్నాను. ఏ మాత్రం తేడా కనిపించినా పరుగెత్త డానికి కాళ్ళను సిద్ధం చేసుకున్నాను.

"ఈ తొవ్వ పూర్తిగా మారిపోయిందన్నా.. ఆరే డేండ్లయింది ఇటురాక. అప్పుడు ఈ డాంబరు రోడ్డే లేదు. మట్టిరోడ్డే. చెట్లు మామూలుగుండెనా.. ఇక్కడి నుంచి మెట్టుగుట్టల దాకా కానుగ వనమే. ఆ చెట్లే లేనట్టున్నయి గదా.." నడుస్తూ అన్నాడు.

"ఆ... రోడ్డు పెద్దగ జేసిండ్రు గదా. చెట్లు నరికిండ్రు. ఇంతకు జేలుకు ఎందుకు పోయినవు.. ఏదన్న కేస యిందా?" అడిగాను.

అతడు ఆగి జేబులోంచి బీడీ తీసి అంటించాడు. నాకు ఒకటి ఇవ్వబోతే వద్దన్నాను. బీడీ దమ్ము లాగి పొగను వదిలాడు. అది చీకట్లో కనిపించలేదు కాని ఘాటైన వాసన ముక్కు పుటాలకు తగిలి నన్ను ఉక్కిరి బిక్కిరి చేసింది.

చెప్పాలా వద్దా అని ఆలోచిస్తున్నట్టున్నాడు. నేను మళ్ళీ అడగలేదు. తనే కొద్దిసేపటి తర్వాత "నీకు ముత్యాలు తెలుసునా అన్నా... కోరుట్లపేట" అన్నాడు.

"ఈ దొంగ ఎదవలు నమ్మించడానికి ఏదో కథలు చెప్పతరు. పరిచయమున్న వాళ్లందరు చుట్టాలే అంటరు" అనుకుంటూ "ఆ... తెలుసు తెలుసు" అన్నాను.

అతడు ఆగి వెనక్కి తిరిగి ఆత్రుతగా "ఈ మధ్య చూసినవా అన్నా" అన్నాడు. నేను చూడలేదు అన గానే ఏమనుకున్నాడో కాని అతని గొంతులో నిరాశ కనిపించింది.

"ముత్యాలు ఒట్టి పొగరుబోతులా కనిపిస్తుం దన్నా.. కాని చానా మంచిది. దాన్ని నేను మొదటి సారి చిక్కుడోనిపల్లె, బానప్ప చెరువు కట్ట మీద చూసిన. లెక్కలు రాసే గుత్తదారుతోని ఏదో వాది స్తోంది. నేను చూసి చూడనట్టే వెళ్ళిపోయిన. అప్పుడు చెరువు పని నడుస్తోంది. మేము పాలమూరు నుంచి పదిమంది దాకా వచ్చినం. అక్కడనే గుడిసెలేసు కున్నం. మాలెక్కనే వందమంది దాకా గుడిసెలేసు కున్నరు. ముత్యాలు కూడా ఓ గుడిసేసుకున్నట్టుంది. ఆ రోజే దాన్ని చూడ్డం. పగటి పూట ఎండపొద్దు కదా... సద్ది తిని చెట్టు నీడకు ఒరిగిన. కన్నంటుకుంది. ఎవరో తడితే నిద్ర లేచిన. ఎదురుగా ముత్యాలు. పొద్దున చూడలేదు కాని కండ్లను నిలేసే అందం దానిది. ఇరవై, ఇరవై రెండుంటది అంతే! చెమటతో తడిసిన బట్టల్లో బిర్రెక్కి ఉంది. నాదిక్కు కోపంగా చూస్తూ 'నువ్వు మగోనివి కాదా.. నీకు పౌరుషం లేదా... ఉప్పుకారం తినవా' అన్నదన్నా.." అంటూ ఆపాడు.

"ఓహో... నీది పాలమూరా... అట్లజెప్పు. ఇంకా జాగ్రత్తగుండాలె" అనుకున్నాను. పైకి మాత్రం అతని మాటలే వింటున్నట్టు "ఆ.. అట్లెందుకన్నది. అసలు నీకు పరిచయమే లేదు. నువ్వు మాటకూడా అన లేదు మరి" అన్నాను.

ఇద్దరం నడుస్తున్నాం. అడుగుల చప్పుడు తప్ప అంతా నిశ్శబ్దం. అప్పుడప్పుడు మాత్రం గుట్ట మీద నెమళ్ల అరుపులు. ఆకాశంలో చుక్క నేలరాలినట్టు అప్పుడప్పుడు చేతిలోని బీడి మూతివరకు వెళ్లి వేగంగా కిందికి దిగుతోంది.

"నేను అట్లనే అడిగిన. ఆ గుత్తదారు గాడు ఏవో మాటలన్నడట. నేను వినసే లేదనుకో. విన్నా నాకేం పట్టి. అయితే నువ్వు ఎందుకు నోరుమూసుకున్నవు అంటది. నేను గుత్తదారును అడిగేదుండెనట" మళ్లీ బీడీ కదిలింది.

బలే కథ చెప్పుతున్నవురా అనుకున్న. అతని మాటలు వింటున్నా నా దృష్టి మాత్రం చుట్టుపక్కల మీదనే ఉంది. ఎక్కడ శబ్దం వినిపించినా ఆగి చూస్తున్న. నేను చూస్తున్న విషయం అతనికి తెలియ కుంట జాగ్రత్త పడుతూ, "నువ్వెందుకంటవు. నీకు ఆయా బాయా" అన్నాను.

అతని గొంతులో కొద్దిగా జీర ఉంది. జాగ్రత్తగా వింటే తప్ప మాటలు అర్థం కావు. అతని మాటలకు నేను ఇప్పుడిప్పుడే అలవాటు పడుతున్నాను.

"నిజం చెప్పినవన్నా... అచ్చంగా నేను అట్లనే అడిగిన. అదేమందో తెలుసా... ఓ ఆడదాన్ని చెయ్యి పట్టుకుని వత్తవా అన్నప్పుడు, అన్న నా కొడుకును తన్నడానికి నేను నీ ఆయిని బాయినే కావాలా అన్నది. అది అడిగిన తీరుకు కోపం వచ్చినా గుత్త

**ఎక్కాల్సిన బస్సు మిస్సవ్వడంతో లెఫ్టూ రైటూ మొదలెట్టాడతను. అడవిదారి. నెమళ్ళ కూతలు, కీచురాళ్ళ చప్పుడు అతని భయాన్ని రెట్టింపు చేస్తున్నాయి. కాళ్ళ సందుల్లోంచి కుందేళ్ళు పరిగెడుతున్నాయి. నడుస్తూ ఎందుకో ఆగి వెనక్కి తిరిగి చూశాడు. పది అడుగుల దూరంలో ఎవరో వ్యక్తి తననే అనుసరించి వస్తున్నాడు. ఎవరా వ్యక్తి? ఇద్దరికిద్దరూ తెలిసినవాళ్ళేనా? అసలేమిటి వీళ్ళిద్దరి కథ?**

దారు కంట్లో పడ్డందుకు జాలేసింది. అసలే వాడు ఆంబోతులా తిరుగుతున్నాడు" అన్నాడు.

ఓ కుందేలు పిల్ల సర్రున పొదల్లోంచి రోడ్డుకు అడ్డంగా పరిగెడుతూ నా కాళ్ళకు తాకింది. నేను భయపడి అడ్డం పడబోయి నిలదొక్కుకున్నాను. తర్వాత నడకను కొనసాగిస్తూ "ఎందుకు... అంతమంది ఉండంగ నిన్నే ఎందుకడిగిందట.." అన్నాను.

"కూలి పనికి జంటగా వస్తేనే విడిచిపెడతరు. ఒంటిగా వస్తే మాత్రం వెంటపడతరు. దానికి నేను మేనబావనని, త్వరలో పెళ్ళి చేసుకుంటామని గుత్త దారుకు చెప్పిందట" చెప్పాడు.

"ఉషారు పిల్లనే. అయినా అంతమందిల నువ్వే నచ్చినవటనా... నీలో ఏం కనిపించిందో" అడిగాను.

అప్పుడే మరో కుందేలు పరిగెత్తింది. ఈసారి అది సిమ్మాద్రి కాళ్ళకు తగిలింది. వెంటనే ఆగిపోయాడు. నేను కూడా ఆగిపోయాను. నన్ను దోచుకోవాలను కున్న జాగ ఇది కాదు గదా అన్న అనుమానం కలి గింది. చీకట్లో ఎవరైనా నావైపు వస్తున్నారా అని చుట్టూ చూశాను.

"అన్నా... ఇది కూరుకుజాము. కుందేళ్ళు మాంచి కునుకుతీసే సమయం. ఇట్లా అడ్డంగా పరుగు పెడు తున్నాయంటే అవి ఏదో ప్రమాదాన్ని పసిగట్టి ఉంటాయి. రెండు నిమిషాలు ఆగుదాం" అన్నాడు.

నాకేదో అనుమానం. అప్పటికి మేము లంబాడి హనుమండ్లను దాటి మేలకుంట్లకు చేరుకున్నాం. నేను మరింత అలర్టుగా నిలబడ్డాను.

అన్నట్టుగానే దూరం నుండి ఏదో చప్పుడు. గంతులు, అరుపులు. చూస్తుండగానే అది మరింత దగ్గరయింది. ఇద్దరం రోడ్డు పక్కనే ఒదిగి నిలబడ్డాం. అడుగు దూరంలోంచే కోతులు మందలకు మందలు దాటిపోయాయి. అవి వెళ్ళిపోయే వరకు ఊపిరి బిగ పట్టి నిలబడ్డాం.

అవి వెళ్ళిపోయాక ఊపిరి పీల్చుకుంటూ, "లేచిన గడియ మంచిదన్నా.. నాలుగు అడుగులు ముందుకు వెళ్ళివుంటే మంద మధ్యలో ఉండేవాళ్ళం. ఏ కోతి పిల్లనో పసిగట్టిందనుకో... మన పని అయిపోతుండె" అన్నాడు సిమ్మాద్రి.

నిజమే అనిపించింది. ఇంకా ఏమైనా గుంపులు మిగిలినయేమోనని చూశాం. లేవని నమ్మకం కుదిరి నాక నడక మొదలుపెట్టాం. తను మళ్ళీ ముచ్చట కొనసాగించాడు.

"అవునన్నా.. నిజం చెప్పినవు. నేను అదే అడిగిన. ఇంతమందిల నన్నే ఎందుకు చెప్పినవు అని. అప్పుడు ఏమన్నదో తెలుసునా అన్నా... అది మెచ్చుకుందో ఎక్కిరిచ్చిందో తెలువది కాని ఇంకొకడి పేరు చెపితే తెల్లారి నుంచి వాడు ఎంటపడతడట. అందుకే నా పేరు చెప్పిందట."

"అయితే నువ్వు ఎంటపడవటనా.."

అతడు సీరియస్‌గా "నాకు అంత సీను లేద టన్నా. నేను ఉత్త పోషిగాన్నట. నాకు కోపం రాదా.."

నాకు నవ్వొచ్చింది. ఆపుకున్నాను. పాము, మనిషి ఒకే గదిలో ఉన్నప్పుడు మొదట భయం వేసినా పాము కదలికల మీద నిగా పెట్టినంక సమయం గడుస్తుంటే భయం తగ్గుతుంటది. ఇప్పుడు నాకు అలాగే ఉంది. కొంత చావు తెగింపు వచ్చింది. "అయితే మరి నువ్వేమన్నవు. ఎంటపడ్డవా.." అడిగిన.

సిమ్మాద్రి బీడీని విసిరికొడుతూ, "అది చెప్పింది కూడా నిజమే అన్నా. దాని అందం చూసినప్పుడు ముచ్చటపడ్డా, మాట్లాడాలంటే భయమేసేది. అది కూడా నా వైపు చూసి ఓ నవ్వు విసిరిపోయేదే కాని మాట్లాడేది కాదు. అప్పుడప్పుడు గుత్తదారు కలిసిన ప్పుడు మాత్రం అనుమానం రాకుండా చనువుగా ఉండేది. వాడు కూడా దాని మాటలు నమ్మినట్టున్నాడు."

నేను వింటూ సెల్‌ఫోన్‌లో టైం చూశాను. బయలు దేరి అప్పుడే అరగంట దాటింది. సరిగ్గా సగం దూరం నడిచి సెంటర్ పూలుగు వద్ద ఉన్నాం. రాత్రిపూట కాబట్టి తొవ్వ దుగుతలేదు. నడక మెల్లిగా సాగుతోంది.

అతని మీద కొంత కొంత నమ్మకం కుదురు తోంది. అయినా ఏదో అనుమానం. ఊరు చేరేవరకు నా జాగ్రత్తలో నేను ఉండాలనుకున్నాను.

సెంటర్ పూలుగు దాటుతుండగా పిల్లుల అరు పుల్లా నెమళ్ళకూతలు వినిపించాయి. అతడు అలాగే కాలు ఆపాడు. నేను కూడా ఆగాను.

"ఈ నెమళ్లు ఉన్నాయి చూడన్నా.. మహారంకు ముండలు. మొగనెమలి ఏడుస్తే ఆడ నెమలి వచ్చి కన్నీళ్ళు తాగుతుందని, అప్పుడు అవి గుడ్లు పెడత

యని జనం చెప్పుకుంటరు గదా.. అంత ఉత్తదే! అవి మనలెక్కనే అడ్డంగా పండి కుమ్ముకుంటుంటే ఆడ నెమలి ఉంటుంది చూడు.. వరుసగా మూడు మొగ నెమళ్లు పారితే తప్ప దానికి తృప్తి ఉండదు..” అన్నాడు.

ఇంతింతకు అరుపులు ఎక్కువైనయి. చెల్లాచెదురైతలో వైపు పరుగులు తీస్తున్నట్టున్నాయి. ఏవో జంతువులు మందగా వస్తున్నట్టు అడుగుల చప్పుడు. ఆగి అలాగే చూస్తున్నాం. అడవిపందుల గుంపు ఒకటి మా ముందునుంచే వెళ్ళిపోయింది.

అడవి మర్మం అతడికి పూర్తిగా తెలుసని నాకు అర్థమైపోయింది.

అడవి ఇలా ఉంటుందన్న విషయం కూడా నాకు తెలియదు. ఎప్పుడో చిన్నప్పుడు తప్ప రాత్రిపూట నడిచింది కూడా లేదు. ఇద్దరం ముందుకు కదిలాం.

“ఈ మందలన్నీ ఎక్కిడికెళ్తున్నాయి?” అర్థంకాక అడిగాను.

“దూపకన్నా.. నీళ్ళున్న తావుకు పోతున్నయి. తిండికి ఏ ఆకో పురుగో దొరుకుతుంది గాని నీళ్ళు ఎక్కడున్నాయి? రాత్రంతా వాటికి నీళ్ళ తావుల్ని వెతుక్కోవడంలోనే పోతుంది” అన్నాడు.

తర్వాత నేనే అతడిని కదిలించి ముత్యాలు గురించి అడిగాను.

అతను “ఉన్నట్టుండి ఓ నాడు సద్దెత్తుకుని నేను కూసున్న చెట్టు కిందికి వచ్చింది. మాట ముచ్చట లేకుండానే అన్నం కలిపి నోట్లో పెట్టింది. నాకు విచిత్రమనిపించింది. ఏంది కత.. ఎందుకు తినిపిస్తున్నావని అడిగాను. ఆ సచ్చినోడు ఇటే వస్తుండు. సచ్చినట్టు తిను అంటూ బలవంతపు నవ్వును ముఖాన పులుముకుంది.

రెండు నిమిషాల్లో గుత్తదారు బండిమీద మమ్ములను చూస్తూ వెళ్ళిపోయిండు. వాడు అటు వెళ్ళిపోగానే ఇది ఇటు డబ్బ సదురుకుంది. దాని అన్నం తిన్నందుకు నా డబ్బను ఇయ్యిమని డిమాండ్ చేసింది. దాని దబాయింపు చూస్తుంటే కోపం వచ్చినా, అందాన్ని చూసి ముచ్చటేసింది. నా టిఫిన్ డబ్బ ఇచ్చేశాను. వద్దనలేదు. నువ్వు చాన మంచోనివిరా.. ఎట్ల బతుకుతవో ఏమో అని వెళ్ళిపోయింది..” చెప్పడం ఆపాడు.

ఇద్దరం ఒంటిచింత దాటి మెట్టుగుట్టలు ఎక్కుతున్నాము. “అయితే నీ పేరు చెప్పుకుని అది సేఫ్‌గా ఉన్నదన్నట్టు. మరి గుత్తదారు ఏమనలేదా?” అడిగాను.

‘దాన్ని సతాయించకుండా కొన్నిరోజులు బాగానే ఉన్నడు. నేను మంచోడినని తెలిసినంక వాడిక్కూడా ఆడుకోవాలని బుద్ధి పుట్టినట్టుంది. ఓనాడు పట్టపగలు ముత్యాలు చెయ్యి పట్టుకున్నడు. నేను కొద్ది దూరంలో గొయ్యి తవ్వుతున్నాను. అది బావా అని అరిచింది. అన్నా.. ఆ ఒక్కపిలుపే నాలోని మంచి వాడిని ముంచేసింది. వెయ్యేనుగుల బలంతో పరిగెత్తిన. కట్టె అందుకుని నాలుగు గుంజిన. అంతే! తెల్లారి ఇద్దరికీ పని పోయింది. ఇయ్యాల్సిన డబ్బుకూడా ఇయ్యలేదు. అది నన్ను తిడుతుందేమో అనుకున్న. కాని తెగ మెచ్చుకుంది..” అతని మాటల్లో గర్వం తొంగి చూసింది.

ఈసారి ఎర్రగా పచ్చగా మెరుస్తూ కీచురాళ్ళ గుంపు వచ్చింది. మమ్మల్ని తాకుతూ వెళ్ళింది. ప్రవాహం మధ్యలో నిలబడ్డట్టుగా కొద్దిసేపు నిలబడ్డాం.



## అతగాడికన్నా ఆమెకే ఎక్కువ!

**ఇందులో**

*విపరీతార్థం ఏమీ లేదు. ప్రియుడు రణవీర్ కన్నా దీపికానే ఎక్కువ సంపాదిస్తోందట! హాలీవుడ్‌కి వెళ్ళిన తరువాత దీపిక ఆదాయం బాగా పెరిగింది. గతంలో బాలీవుడ్‌లో ఒక్కో సినిమాకి ఎనిమిది నుంచి పదికోట్లు పుచ్చుకునేది. హాలీవుడ్‌కి వెళ్ళిన తరువాత ఆమె డిమాండ్ రెట్టింపు అయ్యిందట! ఇప్పుడు సినిమాకి పది నుంచిపదిహేను కోట్లు తీసుకుంటోంది అంటున్నారు బాలీవుడ్ జనాలు. ఆమె ప్రియుడు రణవీర్ బాలీవుడ్‌లో స్టార్ హీరో స్థాయికి ఎదిగినా, రెమ్యునరేషన్ మాత్రం అంత అందుకోవడం లేదుట! అతగాడు ఒక్కో సినిమాకు ఎనిమిది నుంచి పదికోట్లు తీసుకుంటున్నాడట! ఈ రెమ్యునరేషన్ విషయం కారణంగానే ఇద్దరి మధ్యా విబేధాలు తలెత్తాయన్న పుకార్లు వినిపిస్తున్నాయి. అంతే కాకుండా దీపిక త్వరలోనే బాలీవుడ్‌కి బైబై కొట్టేయనుందని కూడా అంటున్నారు. ఇవన్నీ అబద్ధాలే అని దీపిక స్పష్టం చేస్తోంది.*

“ఇదేంటి... వీటిక్కూడా దాహమేనా?” అడిగాను.

సిమ్మాద్రి నవ్వుతూ “దాహమే.. కాని ఆ దాహం కాదు. ఎర్రగా మెరిసేవి మగవి. ఆకుపచ్చగా మెరిసేవి ఆడవి. గుంపులుగా వచ్చి ఈ మందలో చేరుతాయి. ఎక్కడవక్కడ జంటలుగా విడిపోయి ఏ చెట్ల ఆకుల కిందనో, రాళ్ళు రప్పల నడుమనో నతికి రాత్రంతా గడిపేస్తాయి” అన్నాడు.

మెట్టుగుట్టలు దిగుతుంటే మా ఊరిలో లైట్లు మిణుగురుపురుగుల్లా కనిపించాయి. అతనిపై నమ్మకం పెరిగింది. ఊరికి దగ్గర్లో ఉన్నానన్న ధీమా ఉత్సాహాన్ని నింపింది. అతడి కథ కూడా ఆసక్తిగా ఉండడంతో “ముత్యాలు వల్లనే కదా నీ పని పోయింది... నీకు కోపం రాలేదా...” అడిగాను.

“రాలేదు. అది ఎక్కడున్నా సంతోషంగా ఉంటే చాలనిపించింది. అందుకోసం నేను ఏమైనా చెయ్యాలనిపించింది. అదేమాట దానితో అంటూ ‘ఈ చెత్త నా కొడుకులు నిన్ను బతుకనియ్యరు గనీ ఇంటికెళ్ళి ఎవడినైనా పెళ్ళి చేసుకోవే” అంటూ నా వద్ద ఉన్న అయిదువెయిలు దాని దోసిట్లో పోశాను. అన్నా.. ఏమనుకున్నదో ఎర్రిమొహం ఒకే ఒక్క మాటన్నదన్నా..” అంటూ ఆగిపోయిండు.

కట్టు కాలువ దాటి చెరువంచుకు చేరుకున్నాం. అప్పుడు తూరుపు సందున సగం చీల్చిన బాదాం పప్పులా నెలవంక మొలిచింది. ఆ వెలుతురులో ఎండిన చెరువు బీటలు నల్లని గీతల్లా కనిపిస్తున్నాయి. అలసటగా చందమామ బండ మీద కూర్చున్నాడతను. నేను పక్కనే కూర్చుంటూ “ఏమన్నది.... తిట్టిందా...” అడిగాను.

అతడి గొంతు వణికింది. “ఏడ్చిందన్నా... బాగా ఏడ్చి... ‘ఒరేయ్ సిమ్మా.. నువ్వు మగానివే కాదనుకున్నారా... కాని ఇంతమందిలో నిజమైన మగానివి నీవేరా. మగతనమంటే ఆడదాన్ని ఆకలిగా చూడడం కాదురా.. దాని ఆకలి చూడడం. నువ్వు నిజంగా సింహానివిరా... చేసుకుంటే నిన్నే చేసుకుంట అని బిగ్గరగా అలుముకుందన్నా. నాకు ఎవలు లేరు, ముసలి అవ్వ తప్ప. దాని కెవలు లేరు. అట్ల కోరుట్లపేటనే నా ఊరయింది” అన్నాడు.

వెన్నెల వెలుగులో సిమ్మాద్రి మరింత స్పష్టంగా కనిపిస్తున్నాడు. సూదిమొనలాంటి ముక్కు, సన్నని మీసం, మేకగడ్డం... రంగు నలుపే అయినా మనిషి తెలివి మీద ఉన్నాడు.

ఇద్దరం లేచి నడక సాగించాం. బోడతూము గడ్డ దిగుతుండగా “అసలు విషయం చెప్పనేలేదు. మరి జైలుకెందుకు పోయినవు” అడిగాను.

చెప్పాలా వద్దా అని ఆలోచించినట్టున్నాడు. కొంతసేపు నిశ్శబ్దం. తర్వాత మెల్లిగా “ముత్యాలు నా బతుకులోకి అదృష్టాన్ని తెచ్చిందనుకున్నాను. అలజడిని కూడా తెచ్చింది. బానప్ప చెరువు గుత్తదారు చాలాసార్లు ఊరిలో కనిపించాడు. నేను చూసి చూడనట్టే ఉన్నాను. ఓసారి మా ఇంట్లోనే కనిపించాడు. ముత్యాలును నిలదీశాను. నన్నే అనుమానిస్తవా అని గొడవ చేసింది. నాకు కోపం వచ్చింది. బాగా కొట్టిన. మూడు రోజులు అది మంచంలోంచి లెవ్వలేదు. తర్వాత బాధపడ్డ... ఏడ్చిన. దాన్ని బతిమాలుకున్న. ఒట్టు పెట్టుకున్న. మూడు నాలుగు రోజులకు మళ్ళీ ఏదో మాటలో ముదిరింది. మాటకు మాటంటే మళ్ళీ కొట్టిన. అడ్డమస్తే అవ్వను కొట్టిన. కోపమొచ్చి నా ఊరికి నేనెళ్లిపోతానని పాలమూరు బస్సెక్కిన.

మా ఊర్లె ఓ మర్డర్ కేసయిందన్నా. దాన్ని నాకు చుట్టింర్రు. రాత్రికి రాత్రే పోలీసులు పట్టకపోయి మెత్తగ తన్నింర్రు... కోర్టుకు తిప్పింర్రు. జైల్ల పెట్టింర్రు. ఇగో.. ఇప్పుడు ఇడిసి పెట్టింర్రు” అన్నాడు.

ఇద్దరం బ్రమ్మంగారి గుడి ముందుకు వచ్చాం. అక్కడ లైటు వెలుగుతోంది. నాకు భయం పూర్తిగా పోయింది. కొద్దిసేపు గద్దె మీద కూర్చున్నాను. అతడు కూడా నా పక్కనే కూర్చున్నాడు. ఇంటికి పోదామనే ధ్యాసలో ఉన్నట్టున్నాడు. కుదురుగా కూర్చోలేక పోతున్నాడు.

"మరి.. ముత్యాలును మధ్యలో ఎప్పుడైనా కలిసినవా... నిన్ను చూడ్డానికి వచ్చిందా.."

"లేదన్నా.. దానికి విషయం తెలుసో లేదో తెలువది. జైల్లో ఉన్నప్పుడు మాత్రం మూడు నాలుగు... నాలుగైదు ఉత్తరాలు రాసిన.." అన్నాడు.

"మరి సమాధానం రాసిందా...?" అడిగాను.

"రాయొచ్చునన్నా.... జైల్ల ఎవలిత్తరు. దానికి ఎర్ర రంగు ఉంగరమంటే ఎంత ఇష్టమో! అద్దతులం బంగారంతో ఉన్న ఉంగరం కొన్న. అట్లనే తులం తులం రెండు బంగారు గాజులు.." అడక్కపోయినా మురిపెంగా చెప్పి వాటిని చూపించాడు.

లైటు వెలుతురులో వాటిని చూస్తుంటే కళ్ళు చెదిరాయి.

"బాగనే సంపాయించినవు.. ఏం జేసినవు జైల్ల?" అడిగాను.

"అక్కడ కూడా పనులు చేయిస్తరన్నా. పదో ఇరువయో ఇస్తరు. అవే దాసుకున్న. ఇంటికి పోంగనే గాసయి ఉండాలె గదా.. అదెన్ని కష్టాల్లో ఉందో... అందుకే కొంత క్యాష్ కూడా తెచ్చిన..." అంటూ బ్యాగ్ తెరిచి నోట్ల కట్టలు చూపించాడు.

నేను లేచి నిలబడ్డాను. అతడు కూడా నిలబడ్డాడు. "భయంతో చచ్చిపోతిని గదరా బాబూ... ఈ సంగతి ముందే చెప్పితే బాగుండు" అనుకుంటూ నడక సాగించాను.

ఈసారి అతడు నా వెనక నడుస్తున్నాడు. ఏదో గుర్తొచ్చినట్టు వెనక్కి తిరిగి, "సిమ్మాద్రి.. ఒకవేళ ముత్యాలు ఎవడినన్నా పెళ్ళి చేసుకుందనుకో... ఏం చేస్తవు?" అడిగాను.

టక్కున ఆగిపోయాడు అతడు. చలికో, నా మాటలకోకాని ఒక్కసారి వణికిపోయాడు. ఇలా ఊహించనట్టున్నాడు. వెంటనే సమాధానం చెప్పలేదు. తర్వాత మెల్లిగా "అది అలాంటిది కాదన్నా. చావనన్నా చస్తది గాని ఇంకోడికి మారుమానం పోదు.." అని కొద్దిసేపు ఆగి "అదే జరిగితే ఇద్దరిని అడ్డంగ నరుకుత. కేసులు నాకు కొత్త కాదు గదా.." అన్నాడు.

ఏమనుకున్నాడో సిమ్మాద్రి.. ఇంకేమి చెప్పలేదు. నేను కూడా ఏమీ అడగలేదు.

ఇద్దరం నడుస్తున్నాం. నడక వేగం పెరిగింది. అడుగుల చప్పుడు తప్ప అంతా నిశ్శబ్దం. ఇద్దరం పెద్దమ్మగుడి దాటి గుండ్ల చెరువు కట్ట ఎక్కాం. కట్ట దిగితే ఊరే.

కట్టమధ్యలోకి వచ్చాక ఆగి వెనక్కి తిరిగి "సిమ్మాద్రి, నీకు ఈత వచ్చునా" అడిగాను.

"రాదన్నా. మీ పాలమూర్ల చెరువులెక్కడియి. నీళ్ళ చుక్కనే బంగారమాయె... అయినా ఇప్పుడు ఈత ఎందుకు.." అడిగాడు.

"ఏ.. వట్టిగనే.. దూపయితుంది. చెరువుల మంచి నీళ్ళ బాయి ఉంది. తాగొద్దామా" అన్నాను.

"ఎందుకన్నా.. చలివెడుతుంటే.. నాలుగడుగులు నడిస్తే ఇల్లు చేరుతవు" వారించాడు.

'అబ్బో... ఆగలేను. జర రారాదూ... భయమయితది.." అన్నాను.

అతడు నవ్వుతూ "నువ్వు ఉత్త పిరికోడివున్నట్టున్నవు.. నడువు.." అంటూ నా వెంట నడిచాడు.

మంచినీళ్ళ బాయి చెరువు మధ్యలో ఉంది. ఊరంతటికి అదే ఆధారం. చెరువు ఎండి పోయినా బాయిలో నీళ్ళున్నాయి. ఇద్దరం బాయి దగ్గరికి చేరుకున్నాం. నీళ్ళు తోడడానికి అతన్ని బాయి గద్దె ఎక్కించాను.

నిజంగా సిమ్మాద్రి మంచివాడే! చెప్పినట్టు చేస్తున్నాడు. నీళ్ళు తోడడానికి బావిలోకి వంగాడు.

ఎక్కడో గుడ్లగూబ అరిచింది. తీతువు పిట్ట కీసుమంది. నక్కల ఊలలు వినిపిస్తున్నాయి. బలాన్నంతా చేతుల్లోకి తీసుకుని సింహాద్రిని బాయిలోకి నెట్టాను.

పెద్దగా కేక. తర్వాత బుడుగ్గుమన్న చప్పుడు.

అతడి బ్యాగ్‌ను అందుకుని కట్ట మీదికి వచ్చాను. మరోసారి అరుపు వినిపించింది. కొద్ది సేపు ఆగాను. గుండె కొట్టుకుంటోంది. కాళ్ళు చేతులు వణుకుతున్నాయి. గబగబా బ్యాగు విప్పాను. నోట్ల కట్టల్ని, గాజులు, రింగును తీసుకుని బ్యాగును పొదల్లోకి విసిరి కొట్టాను.

ఇంటికి చేరుకోవడానికి పావుగంట పట్టింది.

నిద్ర లేచేసరికి ఏడు దాటింది.

నా భార్య జేబులో చూసినట్టుంది. నేను ఎప్పుడు లేస్తానా... ఎప్పుడు అడుగుదామా అని ఎదురు చూస్తున్నట్టు కళ్ళు తెరిచి తెరవగానే "ఈ ఉంగరము, గాజులెక్కడియి. నాకే తెచ్చినవా" అన్నది.

"అవి గా కోరుట్లపేట ముత్యాలుకు పంపాలెనే. కానురెడ్డిల వాల్ల సుట్టాలెవరో ఇచ్చింద్రు. కొంత డబ్బు ఇచ్చింద్రు" అన్నాను.

"ముత్యాలంటే మొన్న లగ్గమైంది సూడు. ఆమె గదా.." గుర్తు చేసుకుంటూ అన్నది పద్మ.

పక్కబట్టల్లోంచి లేచి లుంగి సదురుకుంటూ "ఆ... ఆమెనే పాపం.. అవ్వ మొన్న మొన్ననే పోయింది గని అయ్య బుద్ధి తెలువక ముందే పాయె. వాడెవడో వత్తె పత్తకు లేకుంటవాయె. దిక్కులేని పోరి అని ఊరోళ్ళే ఓ పోరన్ని తెచ్చిరి. ఇప్పుడిప్పుడే జర కోలుకుంటుంది" అన్నాను.

ఒక్క క్షణం తప్పు చేశానా అనిపించింది.

"అవును.. తప్పేనా? ముత్యాలు ఎవరు? నేనెవరు? అది ఏం గంగలపోతే నాకేం.." అనుకున్నాను. నా మనసు ఒప్పుకోలేదు. సిమ్మాద్రి చెప్పిన ముత్యాలు మాటలే గుర్తుకొచ్చినయి. ఓ ఆడపిల్ల జీవితం నాశనమవుతుంటే అడ్డం తిరగడానికి ఆయిబాయిలే కావాల్నా అనుకున్నాను.

నా కొడుకు లేచినట్టున్నాడు. ఏదో చదువుకుంటున్నాడు.

టూ గ్రేటర్ దాన్ వన్... టూ గ్రేటర్ దాన్ వన్.. వింటుంటే అనిపించింది. 'అవును. రెండు జీవితాల కంటే ఒక్క జీవితం చిన్నదే మరి'.

**సెల్: 94416 72428**

## ఆమె ఒంటరి కాదు




అది గృహమో గూడో పరికించి చూస్తేగాని తెలియదు
ఆకుపచ్చని లతలై చుట్టూ వేలాడుతోంది వెన్నెల!
ఆ గోడల పగుళ్ళకి మచ్చలు పొదుగుతున్న
తీవల్లో వెన్నెల



వెన్నెల్లో జంపాల ఊగుతున్న తీవలు
నింగిలో లేవులే తారలు
దిగి వచ్చాయికదా నీలి రంగు పూవులై
కలబోసి మెరుపులీనుతోంది పచ్చగా తెల్లగా నీలి
వెన్నెల!
సౌందర్యాలకు చందనమద్దుతున్నట్టు
ఆవరించుకుంటున్న రేరాణి పరిమళాల
గుబాళింపు
పహరా కాస్తోంది పనికిరాని వాసనలను
పారద్రోలుతూ!
దూరంగా ఎక్కడినించో కీచురాళ్ళ వాయిద్యం
ఆలాపనగా సముద్ర తీరపు సర్వీచెట్ల సంగీతం!
ఇన్నిటి మధ్య ఆమె ఒంటరికాదు కానేకాదు
ఆమెకి భయమెందుకు ఆకాశంలో సగము తాను!
ప్రేమించాను పెళ్ళాడతానన్న కల్లబొల్లి కబుర్లవాడు
కాటేసి కనపడకుండా పోతే
అన్నిటినీ మించిన తోడుందిగా మనసులో
కంట నీరు రానివ్వని ఆత్మవిశ్వాసం
ఔను ఆమె ఒంటరిది కాదు!

**—తమిరిశ జానకి**
**సెల్:94411 87182**

# నడుం నొప్పి మళ్లీ రాలేదు

**నా** పేరు రాజిరెడ్డి. వయసు 42. అడుగు తీసి అడుగు వేయలేని స్థితిలో ఇద్దరు వ్యక్తుల సహాయంతో హాస్పిటల్‌కు వెళ్లాను. కారణం భరించలేని నడుంనొప్పి. దానికితోడు తీవ్రమైన మెడనొప్పికూడా ఉంది. దాదాపు శరీరంలోని అన్ని కీళ్లూ అంతో ఇంతో నొప్పిగానే ఉన్నాయి. కాళ్లూ చేతుల్లో తిమ్మిర్లు పట్టినట్లు ఉండడం, చురకలు పెట్టినట్లు ఉండడం, శరీరం ఒక పక్కకు ఒరిగిపోవడం జరిగేది. శస్త్ర చికిత్స చేయించుకుంటే దాని వల్ల కలిగే ప్రయోజనం తాత్కాలికమేనని తెలిసి డాక్టర్ రవికిరణ్‌గారిని కలిసాను.

### చికిత్స తరువాత

శారీరక లక్షణాలు, మానసిక లక్షణాలను పరిశీలించి డాక్టర్‌గారు కొన్ని మందులు సూచించారు. బెడ్‌పై నుంచి నాలుగు అడుగులు వేయలేని స్థితిలో ఉన్న నేను ఇప్పుడు మామూలుగా అన్ని పనులు చేసుకోగలుగుతున్నాను అంటే అది డాక్టర్ రవికిరణ్ గారి చలవే. ఒక దశలో సర్జరీకి సిద్ధపడ్డాను. సర్జరీ చేయించుకుంటే నేను మంచానికే పరిమితమవ్వాల్సి వచ్చేది. నాకు కొత్త జీవితాన్ని ప్రసాదించిన డాక్టర్ గారికి మనస్ఫూర్తిగా కృతజ్ఞతలు.

### డాక్టర్‌గారి మాటల్లో...

హోమియో వైద్యం వ్యాధి మూలాలను తొలగించే విధంగా ఉంటుంది. వ్యాధి మూలం తొలగిపోతే లక్షణాలు ఆటోమెటిక్‌గా పోతాయి. ఇతర వైద్యవిధానాల దృష్టంతా లక్షణాలను అణచడంపైనే ఉంటుంది. హోమియోలో అలా కాదు. పైగా సైడ్‌ఎఫెక్ట్స్ ఉండవు.

# జీవితంపై ఆశ చిగురించింది

**మాది** జమ్మికుంట. ఏడాది క్రితం ఒక అమ్మాయి పరిచయమైంది. తను మా ఊరమ్మాయి కాదు. వేరే ఊరి నుంచి బతుకుదెరువు కోసం మా ఊరోచ్చారు. ఆ అమ్మాయితో శృంగారంలో పాల్గొన్నాను. ఆ అమ్మాయికి ఎటువంటి జబ్బు ఉన్నట్లుగా అనిపించలేదు. రెండు నెలల నుంచి నాకు జ్వరం, దగ్గు, విడవకుండా మోషన్స్ అయ్యాయి. డాక్టర్ దగ్గరకు వెళితే పరీక్ష చేసి హెచ్‌ఐవి ఉందని అన్నారు. బరువు కూడా బాగా తగ్గాను. నాకైతే బతుకాతననే ఆశ కూడా పోయింది. అలాంటి స్థితిలో డాక్టర్ రవికిరణ్‌గారి గురించి తెలిస్తే వెళ్లాను.

డాక్టర్‌గారు ముందు కొన్ని పరీక్షలు చేయించమని చెప్పారు. అందులో హెచ్‌ఐవి ఒక్కటే కాకుండా హెర్పిస్ కూడా ఉందని తేలింది. అయితే భయపడాల్సిన అవసరం లేదని డాక్టర్‌గారు చెప్పారు. నెలరోజులకు సరిపడా మందులు ఇచ్చి పంపించారు. సరిగ్గా నెలరోజుల్లోనే చాలా మార్పు కనిపించింది. ఆకలి బాగా పెరిగింది. జననాంగం దగ్గర వచ్చిన పొక్కులన్నీ తగ్గిపోయాయి. మళ్లీ క్లినిక్‌కు మరో నెలరోజుల పాటు మందులు ఇచ్చారు. ఈసారి చాలా మార్పు వచ్చింది. బతుకుపై ఆశ కలిగింది. వైరల్‌లోడ్ టెస్ట్ చేయిస్తే చాలా తక్కువ ఉన్నట్లు తేలింది.

### పేషెంట్ స్పందన

హెచ్‌ఐవి పాజిటివ్ అని తెలిశాక మళ్లీ బతుకుతానని అనుకోలేదు. డా.రవికిరణ్‌గారు నా జీవితంలో మళ్లీ వెలుగులు నింపారు. జీవితమంతా డాక్టర్ గారికి రుణపడి ఉంటాను. అందరిలా ఇప్పుడు సాధారణ జీవితం గడుపుతున్నాను. హెర్పిస్ కూడా తగ్గింది.

**Dr. K Ravikirane**

M.D.,M.sc(psych), P.G(virology)LONDON

గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్

మాస్టర్స్ హోమియోపతి

అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్, విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి

ఫోన్ : 7842 106 106, 9032 106 106



V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి

సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి

10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 4:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.

# హెపటైటిస్ నుంచి బయటపడ్డా

**అతని** పేరు దివాకర్. వయస్సు 32 సంవత్సరాలు. హెపటైటిస్‌తో బాధపడుతూ మా క్లినిక్ వచ్చాడు. అతని శారీరక, మానసిక లక్షణాలను పరిశీలించి చికిత్స ప్రారంభించాం. హోమియో మందులతో త్వరగా కోలుకుంటావని, ఏమాత్రం భయపడాల్సిన అవసరం లేదని ధైర్యం చెప్పాం. అతను మా ఆసుపత్రికి వచ్చినపుడు తీవ్రమైన కడుపు నొప్పితో బాధపడుతున్నాడు. ఆహారం ఏమాత్రం తీసుకోవడం లేదు. కళ్లు బాగా పచ్చగా ఉన్నాయి. వికారం, వాంతులు అవుతున్నాయి. హోమియో చికిత్స మొదలు పెట్టాక వారం రోజుల్లోనే మంచి ఫలితం కనిపించింది. వికారం తగ్గింది. ఆకలి పెరిగింది. మామూలుగా ఆహారం తీసుకోవడం మొదలుపెట్టాడు. నెల రోజుల తరువాత రివ్యూకు వచ్చినపుడు అతనిలో చాలా మార్పు కనిపించింది. వైరల్ లోడ్ తెలుసుకునేందుకు పరీక్ష చేయిస్తే అతి తక్కువ స్థాయిలో ఉన్నట్లుగా తేలింది. ఆ విషయం అతనికి చెప్పడంతో అతను చాలా సంతోషం వ్యక్తం చేశాడు. జీవితం ముగిసిపోతుందన్న దశలో హోమియో చికిత్స ప్రాణాలు నిలిపిందని కృతజ్ఞతలు చెప్పాడు.

### హోమియో చికిత్స ఏం చేసింది?

వైరస్ దాడి మొదలయిందంటే శరీరంలో రోగనిరోధక శక్తి తగ్గిపోయిందని అర్థం. కాబట్టి రోగనిరోధక శక్తిని పెంచే విధంగా వైద్యం ఉండాలి. హోమియో చికిత్స సరిగ్గా ఈ విధంగానే ఉంటుంది. మూలకారణాన్ని కనుగొని చికిత్స చేయడం ద్వారా హెపటైటిస్ వైరస్‌ని సమర్థవంతంగా అడ్డుకోవచ్చు. కాలేయ పనితీరును మెరుగుపరచవచ్చు. రోగి శారీరక మానసిక లక్షణాలను పరిశీలించి ఆపై చికిత్స అందించడం ద్వారా మంచి ఫలితం సాధించవచ్చు.

# వెరికోస్ వీన్స్ శాశ్వతంగా పోతాయి

**ఈ** కేస్ నాకు బాగా గుర్తు. పరకాల నుంచి వచ్చాడు. అతని పేరు నాగిరెడ్డి. అతని సమస్య ఏంటంటే వెరికోస్ వీన్స్. ఆయన కాళ్లను పరిశీలించినట్లయితే పిక్కల భాగంలో నరాలు మెలిపడిపోయి, ఉబ్బి, నీలం రంగులో కనిపిస్తున్నాయి. సిరలు మెలిపడటం వల్ల ఉత్పన్నమయిన సమస్యఇది. ఈ సమస్యను ఎప్పటికప్పుడు డాక్టర్‌కు చూపించుకోవాలనుకున్నాడు, కానీ తీరికలేక, ఇబ్బంది పెట్టే స్థాయిలో సమస్య లేక చూపించుకోలేదు. కానీ దానివల్ల కూడా ఇతర సమస్యలు వచ్చే అవకాశం ఉందనిచెప్పాను. వయసు పైబడిన వారిలో ఈ సమస్య ఎక్కువ. వయసు పైబడటం వల్ల రక్తనాళాల్లో కవాటాలు దెబ్బతిని, సిరలు పనిచేయలేని స్థితి తలెత్తుతుంది. ఎక్కువ సేపు నిలబడటం వల్ల కాలి పిక్కల దగ్గర ఉన్న కండరాలు పనిచేయడం మానేస్తాయి. పంపింగ్ మెకానిజం తగ్గి రక్తాన్ని పైకి పంపించలేకపోతుంది. ఫలితంగా వెరికోస్ వెయిన్స్ సమస్య ఉత్పన్నమవుతుంది.

### చికిత్స తరువాత

సమస్య దీర్ఘకాలంగా ఉంది. పోవాలంటే ఒకటి రెండు నెలల్లో పోదు. అదే విషయాన్ని ఆయనకు చెప్పా. ఓపికగా మందులు వాడితే ఫలితం ఉంటుందని చెప్పా. నెలరోజులకు మందులు ఇచ్చి మళ్లీ రమ్మని చెప్పా. సరిగ్గా నెల తరువాత వచ్చాడు. అప్పటికీ ఇప్పటికీ తేడా ఉందా అని అడిగితే గతంలో పిక్కల్లో నొప్పి వచ్చేదని, ఇప్పుడు లేదని చెప్పుకొచ్చాడు. కాళ్లలో తిమ్మిర్లు వచ్చేవని అవి కూడా తగ్గాయని అన్నాడు. చెప్పిన నియమాలు పాటిస్తూ క్రమంతప్పకుండా మందులు వాడాడు. ఇప్పుడతను ఆరోగ్యంగా ఉన్నాడు. చాలా మంది ఈ సమస్యకు చికిత్స లేదని ఉండిపోతారు. కానీ హోమియోలో అద్భుతమైన మందులున్నాయి. నిర్లక్ష్యం చేయకుండా డాక్టర్‌ను కలవడం చేస్తేచాలు.



# బోర్‌గా ఫీలవుతుంటే?

**అప్పటిదాకా అందరితో చలాకీగా ఉండే పిల్లవాడుకాస్తా సడెన్‌గా డల్‌గా కనిపిస్తుంటాడు. విశ్రాంతి తీసుకుంటున్నాడనుకుంటే అతడి శరీరం రిలాక్సేషన్‌గా ఉండదు. టెన్షన్‌లో ఉన్నట్లుగా కనిపిస్తాడు.. " ఏమైందిరా అలా ఉన్నావ్?" అనడిగితే బోర్ అంటూ నిర్లిప్త సమాధానం.. కాదూ కూడదని తిట్టారే అనుకోండి "మిమ్మల్ని నేనేమన్నాను, నామానాన నన్ను వదిలేయండి" అంటూ విసుక్కుంటూ చెబుతాడు. ఒకప్పుడు ఉండే చురుకుతనం ఏమైపోయింది? ఏమీ లేకుండా ఇప్పుడిలా మారిపోయాడేంటి? అనే ఆలోచనల్లో ఉండిపోతారు తల్లిదండ్రులు.**

బోర్ కొట్టడం అంటే ఏమీ తోచకపోవడమే. ఈ గుణం కేవలం మానవుడికి మాత్రమే ఉంటుంది. సకల సౌకర్యాల పుణ్యమా అని చాలామందికి విరామ సమయం దొరుకుతోంది. ఈ విరామ సమయంలో కాలక్షేప కార్యక్రమాలంటూ ఏమీ లేకపోతే విసిగిపోవడం పక్కా. ఈ విషయంలో పిల్లాపెద్దా భేదమేమీ లేదు.

అయితే పిల్లలకూ పెద్దవాళ్లకూ ఒక తేడా మాత్రం ఉంది.

### పెద్దవాళ్లకు చిన్నవాళ్లకు తేడా

పెద్దవాళ్లు తాత్కాలికంగా విసుగుచెందడాన్ని కొంపలు ముంచుకుపోయినట్టు భావించరు. ఎందుకంటే అనుభవరీత్యా తరచు అలాంటి స్థితి వారికి ఎదురవుతూనే ఉంటుంది. దానికి అనుగుణంగా అడ్జెస్ట్ కావడం అలవాటు చేసుకుంటారు. జీవితం ఎప్పుడూ ఉల్లాసభరితంగా ఉండదని ఈ మాత్రం విసుగుపుట్టే పరిస్థితులు సహజమనీ మనస్సును సరిపెట్టుకుంటారు.

కాని టీనేజర్ల విషయం అలా కాదు, వాళ్లు ఇప్పుడిప్పుడే స్వంత జీవితంలోకి స్వతంత్ర జీవనంలోకి అడుగు పెడుతుంటారు. మనసులో ఏవేవో ఆశల మేడలు కట్టుకుంటుంటారు. సహజంగానే ఆ వయసు పిల్లలకు సహనం తక్కువ. ప్రతి చిన్న విషయానికి చిరాకు కలుగుతుంది. అప్పటికప్పుడు భవిష్యత్తును చేతుల్లోకి తీసుకోవాలనే తహతహ ఉంటుంది. కాని దురదృష్టవశాత్తూ వాస్తవ జీవితం వాళ్ల ఊహాలోకాల్లో సరితూగలేక గజిబిజిగా డోలాయమానంలో ఉంటారు. జీవితంలో ఒక ఛాలెంజ్‌గానీ, ప్రేరణగానీ లభించక నీరసానికి గురవుతుంటారు. దానినే బోర్ ఫీల్ కావడం, విసుగుచెందడం అంటుంటారు.

మనస్సును సర్దుబాటు చేసుకోలేకపోవటం కూడా టీనేజర్స్ బోర్ ఫీలింగ్‌తో నలిగిపోవటానికి ఒక కారణం! అనుభవలేమివల్ల ఈ సర్దుబాటు చేసుకోవటం వాళ్ళకు చేతకాదు. తాత్కాలికంగా కొద్ది క్షణాలుండే ఈ బోర్ వాళ్లకు అనంతంగా అనిపిస్తుంది. ఏం చేయాలో తెలియదు. చికాకు వేస్తుంటుంది. పనీ పాటా లేకుండా ఏ ఆలోచనా లేకుండా పడుకుని ఉంటారు. తమ నిస్సహాయస్థితికి, ఆనందం కరువైన మానసికస్థితికి మిగతా ప్రపంచం మొత్తం కారణమన్నట్లుగా ఎవరిపైన పడితే వాళ్లపై కోపం ప్రదర్శిస్తుంటారు. లేదా ముభావంగా ఉంటారు.

### ఎందుకు బోర్?

ఇది చాలా తమాషా పరిస్థితి. టీనేజ్ దశకు పూర్వం వాళ్లు తమ తల్లితండ్రులపైన ఆధారపడే వాళ్లు. కానీ ఇప్పుడు తమ వ్యక్తిత్వం మీద నిలబడాలనే తపనతో తల్లితండ్రుల సహాయం స్వీకరించడానికి ఇష్టపడరు. అదే సమయంలో వాస్తవ పరిస్థితికి అనుగుణంగా అడ్జెస్ట్ కావడం చేతకాదు. ఎవరిని నిందించాలో తెలియక, అసలు కారణం ఏమిటో తెలియక తల్లిదండ్రులపైన విసుగు ప్రదర్శిస్తారు. ఇందుకు అనుగుణంగా ఆకర్షణీయంగా కనిపించే కొన్ని ప్రకటనలు, అనుగుణమైన పరిస్థితులు అంచనాలకు వాస్తవ జీవితంలో లభించే సౌకర్యాలకూ పొత్తు కుదరకపోవటం కూడా బోర్ ఫీలింగ్‌కి ఒక కారణంగా ఉంటుంది. ఇది ఒకవైపు అనుకుంటే మరోవైపు వాళ్లు అప్పుడప్పుడే బాల్యంలోంచి యవ్వనంలోకి అడుగు పెడుతుంటారు. ఎంతో వైవిధ్యంతో కూడుకున్న జీవితానుభవాలు ఎదురుగా ఉంటాయి. కాలేజీకి వెళ్లడం, ఫలానా కోర్సు చదవడం చదువులో లేక ప్రేమలో తోటి వాళ్లతో పోటీ, మనస్సును ఆకట్టుకునే క్రీడా ప్రపంచం ఉద్వేగాల్ని వశీకరించుకునే సినిమా ప్రపంచం. వీటన్నిటి మధ్య ఉక్కిరి బిక్కిరి అవుతుంటారు. ఒక్కొక్క క్షణంలో తమకు తాము ఎంతో ప్రాముఖ్యత కలవాళ్లలా కనిపిస్తారు. మరుక్షణమే తమనెవరూ పట్టించుకోవటం లేదని బాధ చెందుతారు. ఎన్నెన్నో కలలు కంటుంటారు. వాటిలో ఏ ఒక్కటీ జరగవు. ఫలితంగా జీవితం బోర్ అనిపిస్తుంది.

టీనేజర్స్ మీద తోటివాళ్ళ ప్రభావం అధికంగా ఉంటుందన్న సంగతి ముందే చెప్పుకున్నాం. తోటి వాళ్లు తనను లెక్కచేయడం లేదనిపించినప్పుడు తనను నిర్లక్ష్యం చేస్తున్నారనిపించినప్పుడు వాళ్లు బోర్ ఫీలైనట్టు కనిపిస్తారు.

### ఎలా అధిగమిస్తారంటే?

టీనేజర్లు తాము పొందే బోర్ అనే మానసిక స్థితిని జయించడానికి ఏ ప్రయత్నాలూ చేయరా? అంటే చేస్తారనే చెప్పాలి. వాళ్లు కూడా పెద్దవారిలానే, ఆ మానసిక స్థితి నుంచి విముక్తి పొందడానికి ఏదో విధంగా ప్రయత్నిస్తూనే ఉంటారు. స్నేహితుడిని పిల్చుకుని రావడమో లేక స్నేహితుడి ఇంటికి వెళ్లి కబుర్లు చెప్పడం, వారితో కలిసి సినిమాకు వెళ్లడం, ఏదన్నా నవల చదువుకోవడం ఆటలలో పాల్గొనడం లాంటి కార్యక్రమాల ద్వారా. ఇవన్నీ అందరూ చేయొచ్చు, చేయకపోనూవచ్చు.



కానీ కొందరు టీనేజర్స్ ఇలా కాకుండా వారి లైఫ్‌ను వారే నాశనం చేసుకునే పద్ధతులు పాటించడం ద్వారా బోర్ భావాన్ని అధిగమించాలని ప్రయత్నిస్తారు. అవెలాంటి పద్ధతులంటే, సిగరెట్లు తాగడం, మద్యం సేవించడం, వాహనాన్ని వేగంగా నడపడం...లాంటి కార్యక్రమాల ద్వారా అన్నమాట. దీనికి చుట్టుపక్కల స్నేహితులు, పరిస్థితులు కూడా కారణం అవుతాయి. వారి ప్రోత్సాహం కూడా ఇలాంటి అలవాట్లు చేస్తుంది.

ఈ రెండు రకాల పద్ధతుల్లో కూడా వీటి లక్ష్యం మాత్రం ఒక్కటే బోర్ ఫీలింగ్‌ని జయించడం. మరి కొందరు దైవభక్తి, సామాజిక సేవ లాంటి ఉదాత్త కార్యక్రమాలు ద్వారా అధిగమించాలని చూస్తారు. వీళ్ల ఆదర్శభావం, సంస్కరణ వాదం ఒంటబట్టించుకున్నవారై ఉంటారు. మరికొందరు రాజకీయాల్లోకి దూకుతారు. మరికొందరు విచ్చలవిడిగా తయారవుతారు. ఇలా ఎవరికి తోచిన రీతిలో వారు ఆ పద్ధతులు ఆశ్రయిస్తారు. ఇలాంటి సమయంలోనే పిల్లలు ఏవైపు మొగ్గుచూపుతున్నారనే విషయాన్ని తల్లిదండ్రులు జాగ్రత్తగా గమనించాలి.

ఇప్పటి దాకా, 'టీనేజర్స్‌కి అసలు బోర్ ఫీలింగ్ ఎందుకు కలుగుతుంది? దాన్ని అధిగమించేందుకు వాళ్ళు ఎలాంటి ప్రయత్నాలు చేస్తారు? అనే విషయాలు చదివారు కదా! మరి ఆ పరిస్థితుల్లో తల్లితండ్రులుగా మీరేం చేయాలో చూడండి!

### వాళ్లేం చెబుతున్నారో వినాలి

పిల్లలు బోర్‌గా ఉన్నప్పుడు స్నేహితులతో ఆడుకోమని, లేదా చదువుకోమని ఇలా రకరకాల సలహాలు ఇస్తుంటారు. ఇలా చెప్పడం సులభమే కానీ దానివల్ల ఎలాంటి ఉపయోగమూ ఉండదు. వాస్తవానికి బోర్‌ను అధిగమించడానికి తమకు అందుబాటులో ఏముందో పిల్లలకు తెలుసు. కాని చేయలేరు. అదే ఆ సమయాన వాళ్లున్న మూడ్ తాలూకు బలహీనత. మనసువిప్పి మాట్లాడుతున్న సమయంలోనే కుర్రవాడికి మీరు నేటి సినిమాలు, వ్యాపార సాహిత్యం వగైరాలు ఎలా ఊహాలోకాల్లో విహరింపచేస్తున్నాయో చెప్పగలరు. దానివల్ల మీరు కూడా ఆ ఊహాలోకంలోని విషయానికి వాస్తవానికి అవి అందించే కలలకూ ఎలా పొంతన ఉండడం లేదో విడమరిచి చెప్పితే వాస్తవబద్ధంగా ఆలోచించగలుగుతారు.

### ఫ్రెండ్‌లా మారిపోండి

బోర్ కొట్టడం ఎవరికైనా సహజం. కాసేపటి తర్వాత ఆ మానసిక స్థితి నుండి తొలిగిపోతే పట్టించుకోనవసరం లేదు. ఆ బోర్ డిప్రెషన్ కలిగిస్తే మాత్రం సీరియస్‌గా పట్టించుకోవాలి. అలాంటప్పుడు బోర్ ఫీలవుతున్న పిల్లవాణ్ణి దగ్గరకి తీసుకుని నీవయసులో నేనెప్పుడూ అలా లేను అని వారికి బోర్ కొట్టేలా మాట్లాడకుండా బోర్ అందరికీ సహజమేనన్న విషయం అర్థమయ్యేట్టు చెప్పండి. ఆ మాట్లాడే క్రమంలో మీలోని బలహీనతల్ని కుర్రవాడి ముందు చెప్పాల్సి రావచ్చు. అవి ముందు చెప్పడం వల్ల అతడిలో ఉండే యాంగ్జయిటీ కొంత తగ్గుతుంది. దాని వల్ల అతనుకూడా మనసువిప్పి మాట్లాడగలడు. ఆస్థితి వరకు కుర్రాణ్ణి తీసుకు రాగలిగితే బోర్ అనే మానసిక స్థితి నుండి మనం అతణ్ణి బైటపడేసినట్లే.

### కారణం తెలుసుకోవాలి!

అడపాదడపా బోర్ ఫీలింగ్ కలగడం జీవితంలో ఓ భాగమన్న సంగతి మర్చిపోవద్దు. అసలు కుర్రవాడు ఆ భావానికి గురికావడానికి మూలకారణమేమిటో తెలుసుకోవడానికి ప్రయత్నించండి. నలుగురితో కలిసిమెలిసి తిరిగేవాడు అకస్మాత్తుగా ఎవరినీ కలవకుండా బోరు చెందుతున్నట్లు ఓ పక్కన కూర్చున్నాడంటే అందుకు మూలకారణం ఏమిటో తెలుసుకోవాలి.

సాధారణంగా బాల్యావస్థనుంచి యవ్వనంలోకి ప్రవేశించే దశలో శారీరకంగా మానసికంగా జరిగే మార్పుల్ని అర్థం చేసుకోలేక కుర్రవాళ్ల ఈమాత్రం గందరగోళ పడటం సహజం. ఇలాంటి సందర్భంలోనే కొత్త ఆసక్తుల్ని, దృక్పథాల్ని, విలువల్ని ఏర్పరుచుకుంటూ తమని తాము సంస్కరించుకుంటారు. పాత అలవాట్లు మార్చుకుని కొత్త అలవాట్లలోకి మళ్లే ఆ పరిస్థితుల్లో బోరు సహజం.

# దిగులు దరి రాకూడదు!



*ఏ టీనేజర్ అయినా అడపాదడపా బోర్ ఫీలింగ్ బారినపడటం సహజం. కాని విడవకుండా ఎప్పుడూ బోర్ ఫీలైనట్టు ప్రవర్తిస్తుంటే తల్లిదండ్రులు కొంచెం ఆలోచించాలి. ముఖ్యంగా బోర్‌తో పాటు కుర్రవాడిలో దిగులు, డిప్రెషన్ లాంటవి కూడా కనిపిస్తే ప్రమాద సూచికగా గమనించాలి.*

*దిగులుతో పెనవేసుకున్న ఇలాంటి మానసిక స్థితి ఎప్పుడూ ప్రమాదకరమైనదే! టీనేజర్ దిగాలుగా కనిపిస్తుంటే తప్పకుండా ఆ టీనేజర్‌ను కనిపెట్టుకుని ఉండాలి. ముఖ్యంగా నాకంతా శూన్యంగా ఉంది, చచ్చిపోవాలనిపిస్తోంది అంటూ టీనేజర్ వాపోతుంటే అతని విషయంలో చాలా జాగ్రత్త వహించాలి. అతనికి తెలియకుండా ఎప్పుడూ ఒకళ్లు కనిపెట్టుకుని ఉండడం, డాక్టర్ లేక సైకియాట్రిస్టును సంప్రదించాలి.*

# అడిగిన కోరికల్లా తీర్చకండి

బోరు కొడుతున్నప్పుడు వాళ్లతో మాట్లాడుతున్నప్పుడు ఇదే మంచి సందని వాళ్లు స్కూటీ కావాలని, బైక్ కావాలనీ, ఫోన్ కావాలనీ తనకిష్టమైన దాన్ని కొనిపెట్టమని అనవచ్చు. ఫలానాది ఉంటే బోర్ కొట్టదు అనొచ్చు. కానీ జాగ్రత్త ఈసమయంలో వారికి లొంగబోకండి. తాహతుకు మించి అడిగింది ఏదీ కొనివ్వవద్దు. అవసరాన్ని దృష్టిలో ఉంచుకోండి. ఎందుకంటే దీన్ని అలవాటు చేస్తే ఇలా అవకాశం దొరికినప్పుడల్లా అడిగినవి కొనిస్తుంటే మీరు కూడా అతణ్ణి ఊహాలోకంలో విహరింపచేయడానికి దోహదపడ్డ వాళ్లవుతారు. ఇలా అడిగిందల్లా కొనిస్తే వాస్తవ పరిస్థితులకు వారిని మనమే దూరం చేసినవాళ్ళమవుతాం.

జీవితమంటే ఆశా నిరాశల సమ్మేళనం. భవిష్యత్తులో ఎప్పుడో సడెన్‌గా నిరాశను ఎదుర్కోవడం కంటే ఎదుగుతున్న దశలోనే కొంచెం కొంచెంగా వాటిని రుచి చూడనివ్వండి. తద్వారా



మనస్సును సరిపెట్టుకోవడం ఎలాగో ఇప్పటి నుంచే నేర్చుకుంటాడు.

— లతాకమలం

www.lathakamalam.com




**"ఎవరో వస్తున్నారంటేనే ఈ ఇల్లు సర్దడాలేంటీ, దుమ్ము దులపడాలేంటీ, ఇల్లు అద్దంలా మెరిసి పోవాలన్న కోరికేంటీ! నడుం సంగతి కాస్త చూసుకో" అన్నాడు భూతపతి, భార్య భ్రమర నాదంతో.**

"ఏదో తెలివిగా ఎత్తిపొడుస్తున్నారు. ఇల్లెప్పుడూ దయ్యాల కొంపలా ఉన్నట్టే మాట్లాడుతున్నారే! ఎక్కడ తీసిన వస్తువు అక్కడ పెట్టండి చాలు బాబో అని పెళ్ళయిన దగ్గర్నుంచి మొత్తుకుంటూనే ఉన్నా. అది పోనీండిగానీ, ఎప్పుడూ లేంది నా నడుం మీద జాలి ఎందుకు కలిగిందో" అంది భ్రమరనాదం.

"బెల్టు చుట్టుకోవడం మరిచిపోయావని గుర్తు చేయడంలే! అయినా, నొప్పితో నీవు ఒకసారి అమ్మో అంటే నేను పదిసార్లు అనాల్సి వస్తుందిగా" అన్నాడు.

"అదన్నమాట! పోన్లెండి మీ క్షేమం కోసమైనా నా బాగు కోరుతున్నారు. నా పనిలో నన్నుండ నీండి" అంది.

"ఇంతకీ ఆ వస్తున్నదెవరో"

"అదేంటండీ తెలియనట్టు అడుగుతున్నారు. మీ బావగారి బావగారొస్తున్నారు భార్యాపిల్లలతో అని మీరేగా చెప్పింది" అంది చేస్తున్న పని ఆపి.

"ఓ అదా, ఆయన వచ్చేది ఆయన బావగారిం టికి" అన్నాడు.

"అక్కడికొచ్చేవాడు. ఇక్కడికి రావడమేంటి. మనమేమన్నా ఆయనకు రుణపడి ఉన్నామా" అంది.

"అసలు జరిగిందేంటంటే, ఆయన అన్నట్లుగా కుటుంబంతోనే వచ్చాడు. ఇంటికి తాళం చూసి, ఆయన బావగారికి ఫోన్ చేశాడు. ఆ బావగారేమో 'మేం శిల్పారామంలో ఉన్నాం. ఓ గంటలో వస్తాం. మేం వచ్చిందాకా మా ఫ్లాట్స్ ముందు పార్కులో బెంచీలున్నాయి. అక్కడ కూర్చోండి' అన్నాట్ట" చెప్పాడు భూతపతి.

"కూర్చోవచ్చుగా. ఈ గంటలో మనింటికి రావ డమెందుకో"

"దేహతొందరలు తీర్చుకోవాలని, కాయస్వేదాలు తుడుచుకోవాలనీ మనింటికొస్తున్నారంతే".

"తెలుగే మాట్లాడుతున్నారా".

"తెలుగులో చెబితే నీవు కకావికలం అవుతా వని, కొద్దిగా గ్రాంధికం చల్లానులే".

"చాల్లెండి మనమే ఏ ఇందిరాపార్కులోనో, పబ్లిక్ గార్డెన్లోనో ఉన్నాం. రావడానికి నాలుగ్గంటలు పడు తుందని చెప్పొచ్చుగా."

"నా సంగతి తెలుసుగా. ప్రాణవిత్తమాన..." అన్నాడు.

"అయ్యో! తెలుగుభాష లెస్సా తుస్సా అని కస్సుబుస్సుల కబుర్లేవో చేర్చి పేర్చి కూర్చివార్చిన మీ డాక్టరేటు పోటు ఇంట్లో పొడవకండి భాషాపతి గారు, భూతపతిగారూ, నా పతిగారూ. మీరు అబద్ధం చెప్పరు, నిజమే చెబుతారు. అంతేగా.. బెల్లుకొట్టా రెవరో వాళ్ళేనేమో వెళ్ళి చూడండి" అంది.

"నిన్నీగెటప్‌లో చూస్తే అటునుంచటే పోతారు. నువ్వెళ్ళి దాక్కో" భార్యకు చెప్పి తలుపుతీసి "నువ్వే మన్నా ప్లంబర్ని పిలిచావా" అన్నాడు.

"అయ్యో! నా మతిమరుపు చల్లగుండ పంపు గొట్టాలు చెడిపోయి మూడు రోజులైంది. ఆ సంగతి మీకు చెప్పడమే మరచిపోయా!"

"అదేంటో! కంగారుగా ఉన్నట్టున్నారు అన్నయ్య గారు" అడిగింది భ్రమరనాదం.

"నాకు ప్లంబర్ని చూస్తే డ్రైనేజీ వైరాగ్యం వస్తుందమ్మా" అని మెట్లుదిగడం మొదలుపెట్టాడు. దిగుతూ తన పేరు తనే పెద్దగా పిలవడం వినిపిం చింది.

"అసలే నడిచి వచ్చాడు. లిఫ్ట్ చెడిపోయింది పాపం".

***

ప్లంబింగ్ పనీ, కరెంటు రిపేరుకొచ్చిన పనీ అయిపోయింది. పంపు తిప్పితే నీళ్ళొస్తున్నాయి. స్విచ్చు వేస్తే లైటు వెలుగుతున్నది. 'హమ్మయ్య' అని ఆనందంగా శ్వాస పీల్చింది భ్రమరనాదం. ఇక బాల్కనీలో పావురాలగోల ఉంది. "ఏమండీ, మీరిలా తాత్సారం చేస్తూ ఉంటే పావురాయి మన బెడ్ మీదే గూళ్లు పెట్టి గుడ్లుపెట్టి, గుడ్లు పిల్లలై మనం ఇంకో ఇల్లు చూసుకోవాల్సి వచ్చేట్లుంది" అంటూ హాల్లోకి వెళ్ళింది. భర్త అప్పుడే ఫోను పక్కనపెట్టి దిగులుగా ఉండడం చూసింది.

"ఏమైందండీ, ముఖం అంతలా రంగుమారి, ఎడతెగని లంఖణాలు చేసినవాడిలా వాడిపోయారు"

# వెలుగు పండు

"మరిప్పుడేం చేద్దాం"

"ప్లంబర్ని పని మొదలుపెట్టమనండి. తర్వాత సంగతి తర్వాత".

***

"అయ్యో! కోటప్పకొండగారూ, మీరొక్కరే వచ్చారేం. పనులన్నీ మానుకుని మీ కోసం కాచుక్కూచున్నాం. సెల్లు నొక్కకపోయారా" అన్నాడు భూతపతి.

"ఆ సంగతే చెప్పడానికొచ్చానండీ. చార్జింగు పోయి, అవుట్ గోయింగ్ పోయి మీకెలా చెప్పాలో తోచక మీరిచ్చిన అడ్రసు వెతుక్కుంటూ.. మిమ్మల్ని ఇబ్బంది పెట్టడం ఎందుకని దగ్గర్లో ఓ లాడ్జింగ్‌లో గది తీసుకున్నాం...." కోటప్పకొండ చెబుతుండగా, మధ్యలో ప్లంబరొచ్చాడు.

"సార్! రెండు బాత్‌రూములూ, టాయిలెట్లలో పంపుగొట్టాలు తుప్పుపట్టి పాడై పోయాయి. మొత్తం కొత్తవి వేయాల్సిందే. ముందో అయిదువందలిస్తే వెళ్ళి సామాను తీసుకొస్తా" అంటూ భూతపతి ముఖం చూసి ఆగిపోయాడు ప్లంబర్. ఏదో తేడా వచ్చిం దని. దానికితోడు, భ్రమరనాదం వచ్చి "ఎవరింటి కనుకుని ఎవరింటి కొచ్చావయ్యా వెళ్ళెళ్ళు" అంది. ప్లంబర్‌కి వెళ్ళాలన్న సంగతి అర్థమై వెళ్ళిపోయాడు.

"అతను వచ్చింది మనింటికేగా" అన్నాడు భూతపతి.

"మీరొక అయోమయం! కాబట్టే, పెద్దాయన వస్తే గుమ్మంలోనే నించోబెట్టి మాట్లాడేస్తున్నారు. లోప లికి రమ్మనరేం" గొంతు పెద్దదిచేసి అంది.

"లేదమ్మా! నేను వెళ్ళి కుదుటపడి మళ్ళొప్పు డన్నా వస్తా"

అడిగింది కొంచెం ఆందోళనతో.

"ఆ కోటప్పకొండ వైజాగు వెళ్ళలేదట. అంతా ఏదో తారుమారయిందట. మనింటికి వస్తున్నాడు. రెండు రోజులుండి పోతారట" అన్నాడు భూతపతి.

"ఇల్లు ఖాళీ చేస్తున్నామని చెప్పకపోయారా" అంది.

"నా సంగతి తెలుసుగా, ప్రాణవిత్తమాన.."

"ఎప్పటిదో రాజులకాలంలో సూక్తి ముక్తకం ఆవులిస్తున్నారు. ధర్మరాజంతటి వాడే కుంజరహ అన్నాడు" అంది భ్రమరనాదం.

"అప్పుడైనా ఇప్పుడైనా నీతి ఒకటేగా. వేషభాషల్లో తేడాలొచ్చాయిగానీ.." అన్నాడు భూతపతి.

"మీరేం చేస్తారో నాకు తెలియదు. రేపొద్దున్నే మా తమ్ముడు, భార్యాపిల్ల, కుక్కపిల్లతో సహా దిగు తున్నాడు" అంది భ్రమరనాదం.

"ఇప్పుడేం చేద్దామంటావు" అన్నాడు.

"ఏముంది ఉన్న నిజం చెప్పడమే. నిజాల్నీ, నిప్పుల్నీ చేతుల్లోపెట్టి తిరగడానికి ముందుకొస్తారుగా" అంది.

"ఎలాగోలా కాపాడండి అన్నంతగా అన్నాడు పాపం, మాట ఇచ్చాను. నాకేం తోచడం లేదు. ఆ మందార వనాంతరామృతసరః ప్రాంతేందు–కాంతో పల్పోతల పర్యంక రమావినోదియగు–నాపన్నప్రప న్నుండు, నన్నుగాచు గాక" అని గజేంద్ర మోక్షాన్ని తలచుకున్నాడు భూతపతి.

"మీరేం ఏనుగుకాదు, మిమ్మల్నేమొసలీ పట్టు కోలేదు. అలవైకుంఠపురవాసికి ఈ పని పెట్టకండి. ఆయనకు బోల్డన్ని పనులున్నాయి" అంది.

"ఈ సమస్యనేం చేద్దాం" అన్నాడు.

"నా చేతుల్లోకి తీసుకుంటాలెండి"

***

"ఎవరో మీ బావగారి, బావగారి బావగారి, బావగారట. కోటప్పకొండగారట. వైజాగునుంచి వచ్చారు. ఆయన మకాం రోజుకింకో రోజు అంటు కుంటున్నది" అంది భ్రమరనాదం.

"మా ఆఫీసరుగారి పేరు కూడా అదేనే!" అన్నాడు తమ్ముడు, కుక్కపిల్ల అరుపుని చేత్తో మూస్తూ.

"కోటప్పకొండలు కోటిమంది ఉంటారు మన తెలుగువాళ్ళల్లో. ఆకోటి ఈకోటి ఒకే కోటి కావాలనే ముందిరా" అంది భ్రమరనాదం.

"ఆయన ఉద్యోగం వివరం ఏమన్నా చెప్పాడా బావ" ఆదుర్దాగా అన్నాడు తమ్ముడు.

"పోర్టుట్రస్టులో పెద్ద ఉద్యోగమే అన్నార్రా"

"అయ్య బాబోయ్! ఆయన మా ఆఫీసరే" ఖంగుమన్నాడు తమ్ముడు.

"అంత కంగారెందుకురా. ఆయనేమన్నా కర్కో టప్పడా! నాకేం అలా అనిపించలేదే"

"కర్కోటకుడూ, కర్కసుడూ కాడుగానీ అటూ యిటుగా అటువంటి పేరే మోశాడు.

"సెలవు అని అడిగిన వాడికి నెలవు తప్పినట్లే, శిలువ వేసినంత నొప్పి పుట్టినట్లే! మహా పిసినరుడు" సరదా పద ప్రయోగంలో అన్నాడు.

"నిజ జీవితంలో మనిషిగా ఏవో అవసరాలు ఎవరికైనా వస్తాయి కదరా."

"నీకు అనిపించినట్లు అందరికీ అనిపించాలనేం లేదుగా. బావలాగా తెలుగు పద్యాలు, పాటలు చెప్పినట్లుండవుగా అన్ని ఉద్యోగాలూ" అన్నాడు.

"ఆ గోలంతా ఎందుకుగాని, ఏదో రెండురోజులు యిరుక్కుని ఉంటాం. బంధువులం అని తెలిస్తే మంచిదేగా! నీ ఆందోళనే నాకు అర్థం కావట్లేదు"

"మేనమామ పోయాడని వారం రోజులు సెలవు పెట్టివచ్చానే!" అన్నాడు.

"ఓసంతేనా, నీ మేనమామ నాకూ మేనమామే కదా. ఆ మాట మీదే ఉందాం. ఈ సంగతి బావకు తెలిసిందనుకో. అసలు నీకు మేనమామలే లేరు కదరా అన్న నిజంచెప్పి నిన్ను కాలుస్తారు" అంది.

***

ఇంటి పక్కఫ్లాట్ వాళ్ళు ఖాళీ చేస్తు న్నారు, ఫస్ట్‌దాకా టైం ఉన్నా మంచిరోజని నాలుగురోజులు ముందే! ఆయన పేరు నూలుపోగుల చంద్రగోళం. గోళంగారు అంటారు. ఆయన భార్య తారాతీరం. భ్రమరనాదం అంటే ఎంతో అభిమానం, స్నేహం! ఆ ఆధారంతో అవసరానికి తగ్గ ఏర్పాటుచేసింది. ఆ ఓనరు ఊళ్ళో లేడని తెలి యడంతో సమస్య సజావుగా తీరి పోతుంది అనుకుంది. కోటప్పకొండ తన కుటుంబంతో, ఖాళీచేసిన ఇంట్లో రోజుల అతిథిగా చేరాడు. కోటప్ప కొండను పలకరించక తప్పింది కాదు భ్రమరనాదం తమ్ముడికి. తప్పదని ముందే అనుకున్న విషయం. కాబట్టి, 'పోయాడ నుకున్న మేనమామ దింపుడు కళ్ళం ఆశ పెట్టిన కేకతో లేచి

**భూతపతి, భ్రమరనాదాల కాపురం హైదరాబాదులోనే. భూతపతి బావగారి బావగారు తన బావగారి ఇంటి కొచ్చారు. కానీ ఆయన వసతి చిక్కుల్లో పడింది. చివరికిక వీళ్ళింటికే రావాల్సి వస్తోంది. ఇంకోపక్క భూతపతి బామ్మర్ది కూడా భార్యా బిడ్డల్తో దిగబడుతున్నాడాయె! ఒకే ఇంట్లో రెండు కుటుంబాలకి వసతి...! పెద్దచిక్కొచ్చేపడింది. మరి వాళ్ళేం చేశారు? కథ ఏ మలుపు తిరిగింది?**

కూర్చున్న సంగతి తమ్ముడికి తెలియదు. వాడు మీ పి.ఏ. అని చెప్పాడు. వెంటనేవాడు వైజాగు వెళ్తా నంటే, నీకేమన్నాపిచ్చా, వచ్చినవాడవు వచ్చావు. ఇంతదూరం మళ్లెప్పుడొస్తావో ఏంటో. రెండు రోజులు ఉండిపోరా అని నేనే బలవంతం చేశాను' అని కోటప్ప కొండకు తన మాటల్లో చెప్పింది భ్రమరనాదం.

"మీ తమ్ముడు ఇంటిపేరు చెప్పగానే ఏదో బంధుత్వం లీలగా తట్టింది. ఆఫీసులో నేను లేక పోయినా, తనుంటాడనుకున్నా, అదిలా అయింది" అన్నాడు కోటప్పకొండ.

కోటప్పకొండది ఓడలతో వడిలిపోతున్న శరీరం కాబట్టి పరదేశీయులతోనే పరస్పరానుబంధం, స్పర్శా నుబంధం ఉన్నవాడు కాబట్టి, ఆంగ్లభాషను ప్రేమించి పెళ్ళి చేసుకున్నంత పని చేశాడు. కోటప్పకొండ మెదడులో ఏ కలుగులోనో దూరి దాక్కుంది తెలుగు! భూతపతి తెలుగులో పండిపోయిన తెలుగు పండితుడు. "ఆంధ్రభోజుడు, శ్రీకృష్ణదేవరాయులు ఇప్పుడుంటే, ప్రపంచ భాషలందు తెలుగు లెస్స అని పలికేవాడే" అన్నాడు.

"అవునేమో కానీండి! ఇప్పుడు ఇంగ్లీషు గ్లోబల్ లాంగ్వేజ్ కదండీ" అన్నాడు కోటప్పకొండ.

అంతే భూతపతి వశం తప్పాడు. పానుగంటి లక్ష్మీనరసింహారావు గారు తెలుసా నీకు అని మొదలు పెట్టి, తెనాలి రామలింగకవి, భక్త కవి పోతనా మాత్య ఎందరో మహనీయులు, కారణజన్ముల పేర్లు తలుచుకుని, తెలుగు పద్యాలండీ! అంటూ తెలుగును వెలిగించే పద్యాలండీ! పున్నమిరోజు సముద్రపు అలలా ఉప్పొంగాడు భూతపతి. ఘంట సాల పోయినరోజే నేను ఎందుకు పోలేదా అని గుండె పగిలినవాణ్ణి అని గంధర్వ గాయకుడికి ప్రణతులర్పించి "కుప్పించి యెగసిన కుండలంబుల కాంతి, గగనభాగంబెల్ల గప్పికొనగ- నేడు భీష్ముని చంపుదు నిన్నుగాతు విడువు మర్జునయనుచు మద్విశిఖవృష్టి దెరలి చనుదెంచు దేవుండు దిక్కునాకు" పద్యం మొత్తం ఆవేశంగా ఆరో శృతిలో చదివి కోట ప్పకొండమీద కెక్కినంత పని చేశాడు భూతపతి.

"అయ్యా! వెళ్ళొస్తానని చెప్పడానికొచ్చా. పోర పాటున ఆంగ్లమెతుకు రుచి చూపిద్దామనుకున్నా! నేను భీష్ముణ్ణి కాదు. మీరు శ్రీకృష్ణుడు కాదు, శ్రీకృష్ణ దేవరాయలూ కాదు. ఆంగ్ల భాషే నా శ్వాస అని నేను ప్రతిజ్ఞ చేయలేదు" అని ఏదో చెప్పబోతుంటే ఆపి, "మన మాతృభాష మన కన్నతల్లి, ఇంకే భాషైనా పినతల్లే" అన్నాడు భూతపతి.

"చా.కో.రా గారు కూడా ఇలాగే ఏదో అన్నట్లు గుర్తు" అన్నాడు కోటప్ప.

"గుర్తు చేసుకుని, నేను చెప్పింది గుర్తు ఉంచుకుని విశాఖపట్నం వెళ్ళింతరువాత సెల్లు బిగ్ సీలో పడిందని వంకలు చెప్ప కుండా ఫోన్ చేయండి" అన్నాడు భూత పతి.

***

వాట్సప్‌లో ఉత్తరం!

"అయ్యా, భూతపతిగారూ! మేం క్షేమంగా మా ఓడ ఎక్కాం! తుఫాను గాలికి చేతులు లేకపోయినా, చేతుల్లో గొడ్డళ్ళు గునపాలు లేకపోయినా, మహామహా వృక్షా లను సైతం కూకటివేళ్లతో పీకి పడేసింది. సింహాచల వాసుని దయతో తేరుకుంటున్నాం. మేం వచ్చింత రువాత ఆ ఓనరొచ్చి గగ్గోలుపెట్టాడనీ, రెండు రోజు లైనా సరే నెలంతా అద్దె కట్టాల్సిందే అని నాచులాపట్టి పీచులా పీకాడని తెలుసు కున్నాం. మీ మంచితనానికి సంతోషం. మీరు మాత్రం సంతోషానికి దూరంగా ఉండకండి. ఆ డబ్బు నేను ఇస్తాను. నేనే ఇవ్వాలి. ఆ తర్వాత, మీరు వైజాగు తప్ప కుండా రావాలి. మా ఓడలు చూడాలి, మా ఓడల్లో విహారం చేయాలి. ఎన్ని రోజు లైనా ఉండొచ్చు, హాయిగా!

గమనిక: మీరొస్తే తెలుగుభాష గొప్పతనాన్ని నా మాటగా వినిపిస్తాను, తెలుగు వెలుగు పండుని తినిపిస్తాను.

–ఇట్లు మీ కోటప్పకొండ, భార్యాపిల్లలతో.



# పరగడుపునే తినాలి






పళ్ళు ఏ సమయంలో తీసుకోవాలి? అన్న దాని మీద ఒక్కొక్కరికి ఒక్కో రకం అభిప్రాయం ఉంటుంది. కొందరు ఉదయం టిఫిన్ తిన్న తరువాత, మరి కొందరు మధ్యాహ్నం భోజనం అయిన తరువాత, ఇంకొంత మంది సాయంత్రం స్నాక్స్‌గానూ, రాత్రి భోజనానంతరం తింటూంటారు. పళ్ళు ఏ సమయంలో ఎలా తీసుకున్నా మంచిదే అన్నది చాలామంది నమ్మకం. కానీ వీటికి ఒక సమయం ఉంది అంటున్నారు పరిశోధకులు. పళ్ళను ఉదయం పరగడుపున తీసుకుంటే మంచిదన్న విషయం వీరి పరిశోధనలో తేలింది. పరగడుపున తీసుకోవడం వలన పళ్ళు త్వరగా జీర్ణం కావడమే కాకుండా శరీరానికి కావల్సిన పోషకాలన్నీ అందుతాయంటున్నారు. కాకపోతే అల్సర్, తదితర సమస్యలు ఉన్నవారు మాత్రం పరగడుపున తీసుకోవడం అంత మంచిది కాదని వీరు చెబుతున్నారు. వీరు మాత్రం వైద్యుల సలహా మేరకే పరగడుపున పళ్ళు తినాలనీ సూచిస్తున్నారు.



## పిల్లలపై తల్లిదండ్రుల ప్రభావం?

కచ్చితంగా ఉంటుంది అంటున్నారు ఆస్ట్రేలియా పరిశోధకులు. ఇంట్లో తల్లిదండ్రులు తరచు పోట్లాడుకుంటూ ఉంటే దాని ప్రభావం పిల్లల ప్రవర్తనపైనా, వారి చదువుపైనా తీవ్రంగా ఉంటుందని హెచ్చరిస్తున్నారు. ఈ విషయం మీద కొంత మంది పిల్లల మీద వీరు అధ్యయనం నిర్వహించారు. వీరిలో కొందరి పిల్లల తల్లిదండ్రులు తరచూ గొడవ పడుతూ ఉండేవారు. మరికొందరి పిల్లల తల్లిదండ్రులు వారితో ప్రేమగా మసులుకునేవారు. కొన్ని రోజుల అనంతరం రెండు గ్రూపులకు చెందిన పిల్లలను పరిశీలించగా...గొడవపడే తల్లిదండ్రుల పిల్లలు చదువులోనూ, ఆటల్లోనూ, వెనకపడి ఉండడమే కాకుండా, వారిలో శారీరకంగా, మానసికంగా ఎదుగుదల కూడా తగ్గిన విషయం వీరు గమనించారు. రెండో గ్రూపు పిల్లలూ అన్నింటా ముందు ఉండడంతో పాటు మానసికంగా, శారీరకంగా ఆరోగ్యంగా ఉన్న విషయం గుర్తించారు. దీనికి కారణం పిల్లలపైన తల్లిదండ్రుల ప్రభావమేనని వారు అంటున్నారు. అందువలన పిల్లల ముందు తరచూ గొడవ పడే తల్లిదండ్రులు తప్పనిసరిగా మారాలని వారు చెబుతున్నారు.

## చెరుకు రసంతో కేన్సర్‌కు చెక్?

ఖరీదైన మందులు, వైద్యం చేయలేని పని చెరుకు రసం చేస్తుందంటే నమ్మలేం కాని ఇది సాధ్యమే అంటున్నారు నిపుణులు. చెరుకురసంలో ఆమ్ల గుణంతోపాటు ఇనుము, కాల్షియం, పొటాషియం, సోడియం వంటి ఖనిజ లవణాలు అధికంగా ఉంటాయనీ, ఇవి కేన్సర్ కణాలు పెరగకుండా అడ్డుకుంటాయేతప్ప కేన్సర్ రాకుండా మాత్రం అడ్డుకోలేదని వారు అంటున్నారు. దీనిలో ఉండే ఫైబర్ అధికబరువును అడ్డుకుంటుందని ఇటీవల నిర్వహించిన కొన్ని పరిశోధనల్లో వెల్లడైంది. షుగర్



వ్యాధిగ్రస్థులు కూడా చెరుకురసం తాగవచ్చని వీరు అంటున్నారు. అయితే వీరు నిపుణుల సలహా మేరకు చెరుకురసాన్ని తాగాలని వారు సూచిస్తున్నారు.

## మగపిల్లల్లో ఊబకాయం శాపమే!

టీనేజర్లలో కనిపించే ఊబకాయం వారు పెద్దయిన తరువాత శాపంగా మారుతుంది అంటున్నారు స్వీడన్ పరిశోధకులు. చిన్నతనంనుంచీ అధిక బరువుతో ఉండే మగపిల్లలు పెద్దయిన తరువాత లివర్ సంబంధిత వ్యాధులతో బాధపడే అవకాశం రెండు రెట్లు ఎక్కువగా ఉంటుందన్న విషయం వీరి పరిశోధనలో వెల్లడైంది. సుమారు రెండు వందల మంది ఊబకాయులైన పిల్లల మీద సుదీర్ఘకాలం పరిశోధనలు నిర్వహించారు. వీరిలో టైప్–1 డయాబెటిస్ వచ్చే అవకాశం కూడా ఎక్కువే అని వారు చెబుతున్నారు. చిన్నతనం నుంచి సాధారణ బరువుతో ఉండి మధ్య వయస్సులో బరువు పెరిగితే లివర్ సమస్య అంతగా ఉండదని వారు అంటున్నారు. చిన్నతనం నుంచీ అధికబరువుతో ఉండే పిల్లల్లో మాత్రమే ఈ సమస్యను వారు గుర్తించారు. పెద్దవారిలో లివర్ సమస్యలు కనిపించడానికి పలు కారణాలున్నా పిల్లల్లో అధికబరువు, ఊబకాయం ప్రధానకారణం అవుతాయని వారు స్పష్టం చేస్తున్నారు. పిల్లల్లో కనిపించే ఊబకాయాన్ని తగ్గించడానికి పెద్దలు తగిన చర్యలు తీసుకుంటే పిల్లలు భవిష్యత్తులో పలు సమస్యల నుంచి తప్పించుకునే వీలుందని వారు సూచిస్తున్నారు.

–అవినాష్



# సొరియాసిస్ నుంచి శాశ్వత విముక్తి

**సొరియాసిస్** ప్రాథమికంగా చర్మం మీదే కనిపిస్తుంది. అయితే, ఈ వ్యాధిలో చర్మంమీద ఒక వాపు ఏర్పడుతుంది. ఈ వాపు కేవలం చర్మానికే పరిమితం కాకుండా, చర్మం కింది లోలోపలి భాగాలకూ విస్తరిస్తుంది. ఒక దశలో రక్తనాళాల్లోనూ వాపు ఏర్పడి, రక్తప్రసరణలోఆటంకాలు ఏర్పడతాయి. అంతిమంగా ఇవి రక్తకణాలనూ దెబ్బ తీస్తాయి. ఈ స్థితిని వ్యాస్కులైటిస్ అంటారు. సొరియాసిస్ చర్మం నుంచి లోపలి పొరల్లోకి వెళ్లినప్పుడు లోపలున్న ప్రధాన రక్తనాళాలనే కాదు. సూక్ష్మరక్తనాళాలను, కూడా దెబ్బ తీస్తుంది. .

## జీర్ణాశయమే దెబ్బ తిన్నాక.....

సొరియాసిస్‌తో వచ్చే నిద్రలేమితో ముందు జీర్ణాశయ సమస్యలు మొదలవుతాయి. జీర్ణక్రియకు అవసరమైన జఠరాగ్ని తగ్గిపోతుంది. ఈ అగ్ని కేవ లం ఆహారంలోని పోషకాలను సంగ్రహించడమే కాదు, హానికారకమైన వైరస్, బ్యాక్టీరియాలను నశింపచేస్తుంది. జీర్ణంకాని ఆహార పదార్థాలు శరీరంలో ఉండిపోతే అవి విషతుల్యంగా మారతాయి. ఈ విషకారకాలు అణువణువునా వ్యాపించి శరీరం శక్తిహీనమవుతుంది. ఫలితంగా వ్యాధి నిరోధక శక్తిని తీవ్రంగా దెబ్బ తింటుంది. జఠరాగ్ని తగ్గిపోతే, అజీర్తి, మలబద్ధకమే కాదు, శరీరంలో రక్తప్రసరణ బాగా తగ్గుతుంది. రక్తప్రసరణ తగ్గడం అంటే అది చర్మ వ్యాధుల నుంచి లైంగిక సమస్యల దాకా అన్నింటికీ ద్వారాలు తెరుచుచకోవడమే. అందుకే శరీరంలోని అగ్నిని సామ్యస్థితికి తేవడం, ఆయుర్వేదంలో అత్యధిక ప్రాధాన్యం గల అంశం అయ్యింది.

సొరియాసిస్‌తో వచ్చేనిద్రలేమిని చాలా మంది ఒక సాధారణ సమస్యగా తీసుకుంటారు కానీ, ఈ నిర్లక్ష్యం వల్ల ధాతువులన్నీ క్షీణిస్తూ వెళతాయి. రసధాతువుతో పాటు రక్తధాతువు కూడా దెబ్బ తిని, చివరికి నరాల వ్యవస్థ దెబ్బ తింటుంది. ఫలితంగా, ఇతర అవయవాలతో పాటు, జననాంగాలకు కూడా సరిగ్గా రక్తప్రసరణ తగ్గిపోతుంది. ఇది శీఘ్రస్ఖలన సమస్యకు, అంగస్తంభన సమస్యలకూ దారి తీస్తుంది. అంతిమంగా ఇది సంతానలేమికి కారణమవుతుంది.

## సమూల వైద్యం

సొరియాసిస్‌కు వైద్య చికిత్సలు అందిస్తే, దాదాపు 70 శాతం సమస్యలు వాటికవే తగ్గిపోతాయి. అయితే, శరీరంలోని మలినాలను అలాగే వదిలేసి, ఔషధాలు తీసుకోవడం వల్ల ఎవరికీ ప్రయోజనం ఉండదు. అందుకే సొరియాసిస్ చికిత్సలో శరీరంలోని మలినాలను, ఆమాన్ని తొలగించేందుకు ముందు శోధన చిత్సలు చేస్తాం. ఇందులో భాగంగా, వమనం, విరేచనం, చేస్తాం. ఆ తరువాత దీపన పాచన చికిత్సలు ఉంటాయి. వీటి వ ల్ల శరీరంలోని ఆమం (కల్మషం) తొలగిపోతుంది. చికిత్సా క్రమంలో ముందు శరీర ధారుఢ్యానికి, ధాతువృద్ధికి రసాయన చికిత్సలు అందిస్తాం. శరీరంలోని కండరాల వ్యవస్థను శక్తివంతం చేయడంలోనూ శరీరాన్ని ఉత్తేజితం చేయడంలోనూ అద్భుతంగా పనిచేస్తాయి. వస్తి కర్మ, వాజీకరణ చికిత్సలతో పాటు, లైంగిక సమస్యల్ని చక్కదిద్దడానికి వాజీకరణ చికిత్సలు అందిస్తాం. మానసిక వ్యధతో ఉన్నవారికి శిరోధార చికిత్స కూడా చేస్తాం. వీటివల్ల సొరియాసిస్ శాశ్వతంగా తొలగిపోవడంతో పాటు రోగి శారీరకంగానూ, మానసికంగానూ సంపూర్ణ ఆరోగ్యవంతుడవుతాడు. వీటితో పాటే ఒక అద్భుతమైన లైంగిక శక్తి అతని సొంతమవుతుంది.



డాక్టర్ ఎన్. రామకృష్ణారెడ్డి
ఆర్.కె ఆయుర్వేదిక్ అండ్
సొరియాసిస్ రీసెర్చ్ సెంటర్

| | |
|---|---|
| కూకట్‌పల్లి | 8886922245 |
| నాంపల్లి | 8886922247 |
| హన్మకొండ | 8886922248 |
| విజయవాడ | 8886922249 |
| వైజాగ్ | 8886922250 |
| కర్నూలు | 8886922251 |
| తిరుపతి | 8886922252 |

# ల్యూకోకిట్‌తో తెల్లమచ్చలకు చరమగీతం

ఏ వ్యాధి అయినా చాలా కాలం దాకా తగ్గకపోతే అది ఏ జన్మ శాపమో, పాపమో అనడం మన వాళ్లకు అలవాటైపోయింది. కానీ, ఎంతటి దీర్ఘకాలిక వ్యాధినైనా సమూలంగా నయం చేసే అద్భుతమైన ఔషధాలు మనం ఆయుర్వేదంలో ఉన్నాయి. తెల్ల మచ్చలకు అలాంటి శక్తివంతమైన ఔషధాలే ఉన్నాయి.

శరీరంలో సహజంగానే హానికారకమైన ఫ్రీ ర్యాడికల్స్ తిరుగుతూ ఉంటాయి. వాటి పరిమాణం శరీరంలో మరీ ఎక్కువైనప్పుడు శరీరం వ్యాధి గ్రస్తమవుతూ ఉంటుంది. ఫ్రీ ర్యాడికల్స్‌కు అసలైన విరుగుడు యాంటీ యాక్సిడెంట్లు, పళ్లల్లో పుష్కలంగా ఉండే ఈ యాంటీ యాక్సిడెంట్ల కోసం విరివిగా పండ్లు తీసుకోని వారిలో ఈ ఫ్రీ ర్యాడిక ల్స్ ఉధృతి పెరుగుతుంది. ఒక దశలో ఇది తెల్ల మచ్చల వ్యాధికి కారణమవుతుంది. కనీసం సమస్య మొదలయ్యాకనైనా, యాంటీ-ఆక్సిడెంట్స్ కోసం పండ్లు తీసుకోకపోతే, వచ్చిన తెల్ల మచ్చల వ్యాధి మరింత తీవ్రమవుతుంది.

ఆధునిక వైద్యులు తెల్ల మచ్చలకు ఈ రోజున కూడా మందే లేదని చెబుతున్నారు గానీ, 5 వేల ఏళ్ల క్రితమే ఆయుర్వేద శాస్త్రం ఈ వ్యాధిని సమూలంగా తొలగించే ఔషధ మూలికలను సూచించింది. ఆ మూలికల కలయికలతోనే శ్రీ ధన్వసాయి ఆయుర్వేదిక్ ఫార్మసీ తెల్ల మచ్చలను సమూలంగా నిర్మూలించే ల్యూకోకిట్ అనే ఔషధాన్ని తయారు చేసింది. తెల్ల మచ్చలు రావడానికి కారణాలు చాలానే ఉన్నాయి. వాటిలో శరీరంలో వ్యర్థ విష పదార్థాలు పేరుకుపోవడం ఒక ప్రధాన కారణం. ఈ విషపదార్థాలు రక్తంలోకి ప్రవేశించినప్పుడు రక్తంలో హీమోగ్లోబిన్ నిలువలు పడిపోతాయి. ఫలితంగా శరీరంలోని మెలినిన్ తగ్గిపోయి చర్మం తన సహజ వర్ణాన్ని కోల్పోతుంది. ఇది తెల్ల మచ్చలు రావడానికి కారణమవుతుంది. ఆహారంలో ఫెర్రస్ కాపర్ లోపించడం కూడా అందుకు కారణమే. శరీరంలో సహజంగా ఫ్రీర్యాడికల్స్ తిరుగుతూ ఉంటాయి. మనం తీసుకునే ఆహారంలో యాంటీ ఆక్సిడెంట్లు లేకపోతే ఫ్రీర్యాడికల్స్ ఉధృతి పెరిగిపోయి అది కూడా తెల్ల మచ్చలకు దారి తీయవచ్చు. కొందరిలో విటమిన్ - డి లోపాల వల్ల కూడా తెల్ల మచ్చలు ఏర్పడవచ్చు. ఏ కారణంగా వచ్చిన తెల్ల మచ్చలైనా ఈ ల్యూకోకిట్ ఔషధాలతో మటుమాయమవుతాయి. ఇందులో కృత్రిమ ఔషధాలు, రసాయనాలు లేనందున ఏ రకమైన దుష్ప్రభావాలకూ తావు లేదు. ఈ ల్యూకోకిట్ ఔషధాలు ముందు మెలినిన్ ఉత్పత్తిని పెంచి, చర్మానికి సహజ వర్ణాన్నిచ్చే మెలినోసైట్స్‌ని సమృద్ధిగా తయారు చేస్తాయి.

ఈ ల్యూకోకిట్‌లో మూడు రకాల ట్యాబ్లెట్లు ఉంటాయి. వీటిని ఉదయం సాయంత్రం భోజనం తర్వాత వేసుకోవాలి. వీటితో పాటు చర్మం మీద అప్లైచేసే కలర్‌కాట్ ఎల్, కలర్‌కాట్- ఎల్ మిక్స్ ద్రావణం కలయికలతో చర్మానికి సహజ వర్ణాన్నిచ్చే ఔషధం తయారు చేయబడింది. సహజ వర్ణం పోయి తెల్ల మచ్చలు ఏర్పడిన చోట ఈ ద్రావణాన్ని అప్లై చేసి 10 నుంచి 15 నిమిషాల పాటు ఎండలో కూర్చోవాలి. రోజూ ఉదయం, సాయంత్రం ఈ మందును అప్లై చేస్తే మంచి ఫలితాలు వస్తాయి.ఇది జీవిత కాలపు శిక్ష అనుకున్న మచ్చలు ఏ నాడూ తిరిగి చూడకుండా మాయమైపోతాయి.




**పరమ భయంకర రూపంతో ప్రత్యక్షమైన నృసింహుని చూసి హిరణ్యకశిపుడు భయాందోళనలు చెందాడు. ఒక్క క్షణం అతనికేమీ పాలుపోలేదు. అంతలోనే తేరుకున్నాడు. తేరుకుని వేలాదిగా రాక్షసభటులతో నృసింహునిపై దాడి చేశాడు. తనపై దాడి చేసిన భటులందరినీ అంతమొందించాడు నృసింహుడు. మిగిలింది హిరణ్యకశిపుడొక్కడే! పారిపోజూశాడతను. చేయి సాచి అందుకున్నాడతన్ని నృసింహుడు. అదిమిపట్టాడు. గరుత్మంతుని చుంచువుల్లా పొడుచు కొచ్చే పెద్దపెద్ద చేతిగోళ్ళను గుండెల్లోకి దించి, అతని వక్షస్థలాన్ని చీల్చివేశాడు. పేగులుతీసి వికటాట్ట హాసం చేశాడు. హిరణ్యకశిపుడు మరణంతో ముల్లోకాలూ స్తిమితపడ్డాయి. అప్పుడు అమరులు సహా మునీశ్వరులంతా నృసింహుని వేవిధాల స్తుతించారు. సాష్టాంగపడి నమస్కరించారు. దేవతలకి పదవులు అనుగ్రహించి, అదృశ్యుడయ్యాడు నృసింహుడు. దివ్యధామం చేరుకున్నాడు.**

# వామనావతారం:దేవదానవుల సంగ్రామం

కొంతకాలం గడిచింది.

హిరణ్యకశిపుని కుమారుడు ప్రహ్లాదుని మనుమడు బలి, దేవేంద్రుని ఓడించాడు. స్వర్లోకరాజ్యాన్ని సొంతం చేసుకున్నాడు. స్వర్లోకం రాక్షసుల రాజ్యం కావడంతో దేవతలు చెల్లాచెదురైపోయారు. చెట్టుకొకరు పుట్టకొకరుగా రోజులు గడపసాగారు. అలా రోజులు గడుపుతున్న తన కుమారులను చూసి దుఃఖించింది అదితి. వారి శుభంకోసం తీవ్రంగా తపస్సు చేసింది. విష్ణువును ప్రార్థించింది. అప్పుడు ఆమె కడుపున విష్ణువు 'వామనుడు'గా జన్మించాడు. ఇంద్రుని సహోదరుడైన కారణంగా విష్ణువు 'ఇంద్రానుజుడు'గా ప్రసిద్ధికి ఎక్కాడు. చిన్ననాటి నుంచి బ్రహ్మచర్యాన్ని స్వీకరించాడు వామనుడు. వేదాధ్యయనం చేశాడు. ఆ కాలంలోనే బలిచక్రవర్తి అశ్వమేధయాగం ప్రారంభించాడు.

విష్ణువు అంటే బలికి ఎనలేని గౌరవం. ఆరాధన. ఆ దేవదేవుణ్ణి ఆరాధిస్తూ అతను చేయని దానం లేదు. మాట తప్పడం కూడా తెలియదు అతనికి.

అన్నీ గ్రహించి, బలి యజ్ఞవాటికలోకి ప్రవేశించాడు వామనుడు. వరాన్ని అర్థించాడు. పెద్దలు ఆ సంగతి బలికి చెప్పకమునుపే అతడది గ్రహించాడు.

సమస్తాభీష్టప్రదాత విష్ణువు. శ్రీదేవే వక్షస్సీమపై విరాజిల్లుతున్న ఐశ్వర్యశాలి. అలాంటివాడు చేతులు జాచి ముందు నిలుచుంటే అంతకంటే తనకి కావాల్సిందేముంది? విష్ణువు అడిగితే ప్రాణాలే అర్పిస్తాననుకున్నాడు బలి. మహదానందభరితుడైనాడు. వామనుడు అప్పుడు మూడు అడుగుల నేల కావాలన్నాడు. తప్పకుండా అన్నాడు బలి. తీసుకో అన్నాడు.

ఆ మాటకి వామనుడు త్రివిక్రముడైనాడు. పైపైకి పెరిగిపోయి జగత్తునంతా ఆక్రమించాడు. ఆ సమయంలో సూర్యుడు క్రమక్రమంగా వామనుని కిరీటి మాణిక్యంగా, హారంలోని మణిగా, మొలతాడు వజ్రంగా, కాలి అందెమహామణిగా పరిణమించాడు. అనుక్షణం అభివృద్ధి చెందుతున్న త్రివిక్రముని పరాక్రమోద్ధతి భరించలేక విప్రచిత్తి, అశ్వశీర్షుడు, శ్వపతి, కరాళుడు, రాహువు మొదలైన రాక్షస ప్రముఖులు ఒకొక్కరూ తాబేళ్ళు, కోళ్ళు, కొంగలు, మొసళ్ళు, నక్కలు, పిల్లులాదిగా వివిధ జంతు రూపాలు ధరించి వామనుని అనేకరకాలుగా హింసించసాగారు. అతనితో యుద్ధానికి తలపడ్డారు. ఆ యుద్ధంలో వారందరినీ తుత్తునియలు చేశాడు వామనుడు. గగనభాగాన్ని పూర్తిగా ఆక్రమించుకున్నాడు. బలిని నిస్సహాయుణ్ణి చేశాడు. నిర్భాగ్యుణ్ణి చేశాడు. త్రిలోక రాజ్యాధికారాన్ని తిరిగి ఇంద్రునికి అప్పగించాడు. ఇది వామనావతార కథ.

ఇప్పుడు పరశురామ అవతారం కథ చెబుతాను, విను.

అత్రి కుమారుడైన దత్తాత్రేయుడు సాక్షాత్తు భగవంతుని అవతారమే! సనాతన ధర్మాన్ని ప్రతిష్ఠించేందుకు భగవంతుడు ఆ అవతారాన్ని ఎత్తాడు. కృతవీర్యుని కుమారుడు కార్తవీర్యార్జునుడు దత్తాత్రేయుణ్ణి ఆరాధించి వేయి చేతుల్ని సాధించాడు. సమస్త భూమండలాధిపత్యం, అపరిమిత ఐశ్వర్యం వరాలుగా పొంది పాలించసాగాడు. కొంతకాలం గడిచింది. అప్పుడు జమదగ్ని కుమారుడు పరశురాముడు, తన కరకు గండ్రగొడ్డలితో కార్తవీర్యార్జుని వేయి చేతులూ నరికి వేశాడు. అంతేకాదు, భూతలి మూలమూలలా వెదకి, ఇరవై ఒక్కసార్లు క్షత్రియులందరినీ అంతమొందించాడు. వారందరి రక్తంతో అయిదుమడుగులు రూపొందించాడు. అశ్వమేధ యాగం చేశాడు. అనేకదానాలు చేశాడు. ఇంతటి దాత లేడనిపించుకున్నాడు. కశ్యపమునికి భూమి యావత్తు యజ్ఞదక్షిణగా సమర్పించాడు. కేవలం కృష్ణాజినాన్ని మాత్రమే ఉత్తరీయంగా ధరించి, సకల లోక హితార్థం నేటికీ మహేంద్రగిరిపై తీవ్రతపస్సు చేస్తున్నాడు.

పరశురామ అవతార ప్రయోజనం పూర్తి కావడంతో శ్రీమన్నారాయణుడు ఇరవైనాలుగవ త్రేతాయుగంలో దశరథునికి చతురంశలలో నలుగురు కుమారులుగా జన్మించాడు. వారిలో పెద్దవాడు రాముడు. అతను నీలమేఘశ్యాముడు. మహాధైర్యశాలి. ఆ వీరాగ్రణి పిన్నవయసులోనే విశ్వామిత్రుని నుండి మహాస్త్ర సంపత్తి స్వీకరించాడు. ఆయన యజ్ఞ విధ్వంసకుడు సుబాహును సంహరించాడు. ఆ తర్వాత శివధనుస్సు విరిచి, సీతను పెళ్ళాడాడు. కొంతకాలానికి తండ్రి ఆనతి మేరకు సీత లక్ష్మణుల సహా అరణ్యవాసం చేశాడు. పద్నాలుగేళ్ళు అరణ్యవాసం చేశాడు. అప్పుడే రాక్షసులందరినీ సంహరించాడతను. మారీచుణ్ణి సంహరించింది కూడా అప్పుడే! కబంధ విరాదులకి శాపవిముక్తి కలిగించింది కూడా అప్పుడే!

ఆనాడే మహాశక్తిశాలి వాలిని వధించి, అతని తమ్ముడు సుగ్రీవుణ్ణి కపిరాజ్యాధిపతిని చేశాడు. సముద్రం మీద సేతువు నిర్మించి, లంకానగర ప్రవేశం చేశాడు. లంకాధినేత రావణునితో ఘోర యుద్ధం చేశాడు. ఆ యుద్ధంలో అతన్ని సంహరించి, యక్ష గంధర్వాదులందరినీ రక్షించాడు. రాముని తమ్ములు లక్ష్మణాదులు ఇంద్రజిత్తు, లవణాసురుడు ఆదిగా దానవులను అనేకుల్ని సంహరించారు. రావణవధ అనంతరం రాముడు అయోధ్యకు చేరుకున్నాడు. పట్టాభిషిక్తుడయ్యాడు. పది అశ్వమేధ యాగాలు చేశాడు. ప్రజలందరినీ కన్నబిడ్డల్లా చూసుకున్నాడు.

రామరాజ్యంలో విషం, శస్త్రాలు, జలం, అగ్ని, శత్రువులు, దొంగలులాంటి పీడలేవీ ఉండేవికావు. భార్యాభర్తలు అన్యోన్యంగా ఉండేవారు. వర్ణాశ్రమ ధర్మాలకి ఎలాంటి విఘాతం కలగలేదు. అకాల మృత్యువు, రోగాలు, కలతలు, క్షామాలు రాలేదు. ప్రజలంతా వేలకొలది సంవత్సరాలు జీవించారు. మునీం

**భువనాన్నే రథంగా చేసుకుని ఆకాశంలో దేవతలకు సాక్షాత్కరించాడు విష్ణువు. సూర్యచంద్రులే అతడి రథానికి చక్రాలుగా మారారు. మందరగిరి ఇరుసుగా, మేరుగిరి నొగగా, అనంతుడు పగ్గపుతాడుగా మారాయి. ఆకాశంలో తారలు ఆ రథానికి పుష్పాలంకారాలైనాయి. రథంపైన గరుడధ్వజం శత్రువులకు భీతిగొలిపేలా ఆవిష్కృతమైంది. ఇదంతా దేనికి? ఏ కారణంగా నారాయణుడలా సాక్షాత్కరించాడు?**

ద్రులూ, దేవతలూ మానవులతో కలసి మెలసిపోయారు. అలా రాముడు పదకొండువేల ఏళ్ళపాటు పరిపాలించి, పరమపదం చేరుకున్నాడు.

హరి ఆపైన యాదవవంశంలో బలరామునిగా, శ్రీకృష్ణునిగా జన్మించాడు. జన్మించి ప్రలంబుడు, ముష్టికుడు, ఘైందుడు, ద్వివిదుడు, మురుడు, నరకుడు, శిశుపాలుడు, కాలయవనుడు, పౌండ్రకుడు మొదలైన దురాత్ములను సంహరించాడు. బాణాసురుని పరాభవించాడు.

కలియుగాంతంలో విష్ణువు కల్కి అవతారం ధరిస్తాడు. 'విష్ణుయశుడు' అన్న పేరుతో జన్మిస్తాడు. ధర్మాన్ని రక్షిస్తాడు అని ఆగాడు వైశంపాయనుడు. కళ్ళు మూసుకుని శ్రద్ధగా వింటున్న జనమేజయుణ్ణి చూసి వెంటనే చెప్పాడిలా.

ఇంతవరకూ విష్ణువు అవతారగాథలు విన్నావు. ఇప్పుడు విష్ణుదేవుని మహిమలు చెబుతాను, విను.

పూర్వం కృతయుగంలో వృత్రాసురసంహారం అనంతరం దేవాసురుల మధ్య 'తారకామయం' అన్న ఘోరసంగ్రామం జరిగింది. ఆ సంగ్రామంలో దైత్యుల ఘోరాయుధాల ప్రయోగంతో గాయాలపాలైన దేవతలు విష్ణువును ప్రార్థించారు. ధ్యానించారు. అప్పుడు విష్ణువు, భువనాన్నే రథంగా చేసుకుని వారికి అల్లంతదూరంలో ఆకాశంలో సాక్షాత్కరించాడు. విష్ణువురథానికి సూర్యచంద్రులు చక్రాలయినారు. మందరగిరి ఇరుసుగా మారింది. మేరుగిరి నొగగా మారింది. అనంతుడు పగ్గపుతాడు అయినాడు. ఆకాశంలోని తారలు, ఆ రథానికి పుష్పాలంకారాలైనాయి. రథం మీది గరుడధ్వజం శత్రువులకు భీతిగొలిపేలా ఉంది. దేవతలు అది గమనించి పరమానందపులకితులైనారు. జయ జగన్నాథ! జయ జనార్దన! జయ హృషీకేశ అని జేజేలు పలికి, నమస్కరించారు. తమ భయకారణాన్ని జాలి జాలిగా నివేదించారు.

విన్నాడది విష్ణువు. సన్నగా నవ్వాడు. చెప్పాడిలా. త్వరలోనే ఆ దైత్యులందరినీ తుత్తునియలు చేస్తాను.

ఆ మాటకి ఆనందించారు దేవతలు. వారి ఆనందాన్ని రెట్టింపు చేస్తూ సూర్యుడు జాజ్జ్వల్యమానంగా ప్రకాశించాడు. మునీశ్వరులు వేల్చిన హవ్యాలతో అగ్నిదేవుడు ప్రదక్షిణాకారంలో ప్రజ్వలించాడు. వాయుదేవుడు చల్లగా వీచి, అమరులకు ఆహ్లాదం కలిగించాడు. ఆ శుభశకునాలను గమనించి, త్వరలోనే తమకు విజయం తథ్యం అనుకున్నారు దేవతలు. ఉత్సాహంగా ఒకరినొకరు కౌగలించుకున్నారు.

ఆ సమయంలో వసువులు, రుద్రులు, ఆదిత్యులు, మరుత్తులు, అశ్వినీదేవతలు, విశ్వేదేవతలు, సాధ్యులు అంతా ఇంద్రుడికి అగ్రభాగాన నిలిచి, యుద్ధసన్నద్ధులయినారు. మాతలి సారథ్యం వహించిన దివ్యరథం దేవతలను ఉత్తేజితుల్ని చేసింది. మిరుమిట్లుగొలిపే కాంతులతో వెలిగిపోతున్న దాని అశ్వాలు యుద్ధంకోసం ఎదురుచూస్తున్నట్టుగా ముందుకు ఉరికాయి. సరిగ్గా అప్పుడంటే అప్పుడే ఐరావతాన్ని అధిరోహించి వస్తూ ఇంద్రుడు విజయసంకేతంగా వజ్రాయుధాన్ని పైకెత్తాడు. అందుకు దేవతలు జయజయధ్వానాలు చేశారు. అతని పార్శ్వంలో యమధర్మరాజు నిలిచాడు. వ్యాధులపరివారంతో పరమభయంకరుడై నడిచాడు. మరొక పార్శ్వాన వరుణదేవుడు సాగరసర్ప సపరివారసహితుడై మున్ముందుకు లంఘించాడు. అనేకమంది యక్షరాక్షసులతో మహనీయగదాయుధం ధరించి కుబేరుడు ఇంద్రుని వెనుక భాగంలో నిలిచాడు. దిక్పాలకులంతా తమతమ వాహనాలపై అధిరోహించి, వీరాలాపాలతో దశదిశాంతరాళం భేదించారు. సూర్యచంద్రులు కూడా యుద్ధసన్నద్ధులయ్యారు. అదే అదనుగా చక్రాయుధధారులైన విజయ యోద్ధలు కొందరు ఆకాశంలో విషాగ్నివర్షం కురిపించారు. పెద్దపెద్దపర్వతాలు దైత్యులపై శిలావృష్టి కురిపించేందుకు తహతహలాడాయి. వాటిమధ్య, వారిమధ్య సమస్త ఆయుధాలతో శ్రీమహావిష్ణువు ప్రళయాగ్నిలా, మహామార్తాండునిలా ప్రజ్వలించాడు.

విష్ణువు సమరసన్నాహాన్ని తెలుసుకుని మయాది దైత్యులు ఆగ్రహోదగ్రులయ్యారు.

వెన్నిచ్చి పారిపోయిన వేల్పులు ఇప్పుడు విష్ణుమూర్తి సాయంతో ముందుకురుకుతున్నారు. వారి అంతు చూడాల్సిందే అనుకున్నారు. తమ సైన్యాన్నంతా ఒకచోటికి చేర్చారు. మయాసురుడు అప్పుడు నాలుగు పెనుచక్రాలతో, పన్నెండువందల మూరల వైశాల్యంతో శాత్రవభయంకరమైన బంగారు రథాన్ని అధిరోహించి, సేనావాహిని ముందు నిలిచాడు. అతడే అధీశ్వరుడు అన్న భ్రాంతిని కలిగించాడు. గొంతెత్తి గర్జించాడు. యుద్ధానికి సిద్ధమయ్యాడు. రెండువేల ఎలుగుబంట్లు పూన్చిన అతని రథం మహావేగంతో ముందుకు ఉరికింది. ఆ శూరునికి అతికొద్దిదూరంలో తారుడు కూడా అదే విధంగా వీరావేశంతో నడిచాడు. ఎనిమిది ఇనుపచక్రాలతో, వేయి గార్దభాలతో ఆ వీరుని రథం పరుగు దీసింది. విరోచనాసురుడు అతని పార్శ్వంలో కఠోర పాదఘాతాలతో ధరాతలాన్ని వణకించాడు. హయగ్రీవుడు వేయి గుర్రాలు పూన్చిన పెనురథంపై వస్తూ శత్రువుల గుండెలవిసిపోయేటట్టు హూంకరించాడు. వేయిచేతులతో సుదీర్ఘమైన ధనుస్సును అన్ని వైపులా పరిభ్రమింపజేస్తూ వరాహుడు రెచ్చిపోసాగాడు. అలాగే విక్షరుడు, త్వష్టవైరి, శ్వేతుడు, అరిష్టుడు, బాణాసురుడు, లంబుడు, రాహువు విపరీతభీతి కలిగించారందరికీ.

ఇటు దివిజులు, అటు దైత్యులు...రెండు వాహినులూ ఘోరసాగరాల్లా చెలరేగి ఒకరిపై ఒకరు విజృంభించారు. విష్ణుమూర్తి చక్రగదా శార్జాయుధాలు ధరించి, గరుత్మంతుని అధిరోహించాడప్పుడు. యుద్ధోన్ముఖుడయ్యాడు. దేవతల జయజయ ధ్వానాలందుకున్నాడు.

—అరణి



# వెట్టి
## (ది వారియర్)
### -మధుబాబు




**తల ఊపి వెంటనే తమ వెహికల్ దగ్గరికి పోలేదు ఆ జనం. తల తిప్పి, గుర్రపోడు వైపు చూశారు.**

**బాజిరెడ్డిసారు చెప్పిన మాటల్ని తడుముకోకుండా రిపీట్ చేయవలసిన ఆ పెద్దమనిషి, ఒంటికి సరిపడని చేదు పదార్థం నోట్లో పెట్టుకున్నట్టు ముఖం చిట్లించాడు.**

**'ఏంట్రా? ఏంటీ నీ అనుమానం? వినబడలేదా నా మాట?' గర్జించినంత పని చేశాడు బాజిరెడ్డి.**

'అబ్బెబ్బే... అదేం కాదు సారూ? వినబడింది కాని...' అంటూ మాటలకోసం తడుముకుంటున్నట్టు ఆగిపోయాడు గుర్రపోడు.

'ఏంటది? ఏంటి నీ అనుమానం?' రెట్టించాడు బాజిరెడ్డి.

'సారూ... ఆడు గనుక ఎస్టేట్‌లోనే ఉంటే బయటికి లాగటం ఎలాగో నాకు తెలియదు. ఆడిని ఈళ్ళకి చూపించటం ఎలాగో కూడా మీరే చెప్పాలి?' తన అనుమానం బయట పెట్టాడు గుర్రపోడు.

'ఏడ్చినట్టుంది నీ అనుమానం. పిలువ్ బయటికి. రాగానే మీదపడి...' అంటూ మాట మధ్యలోనే ఆపాడు బాజిరెడ్డి.

ఎస్టేట్‌లో అడుగుపెట్టే అధికారం, ధైర్యం చాలా కొద్దిమందికి మాత్రమే ఉన్నట్టు గుర్తుకు రావటమే అందుకు కారణం.

ఎటువంటి సమయంలోనైనా వెళ్ళగలడు తను. తన డ్రైవర్ కూడా తానెవరో చెప్పుకుని లోపలికి పోగలడు. మిగిలినవారు ఎవరైనా సరే గేటు ముందే ఆగిపోవాలి. వచ్చింది ఎవరో తెలియకపోతే వెంటనే అడ్డుకుంటారు లోపల ఉండే శివారెడ్డి జనం.

'బలే చిక్కు వచ్చిపడింది, ఇప్పుడెలా?' నుదురు రుద్దుకుంటూ తన డ్రైవర్‌ని అడిగాడు అతను.

'ఇందులో ఇంతగా ఆలోచించాల్సిన పనేముంది సారూ. మనం ముందుగా పోయి ఏదో ఒక వంకతో ఆడిని రోడ్డు మీదికి పంపించేస్తే సరిపోతుంది' చాలా తేలికగా పరిష్కారమార్గాన్ని సూచించాడు డ్రైవర్.

'మనం వెళ్ళి బయటికి పంపించేవరకూ వాడు బతికి ఉండటం నాకు ఇష్టం లేదు. ఇంకోదారి ఏదైనా ఉంటే చెప్పు' అన్నాడు బాజిరెడ్డి.

'మీరు కార్లో కూర్చోండి సారూ. నేను సంపంగితో మాట్లాడతాను' అంటూ చేతిని జాచాడు డ్రైవర్.

అతను ఎందుకు అలా చేస్తున్నాడో అర్థమై తన ఫోన్ అతనికి అందించి, అతను చెప్పినట్లు తమ వెహికల్‌లోకి ఎంటరైనాడు బాజిరెడ్డి.

***

'సంపంగీ... సంపంగీ..' బిగ్గరగా పిలిచింది శివారెడ్డి భార్య.

కిచెన్‌లో నిలబడి, అక్కడి వంట పనుల్ని పర్యవేక్షిస్తున్న సంపంగి, ఉలికిపడి బయటికి పరిగెత్తుకు వచ్చింది.

'అయ్యగారు ఈ రోజున కొద్దిగా ఆహారం తీసుకోవచ్చని డాక్టరుగారు చెప్పారు. మంచి కూర ఏదైనా చేసి పంపించు. బియ్యాన్ని వేయించి, పలుచగా జావమాదిరి వండించు' అంటూ ఎదురు వచ్చింది శివారెడ్డి భార్య.

చాలాకాలం తరువాత అటువంటి మాట విన్నందుకు ఎంతగానో సంతోష పడుతున్నట్టు ముఖం పెట్టి, గబగబా తల ఊపింది సంపంగి.

'అరగంటలో రెడీ చేయిస్తాను తల్లీ... ఒక్క అరగంట' అంటూ వెనుతిరిగి మళ్ళీ కిచెన్‌లోకి ఎంటరయ్యింది.

తాను కూడా వెనుదిరిగి డైనింగ్ హాల్లోకి వెళ్ళింది శివారెడ్డి భార్య.

పిచ్చమ్మి ఉన్నది అక్కడ. ప్రణవి, ప్రత్యూష, శంకరయ్య ఆమెకు దగ్గరగా కూర్చొని ఉన్నారు.

'ఏమిటి వదినమ్మ? ఏమిటి విశేషం?' శివారెడ్డి భార్య ముఖంలో వెలుగును



చూసి ఆశ్చర్యంగా అడిగింది ప్రణవి.

దగ్గరికి పోయి ఆ పిల్లను గట్టిగా కౌగలించు కున్నది శివారెడ్డి భార్య. 'ఇవాల్టి నుంచీ మీ అన్నయ్య అందరి మాదిరిగానే మామూలు ఆహారం తీసుకో వచ్చని డాక్టరుగారు చెప్పారు. నార్మల్‌కి వచ్చే సిందట కిడ్నీల ఫంక్షన్. ఇంకో వారం పదిరోజుల్లో మన మాదిరిగానే లేచి తిరగవచ్చని కూడా చెప్పారు' తడి కనుల్ని తుడుచుకోను కూడా తుడుచు కోకుండా చెప్పింది.

క్రికెట్ మ్యాచ్ చూస్తున్న అభిమానులు తమ ఫేవరెట్ ప్లేయర్ సిక్సర్ కొట్టినప్పుడు ఎలా అరిచి కేకలు పెడతారో, అదే విధంగా ఒక గంతువేసి చెవులు చిల్లులు పడేటట్లు అరిచింది ప్రణవి.

'పెళ్ళి చేసి ఉంటే ఇద్దరు పిల్లల్ని కలిగి ఉండే వయసు నీది. ఏమిటే ఆ పిచ్చికేకలు?' కనులు చిట్లిస్తూ అడిగింది పిచ్చమ్మి.

'అన్నయ్య.. అన్నయ్య.. హీ ఈజ్ బికమింగ్ ఎ వెరీ వెరీ నార్మల్ పర్సన్! అరవటంలో తప్పేముంది మమ్మీ..' సిగ్గుపడాల్సింది పోయి చాలా ఎగ్రెసివ్‌గా అడిగింది ప్రణవి.

'నీ ముఖం.. నీ ఇష్టం వచ్చినట్టు అరుచుకో. నా కోసం పిలిపించిన ఆ పిచ్చి డాక్టర్‌ని నీ కోసం కూడా పిలుస్తారు. అప్పుడు గాని నీ తిక్క కుద రదు' అంటూ శంకరయ్య వైపు తిరిగింది ఆమె.

'ఆ కుర్రాడు స్నానం చేసి ఫ్రెషప్ అయి వస్తా నని వెళ్ళి చాలాసేపు అయింది. తిండి తిప్పలతో అవసరం లేదని అనిపిస్తోంది. వెళ్ళి ఏమైపోయాడో చూసి వస్తారా?' అని అడిగింది.

'ఎప్పుడో పొద్దుననగా పోయిన వాడు ఇంకా బాత్రూంలోనే కూర్చుని ఉంటాడా? డ్రెసప్ అయి మళ్ళీ దేశం మీద పడి ఉంటాడు' సన్నటి కంఠంతో చెప్పింది ప్రత్యూష.

'సంపంగీ... ఓయ్ సంపంగీ..' బిగ్గరగా పిలి చింది శివారెడ్డి భార్య.

పరిగెత్తుకుంటూ వచ్చింది సంపంగి. 'అవుట్ హౌస్‌లో అబ్బయ్య ఉన్నాడా, ఎక్కడికైనా పోయాడా?' అడిగింది ఆమె.

'ఇందాక ఒక గంట క్రితం టీ తీసుకుపోయి ఇచ్చాను. శుభ్రంగా స్నానంచేసి మన రమణయ్య పంతులుగారితో కబుర్లు చెపుతున్నాడు' చెప్పింది సంపంగి.

'అవుట్‌హౌస్‌లోనే ఉన్నాట్ట తల్లీ.. ఎక్కడికీ పోలే దట' సంపంగి మాటలు పిచ్చమ్మికి వినబడుతూనే ఉన్నాయని తెలిసి కూడా రిపీట్ చేశాడు శంక రయ్య.

'నేను ఎందుకు అడిగానో మీకెవరికీ అర్థం అయి నట్టు లేదు. వట్టిగా వదిలిపెడితే ఊరికే కూర్చునే రకం కాదు. కాలు కుదురులేని మనిషి. వెళ్ళి వెంట బెట్టుకు రావటం బాగుంటుంది' అన్నది పిచ్చమ్మి.

సంపంగి వైపు చూసింది శివారెడ్డి భార్య. 'నువ్వు వెళ్ళి అత్తమ్మ పిలుస్తోందని చెప్పి'... అంటూ ఉండ గానే, చాలా స్పీడ్‌గా డైనింగ్‌హాల్లోకి వచ్చింది శివా రెడ్డి దగ్గర డ్యూటీ చేస్తున్న నర్సు.

'అమ్మగారూ... అర్జంట్‌గా రావాలి... త్వరగా త్వరగా' ఆందోళన నిండిన కంఠంతో పిలిచింది.

అదిరిపడింది శివారెడ్డి భార్య. చివాలున కుర్చీలో నుంచి లేచింది పిచ్చమ్మి. శంకరయ్య అయితే తన పై పంచె కిందపడిపోతున్నా పట్టించుకోకుండా బాణం మాదిరి పరిగెత్తాడు.

బెడ్‌మీద పడిపోయి ఉన్నాడు శివారెడ్డి. డ్యూటీ చేస్తున్న డాక్టరు ఆక్సిజన్ మాస్క్‌ని తగిలించి, పక్కనే ఉన్న ఎలక్ట్రానిక్ మెషీన్‌లో అతని హార్ట్ పనితీరును మానిటర్ చేస్తున్నాడు.

## జరిగిన కథ

వెట్టి అసలు పేరు విఠల్‌రెడ్డి. తన పెత్తనాన్ని సవాలు చేసిన వెట్టిని అంతమొందించాలనుకుం టాడు బాజిరెడ్డి. రాయుడిపల్లిలో చౌడేశ్వరికి జరి గిన అపచారమేమిటో వెట్టి తెలుసుకుంటాడు. కదిరి బయలుదేరిన అతడికి చౌడేశ్వరి ఆత్మశిల కనిపిస్తుంది. దారిలో తనకు తారసపడిన పఠాన్‌ని అరెస్ట్ చేయిస్తాడు. పిచ్చిపూజారికి ఆత్మశిల గురించి చెప్పి, ఎవరికీ తెలియకుండా ఆ తల్లిని యథా స్థానంలో ఎలా ప్రతిష్ఠించాలో ఆలోచించమంటాడు. తిరిగి ఎస్టేటుకు వచ్చిన వెట్టి, సబ్బిరెడ్డితో మాట్లాడి పఠాన్‌ని విడిచిపెట్టమంటాడు. అందుకు ఒప్పు కుంటాడు సబ్బిరెడ్డి. రాయుడిపల్లిలో వెట్టి ఆచూకీ దొరక్క, బాజిరెడ్డిని కలుస్తారు గ్రానైట్‌మైన్స్ వాళ్ళు.

**ఆ తర్వాత...**

'ఏమైంది? ఇప్పటివరకూ బాగానే ఉన్నారు కదా. ఇంతలోనే ఏమైంది?' కళ్ళ నీళ్ళ పర్యంతం అవుతూ అడిగింది శివారెడ్డి భార్య.

'ఫోను వచ్చింది తల్లీ.. రెండే రెండు నిమిషాలు మాట్లాడి–' అంటూ మాటను ఆపేశాడు డాక్టరు.

పక్కనే పడి ఉన్న ఫోను మోగటమే అందుకు కారణం.

'అదే అయి ఉంటుంది. ఇందాక సారు మాట్లా డిన ఫోనే అయి ఉంటుంది' చెప్పాడు డాక్టరు, తన డ్యూటీ తను చేస్తూనే.

వణుకుతున్న చేతులతో ఫోన్‌ని అందుకున్నది శివారెడ్డి భార్య.

'మాట మధ్యలో ఫోన్ పెట్టేస్తే వదిలిపెడ తామని అనుకోవటం చాలా తప్పు. మేము పట్టు పట్టటం అంటూ జరిగితే, దేవుడు దిగివచ్చినా వెనక్కి తగ్గటం జరగదు. అర్థం అయిందా శివారెడ్డి సారూ?' గంభీరంగా వినవచ్చింది ఒక కంఠం.

బుగ్గలమీదికి కారుతున్న కన్నీటిని తుడుచుకో నుకూడా తుడుచుకోకుండా, తల తిప్పి పిచ్చమ్మి వైపు చూసింది శివారెడ్డి భార్య.

'మాట్లాడవే.. ఎవరో అడుగు.. ఏమిటో తెలు సుకో' ప్రాంప్ట్ చేసింది పిచ్చమ్మి.

'హల్లో... మీరు ఎవరో నాకు తెలియదు. నా భర్త చాలా అనారోగ్యంగా ఉన్నారు. ఆయనకు బదులుగా నేను మాట్లాడుతున్నాను. మీ మాటలు నాకు అర్థం కావడం లేదు. వివరంగా చెప్పండి' అర్థించింది ఆమె.

'అదాసంగతి... మగాళ్ళకు బదులు ఆడాళ్ళు వచ్చారా?' వెక్కిరింపుగా అన్నది అవతలి కంఠం.

'దయచేసి మా పరిస్థితిని అర్థం చేసుకోండి. మీరెవరో, ఎందుకు ఫోనుచేశారో చెప్పండి' మరో సారి మర్యాదగానే అడిగింది ఆమె.

ఇంకోసారి వెక్కిరింపుగా మాట్లాడితే, ఆమె వేరే విధంగా మాట్లాడటానికి సిద్ధం అవుతున్నదని తెలిసిపోయింది కాబోలు, ఈసారి కుదురుగానే వినవచ్చాయి మాటలు.

'అమ్మా... మేము కడప నుంచి మాట్లాడు తున్నాము. శివారెడ్డి సారుకు అనారోగ్యమని మాకు తెలుసు, అందుకే ఎస్టేట్ నడిపించేందుకు మీరు పవర్ ఆఫ్ అటార్నీ బాజిరెడ్డికి ఇచ్చారు కదా..' అన్నది.

'తెలుసు' అన్నది ఆమె.

'అత్యవసరంగా కావాలని ఆ బాజిరెడ్డి మా దగ్గిర నూట ఎనభై రెండు కోట్లు అప్పు తీసుకుని సంవత్సరం పైన అయింది. ఇంతవరకూ ఒక్కపైసా కూడా చెల్లు పెట్టలేదు. ఎప్పుడు అడిగినా అదిగో ఇదిగో అంటూ వాయిదాలు పెడుతున్నాడు. అందుకే మేము ఈసారి శివారెడ్డి సారుకే ఫోన్ చేసినాము. మూడు రోజుల్లో మా పైకం మాకు తిరిగి ఇవ్వని పక్షంలో మేము కోర్టులకి, పంచాయితీలకి పోము తల్లీ.. సరాసరివచ్చి ఎస్టేట్ని స్వాధీనం చేసు కుంటాము. అది చెప్పటం కోసమే ఈ ఫోను..' అంటూ ఉన్నట్లుండి ఆగిపోయింది అవతలి కంఠం.

శివారెడ్డి భార్య ముఖం నెత్తురు లేనట్టు తెల్లగా మారిపోయింది. ఆమెకు తెలియకుండానే చేతుల్లో నుంచి జారి కిందపడిపోయింది ఫోను. పాదాల్లో శక్తి నశించిపోయినట్లు తూలి పక్కకు పడిపోబోతుం డగా పట్టుకుని ఒక కుర్చీలోకి నెట్టింది పిచ్చుమ్మి.

జలజలా బుగ్గల మీదికి వచ్చేశాయి కన్నీళ్ళు. తన రోదన ధ్వని బయటికి వినిపిస్తే తన భర్త మరింతగా డిప్రెస్ అయిపోతాడన్న భయంతో పమిట చెంగును నోటికి అడ్డం పెట్టుకుంది ఆమె.

'ఏమిటే... ఏమైంది?' ఆమె చుబుకం పట్టుకుని ముఖాన్ని తనవైపు తిప్పుకుంటూ అడిగింది పిచ్చుమ్మి.

'ఆయన ఆరోగ్యం కుదుటపడిందన్న సంతోషం ఆవిరైపోయిందత్తమ్మ. మీకు నయమైపోయిందన్న సంబరం కూడా మాడి మసికొట్టుకుపోయింది. అంతా సర్వనాశనం అయిపోయింది' ఆమె చేతుల్లో ముఖం పెట్టుకుంటూ బావురుమన్నది శివారెడ్డి భార్య.

'తల్లీ... మీరు గట్టిగా మాట్లాడకండి. శివారెడ్డి సారు ఎగ్జయిట్ అవకూడదు' దయచేసి బయటికి

**ఎటువంటి సమయంలోనైనా ఎస్టేటు లోపలికి పోగలడు తను. అంతటి ధైర్యం, అధికారం తనకి మాత్రమే ఉన్నాయి. మిగిలినవారు ఎవరైనా గేటు బయట ఆగిపోవాల్సిందే! కాదూ కూడదని గొడవచేస్తే శివారెడ్డి జనం మీదకొచ్చేస్తారు. వెట్టిని మైన్సోళ్ళకి చూపించటం ఎలా? ఆలోచిస్తున్నాడు బాజిరెడ్డి. మరి అతడు ఏం ఆలోచన చేశాడు? వాళ్ళకి వెట్టిని చూపించగలిగాడా?**

వెళ్ళిపొండి' కంగారుగా అన్నాడు డాక్టరు.

ఈదురుగాలిలో చిక్కుపడిన వృక్షం మాదిరి వణికిపోతున్న శివారెడ్డి భార్యను కౌగిలించి పట్టు కుని, తను కూర్చోబెట్టిన కుర్చీలోనుంచి బల వంతంగా పైకి లేపింది పిచ్చుమ్మి.

'డాక్టరుగారు చెప్పింది నిజం. నువ్వు ఏడు స్తున్న శబ్దం అబ్బాయికి వినబడితే లేనిపోని బాధ. బయటికి పోదాం పద' అంటూ ఆ గదిలో నుంచి బయటికి తీసుకు వచ్చింది.

బిక్కమొగాలతో ఆమె వెనుకే తాము కూడా బయటికి వచ్చారు ప్రణవి, ప్రత్యూష, శంకరయ్య.

అంతకుముందు ఎక్కడి నుంచి శివారెడ్డి దగ్గ రికి పరిగెత్తారో తిరిగి ఆ డైనింగ్ హాల్లోకే వచ్చారు అందరూ.

'సంపంగీ... టీ తీసుకురా. వేడిగా ఉండాలి' సంపంగికి ఆర్డర్ ఇచ్చింది పిచ్చుమ్మి. ప్రణవి వైపు తిరిగి, 'నా మనిషిని వెంటనే పిలిపించు' అన్నది.

ప్రణవి తనకు చెప్పకముందే తూనీగ మాదిరి అవుట్హౌస్ వైపు పరిగెత్తింది ప్రత్యూష.

***

'...ఇప్పటివరకూ నువ్వు చేసిన ప్రతీ పని చాలా అద్భుతంగా ఉన్నది అబ్బయ్యా. వేలు పెట్టి చూపించ టానికి చిన్నపాటి అవకాశం కూడా లేదు. కాని...' అంటూ మాటల్ని ఆపాడు అవుట్హౌస్ సోఫాలో కూర్చుని ఉన్న రమణయ్యపంతులు.

అంతకుముందే తాను స్వయంగా రోడ్డుమీదికి పోయి తెచ్చుకున్న సిగరెట్ ప్యాకెట్లో నుంచి సిగ రెట్ని తీసి వెలిగించుకుంటూ ప్రశ్నార్థకంగా చూశాడు వెట్టి.

'చందనం చెట్లు కొట్టిస్తున్న ఆ పఠాన్గాడిని కావాలని రెడ్హ్యాండెడ్గా సబ్బిరెడ్డికి పట్టించావు. ఆ సన్నాసి పని అయిపోయినట్టే అనుకుంటూ ఉండగా మళ్ళీ నువ్వే బెయిల్ మీద బయటికి వచ్చే టట్టు చేశావ్' అన్నాడు పంతులుగారు.

'వాడు వచ్చినంత మాత్రాన ఇప్పుడు ఏం తంటా వస్తుంది?' అడిగాడు వెట్టి. 'తంటా వస్తుందో రాదో మీరిద్దరు ఒకరికొకరు ఎదురుపడినప్పుడు తెలుస్తుంది. నిన్ను వాడు గుర్తు పడతాడు. ఆ గ్రానైట్మైన్స్ వాళ్ళకు అప్పగిస్తాడు. మర్చి పోయావా?' అడిగాడు పంతులుగారు.

సిగరెట్ పొగ గుండెలనిండా పీల్చుకుని సీలింగ్ వైపు రింగులు రింగులుగా వదులుతూ చిరునవ్వు నవ్వాడు వెట్టి.

'వాడు నన్ను గుర్తుపట్టినా పట్టకపోయినా పెద్ద తేడా ఏమీ ఉండదు. బసవప్పని చితక కొట్టి నందుకు కచ్చతో రగులుకుపోతూ నాకోసం వెతుకు తున్నారు గ్రానైట్మైన్స్ జనం. తమకు కావల్సిన మనిషిని నేనేనని తెలియకుండానే నా మీదికి వస్తారు. నన్ను చూసిన వెంటనే తమంతట తామే గుర్తు పట్టేస్తారు' అన్నాడు.

'ఇంత పెద్ద ఇబ్బందిలో ఉన్నప్పుడు మళ్ళీ ఆ పఠాన్గాడిని కూడా బయటికి రప్పించటం దేనికి?' మళ్ళీ అడిగాడు పంతులుగారు.

'పఠాన్ని పట్టించటం, మళ్ళీ వదిలి పెట్టించటం అంతా బాజిరెడ్డి బ్రెయిన్ మీద ఒత్తిడి పెంచ టానికి. వాడు అమ్మవారి ఆత్మశిల గురించి ఆలో చించకుండా చేయటానికి. ఇప్పుడు వాడి థాట్స్ అన్నీ ప్రణవమ్మను పఠాన్కి ఇచ్చి పెళ్ళిచేసి ఎస్టేట్ వ్యవహారాలన్నిటినీ తన పిడికిలిలోకి పూర్తిగా తెచ్చుకోవటం మీదే కేంద్రీకరించి ఉంటాయి. వాడు ఆ కన్ఫ్యూజన్లో ఉండగానే మనం ముందు ఆ తల్లికి జరిగిన అపచారాన్ని సరిచేయాలి. అప్పుడు ఒక ప్రాబ్లమ్ సరి అయిపోతుంది' అన్నాడు వెట్టి.

'ఈలోపల వాడు వచ్చి ప్రణవమ్మ మెళ్ళో తాడు కట్టేస్తే?' ఇంకోసారి రెట్టించాడు పంతులుగారు.

'కట్టేయటానికి వాడికి చేతులు సహకరించాలి. మంచి టైమ్ చూసుకుని ముందు వాడి చేతులు విరిచేస్తాను' కటువైన కంఠంతో చెప్పాడు వెట్టి.

'ఏమిటో అబ్బయ్యా.. ఏం చేస్తావో ఎలా చేస్తావో, నాకైతే ఏమీ అర్థం కావటం లేదు. వంద మందికి పైగా ఉన్నారు బాజిరెడ్డి జనం. వాళ్ళందర్నీ దాటుకుని నువ్వు పఠాన్ చేతులు విరిచేయటం



అంటే మాటలు కాదు..' నీరసంగా చెబుతూ, తల తిప్పి ముఖద్వారం వైపు చూశాడు పంతులుగారు.

'పంతులుగారూ... విఠల్‌బాబును రమ్మనండి. అమ్మగారు పిలుస్తున్నారు' ఆయాసం వచ్చింది కాబోలు, వగరుస్తూ చెప్పింది లోపలికి వచ్చిన ప్రత్యూష.

చటుక్కున సోఫాలో నుంచి లేచారిద్దరూ. తాను కాలుస్తున్న సిగరెట్ వైపు ఆమె అసహ్యంగా చూసే సరికి, కిందకి వదిలి కాలి మడమతో నలిపేశాడు వెట్టి. 'నువ్వు పద తల్లీ.. మేము వస్తున్నాము' అంటూ ఆమె వెనుకే బయలుదేరాడు పంతులుగారు.

***

'బాగా డిస్టర్బ్ అయ్యాడు... ఎంత ప్రయత్నం చేసినా సెటిల్ అవటం లేదు' శివారెడ్డి గదిలోకి వచ్చిన వెట్టికి చెప్పాడు డాక్టరు.

అదే సమయంలో మ్రోతలు చేస్తూ వచ్చి బిల్డింగ్ ముందు ఆగింది పెద్ద డాక్టరుగారి కారు. స్టెత్‌ని తీసి చేతిలో పట్టుకుంటూ పెద్ద పెద్ద అడుగులతో లోపలికి వచ్చాడాయన.

'వచ్చావా? వెరీగుడ్.. నువ్వు దగ్గర ఉంటే శివారెడ్డి సారుకు ఏమీకాదని నాకు నమ్మకం' అంటూ వెట్టికి చెప్పి, బెడ్‌మీది శివారెడ్డిని చాలా క్లోజ్‌గా పరీక్షించి చూశాడు.

'హార్ట్ నార్మల్... ఇంటర్నల్ ఆర్గాన్స్ నార్మల్... ప్రాబ్లమ్ అంతా మనసులోనే ఉంది' అంటూ వెట్టి వైపు తిరిగి, 'అదేమిటో తెలుసుకోగలిగింది నువ్వే! ప్రయత్నం చెయ్యి' అన్నాడు.

'సారూ... మీరందరూ కాస్తంత బయటికి నడవండి' రిక్వెస్ట్ చేశాడు వెట్టి.

ఒకరి వెనుక ఒకరుగా బయటికి పోయారు అందరూ.

శివారెడ్డి బెడ్ దగ్గర మొగడించి కూర్చున్నాడు వెట్టి 'నాకు తెలిసి కోట్లకు కోట్లు అప్పులు ఇవ్వగల వాళ్ళు కడపలో ఒకరిద్దరి కంటే ఎక్కువమంది లేరు' వాళ్ళు కూడా మనుష్యులే. రాక్షసులు కాదు. రాక్షసుల మాదిరి వచ్చి మనల్ని నడివీధిలోకి నెట్టే అధికారాలు వాళ్ళకి లేవు. మీరు ఎందుకు అనవసరంగా కంగారు పడుతున్నారో నాకయితే అర్థం కావటం లేదు' చిన్న కంఠంతో మృదువుగా అన్నాడు.

'పరువు వెట్టీ.. మన పరువు మట్టికొట్టుకు పోతుంది. శివారెడ్డి ఎస్టేట్ మీదికి వచ్చి శివారెడ్డినే బయటికి పంపించేవాళ్ళు ఉన్నారని తెలిస్తే జనం మన గురించి ఏమని అనుకుంటారో..' అస్పష్టంగా అన్నాడు శివారెడ్డి.

'ఆ ఫైనాన్షియర్ ఎవరు?' అడిగాడు వెట్టి.

'అతను హైమారెడ్డి. నాకు తెలియకుండా అంత పెద్ద మొత్తాన్ని బాజిరెడ్డికి ఎలా ఇచ్చాడో, ఎందుకు ఇచ్చాడో అర్థం కావడం లేదు' చెప్పాడు శివారెడ్డి.

తన వెనుక ఎవరో నిలబడి పిడికిలితో చాచి పెట్టి వెన్నుమీద కొట్టినట్టు అదిరిపడి, అంతలోనే సర్దుకున్నాడు వెట్టి.

***

సాయంత్రం నాలుగు గంటల సమయంలో తన రెసిడెన్స్‌కి చేరుకున్నాడు బాజిరెడ్డి.

## హంసానందిని వెనక ఉన్నది ఎవరు?

ఐటెంసాంగ్స్‌తో అభిమానులతో డ్యాన్సులు చేయించే హంసానందినికి నిన్న మొన్నటి వరకూ పెద్దగా అవకాశాలు వచ్చేవి కావు. కానీ ఉన్నట్టుండి స్టార్ హీరో సినిమాల్లో చేయడానికి సంతకాలు చేసేస్తోంది. హంస స్పీడు వెనుక ఒక ప్రొడక్షన్ మేనేజర్ ఉన్నాడంటున్నారు. అతగాడే హంస సినిమాలకి సంబంధించి డేట్లు, ఆర్థిక విషయాలు చూసుకుంటున్నాడట! ఆ వ్యక్తే స్టార్ హీరోల సినిమాల్లో హంసకు ఛాన్స్ వచ్చేట్టు పావులు కదుపుతున్నాడని అంటున్నారు. కాకపోతే ఆ వ్యక్తి ఎవరు? అన్న వివరాలు మాత్రం బయటకు రావడం లేదు.



'ఇక్కడ టైమ్ వేస్ట్ చేయటం అనవసరం. ముందు శివారెడ్డి దగ్గరికి పోయి వద్దాము' అన్నాడు మొదట, కారులోనుంచి కాలుకింద పెట్టగానే.

'సారూ... తొందరపడకండి. సంపంగి ఇందాక ఫోను చేసినప్పుడు తర్వాత తానే చేస్తానని చెప్పింది. అక్కడ ఏం జరుగుతోందో తెలియకుండా వెళ్ళకూడదు' అన్నాడు డ్రైవర్.

తన మాటకు ఎదురు చెప్పినందుకు కోపంతో నల్లబడిపోయింది బాజిరెడ్డి ముఖం. 'అది చేసేదాకా ఆగటమేంటిరా? నువ్వే చెయ్' అంటూ గద్దించాడు.

స్టీరింగ్ ముందు నుంచి దిగి, సంపంగికి రింగ్ ఇచ్చాడు డ్రైవర్. రెండు నిమిషాల పాటు శ్రద్ధగా విని, ఫోన్ పెట్టేశాడు.

'ఏంటిరా? ఏంటా ఏడుపు మొఖం? ఏమైంది?' విసురుగా అడిగాడు బాజిరెడ్డి.

'రోజుకి మూడుసార్లు ఫోనుచేసి బెదిరిస్తున్నారని చెప్పి, మీరు మీ ఫోన్ నంబర్ మార్చుకుని తిరుగుతున్నారు. కడప నుంచి సరాసరి శివారెడ్డికే వచ్చిందట ఫోను. శివారెడ్డి మళ్ళీ కళ్ళు తేలవేశాట్ట. అంతా గందరగోళంగా ఉందిట..' రిపోర్టు చేశాడు డ్రైవర్.

ఒక్కక్షణం పాటు కళ తప్పింది బాజిరెడ్డి ముఖం. అంతలోనే తమాయించుకున్నాడు. 'నేను తప్పించుకోవటం ఏమిటి? వాడు ఏం మాట్లాడాడు శివారెడ్డితో?' అని అడిగాడు.

'వివరాలు తనకు వినబడలేదని చెపుతోంది సారూ. పోనీ నేను వెళ్ళి చూసి రానా?' అడిగాడు డ్రైవర్.

రెండు క్షణాలు ఆలోచించి తల అడ్డం తిప్పాడు బాజిరెడ్డి. గట్టిగా నిట్టూర్చి వెహికల్ నుంచి కిందకి దిగాడు.

'ఆ కడప గ్యాంగ్ మన జోలికి రాకముందే పెళ్ళి జరిపించేయవచ్చనీ, శివారెడ్డిని పక్కకు నెట్టి ఏదో ఒక విధంగా మేనేజ్ చేయవచ్చనీ అనుకున్నాను. ఇప్పుడు ఆ ఆలోచన తారుమారు అయిపోయింది' తనలో తను అనుకుంటున్నట్టు పైకే అన్నాడు.

'అయితే మరి పెళ్ళి జరగదా సారూ?' ఆశ్చర్యంగా అడిగాడు డ్రైవర్.

పెళ్ళి పెళ్ళే... అది ఆగదు. ఆ మట్టి ముఖం సన్నాసిని నిలబెట్టి నరుకుడు నరుకుడే. అది కూడా ఆగదు. ఈ కడప హైమారెడ్డిని ఆపటం ఎలాగో ఆలోచించాలి' అన్నాడు బాజిరెడ్డి.

'మరి ఇప్పుడు ఏం చేద్దాం?' అడిగాడు డ్రైవర్.

'ఇప్పటికిప్పుడు పోయి పెళ్ళి జరిపించమంటే బాగోకపోవచ్చు. ముందుగా ఆ మట్టి ముఖం చవట సన్నాసిని ఈ లోకంలోనుంచి తప్పించేయాలి' అన్నాడు బాజిరెడ్డి.

'అయితే నేను అక్కడికిపోయి సంపంగితో మాట్లాడి, వాడిని సరైన సమయంలో రోడ్డు మీదికి పంపించే ఏర్పాట్లు చేయిస్తాను. ఆ తర్వాత మీరు అక్కడికి రావచ్చు' అన్నాడు డ్రైవర్.

'నేను కూడా వెళ్ళనా?' అడిగాడు అప్పటివరకూ మౌనంగా ఉన్న పఠాన్.

తడుముకోలేదు బాజిరెడ్డి, తల అడ్డం తిప్పటానికి. 'మట్టి కొట్టుకుపోయి ఉంది నీ అవతారం. నువ్వు ఇప్పటికిప్పుడు ఆ పిచ్చిదానికి కనిపిస్తే కోళ్ళు కొక్కిరాయిలు చంపుకు తినేవాడివని వెక్కిరిస్తుంది. తర్వాత పోవచ్చు. పోయి రెస్ట్ తీసుకో' అన్నాడు.

అయిష్టంగానే తల ఊపి బిల్డింగ్‌లోకి వెళ్ళిపోయాడు పఠాన్.

ఆవరణలోనే ఉన్న తన టూ వీలర్‌ని తీసుకుని

ఎస్టేట్ వైపు బయలుదేరాడు డ్రైవర్.

***

'నేను ఉన్నాను కదా సారూ. నేను చూసుకుంటాను. ఆ కడప వాళ్ళతో నేను మాట్లాడతాను. మీరు వర్రీ అవ్వాల్సిన అవసరం లేదు' శివారెడ్డికి చెప్పాడు వెట్టి నమ్మకంగా.

'ఎలా వెట్టీ? ఎలా చూసుకుంటావు? ఒకటికాదు రెండుకాదు నూట ఎనభై పైన.. కోట్లు. వందలు వేలు కాదు. మన భూములన్నిటినీ వేలం వేసినా ఇప్పటికిప్పుడు అంత ఎమౌంట్ రాదు' నిరాశగా అన్నాడు శివారెడ్డి.

'ఏమిటి సారూ... చిన్నపిల్లాడి మాదిరి అలా అధైర్యపడి పోవటం ఏమీ బాగోలేదు. నాకు తెలిసి మీ ఆస్తుల విలువ ఆ మొత్తం కంటే పదింతలు ఎక్కువే ఉంటుంది. వాళ్ళతో నేను మాట్లాడతానని అంటున్నాను కదా... మీరు రిలాక్స్ అవండి' మరింత నమ్మకంగా చెప్పాడు వెట్టి.

'నీ మాటలు వింటారా వాళ్ళు?' అడిగాడు శివారెడ్డి.

'చూడండి సారూ... మీకు ఆరోగ్యం బాగోలేక ఆ బాజిరెడ్డికి పవర్ ఆఫ్ అటార్నీ ఇచ్చారు. ఇప్పుడు మీరు కోలుకుంటున్నారు. ఇంకా కొన్నిరోజుల్లో మీ పనులు మీరు చక్కబెట్టుకో బోతున్నారు. ఆ మాట చెపుదాము. టైము అడుగుదాము. ఒప్పుకోక ఏం చేస్తారు వాళ్ళు?' అడిగాడు వెట్టి.

'ఎంత ఒప్పుకున్నా మనం చెల్లు వేయవలసిన మొత్తం అలాగే ఉంటుంది కదూ. ఆ బాజిరెడ్డి ఈ లోపల ఇంకో మతలబు ఏదైనా చేస్తే?' అడిగాడు శివారెడ్డి.

'మతలబులు చేసే టైము ఇంక వాడికి దొరకదు సారూ. మీరు నిశ్చింతగా ఉండండి. నేను చూసుకుంటాను' అన్నాడు వెట్టి.

తెల్లగా పాలిపోయినట్టు కనిపిస్తున్న శివారెడ్డి ముఖంలోకి కాస్తంత కలర్ ప్రవేశించింది. అతని మానసిక అలజడిని సూచిస్తున్న ఎలక్ట్రానిక్ పరికరం కామ్ అయిపోయింది.

సంతోషంగా చిన్న విజిల్ వేశాడు దూరంగా కూర్చుని ఉన్న పెద్ద డాక్టరు.




'నాకు తెలుసు. ఈ యంగ్‌మ్యాన్ దగ్గర ఉండగా మీకు ఎటువంటి ప్రాబ్లం రాదు. మీరు అనవసరంగా ఎగ్జయిట్ కావద్దు. మీకు ఎటువంటి సమస్య వచ్చినా ముందు ఇతన్ని పిలిపించి దగ్గర కూర్చోబెట్టుకోండి' అంటూ శివారెడ్డికి నమస్కారం చేసి బయటకిపోయాడు.

ఆందోళన నిండిన ముఖంతో అవతలి గదిలో వెయిట్ చేస్తోంది శివారెడ్డి భార్య.

'లోపలికి పోయి మాట్లాడండి తల్లీ.. ఎవ్రీథింగ్ ఈజ్ క్వయిట్ ఆల్‌రైట్' నవ్వుతూ చెప్పి, ఆమె సమాధానం కోసం ఎదురు చూడకుండా వెళ్ళిపోయాడు ఆయన.

మూడే మూడు అంగల్లో శివారెడ్డి దగ్గరికి పోయింది ఆమె.

'ఆకలిగా ఉంది రాజీ.. అన్నం తినవచ్చని డాక్టరు గారు చెప్పారు కదా? ఏది? అడిగాడు హాయిగా దిండును ఆనుకుని కూర్చున్న శివారెడ్డి. మళ్ళీ ఉబికి రాబోతున్న కన్నీటిని అతి బలవంతంగా అదుముకుంటూ వెనుతిరిగి కిచెన్‌లోకి పరిగెత్తింది ఆమె.

సంపంగి కనిపించలేదు. 'ఇప్పుడే బయటికి పోయింది తల్లీ.. ఇప్పుడే' చెప్పింది ఒక సర్వెంట్.

చర్రుమంటూ దూసుకు రాబోయిన కోపాన్ని బలవంతంగా అదుముకుంది శివారెడ్డి భార్య. అంతకు ముందు తాను చెప్పినట్టుగా తయారు చేయబడిన వంటను ఒక ప్లేటులో సర్దుకుని శివారెడ్డి దగ్గరికి పోయింది.

ఏదో జోక్ వేసినట్టున్నాడు అక్కడే కూర్చుని ఉన్న వెట్టి. శివారెడ్డితో పాటు డాక్టరు, డ్యూటీ నర్సు కూడా పగలబడి నవ్వుతున్నారు.

'మీరు అన్నం తినండి సారూ. నేను అమ్మగారితో మాట్లాడి వస్తాను' అంటూ పైకి లేవబోతున్న వెట్టిని ఆపటానికి ప్రయత్నించింది శివారెడ్డి భార్య.

'కూర్చో... నువ్వు కూర్చోవచ్చు. అసలు నువ్వే తినిపించాలి ఈయన గారికి' అన్నది.

'భలే చెప్పారు తల్లీ... అది మీ డ్యూటీ. నాది కాదు. నా డ్యూటీ వట్టి కబుర్లు చెప్పటమే' అంటూ గుమ్మం దగ్గరికి పోయాడు వెట్టి.

'మర్చిపోకు వెట్టీ.. వాళ్ళని కాంటాక్ట్ చేయడం' గుర్తు చేశాడు శివారెడ్డి.

వెనక్కి వచ్చి, అతని బెడ్‌మీదనే ఉన్న ఫోన్ అందుకుని, అందులో కనిపించిన నంబర్ మననం చేసుకుంటూ బయటికి వెళ్ళిపోయాడు వెట్టి.

***

చింతలపల్లి మెయిన్‌రోడ్డు మీద ఉన్న జనం చూశారు పరుగుపందెంలో పాల్గొంటున్నట్లు వేగంగా వస్తున్న పిచ్చిపూజారిని.

'అయ్యగారూ... ఏంటి ఈ పరిగెత్తటం? ఏమయింది?' అతని సంగతి తెలిసి కూడా అడ్డంగా నిలబడి అడిగాడు ఒక పౌరుడు.

'తప్పుకోరా భడవకానా... నా దారికి అడ్డం తప్పుకో' అంతకు ముందు మాదిరిగా అరిచి కేకలు పెట్టలేదు పూజారి. చనువుగా ప్రేమగా మందలించాడు.

అడ్డం నిలబడిన పౌరుడికే కాదు అందరికీ అర్థం అయిపోయింది, ఆయనలో ఏదో మార్పు వచ్చిన సంగతి.

'కూర్చోండి సామి. కాస్సేపు కూర్చోండి. కావాలంటే కాసిని మజ్జిగ దాహం పుచ్చుకోండి. అవసరం అయితే ఎవరో ఒకరు మిమ్మల్ని బండి ఎక్కించుకుని తీసుకుపోలేరా' మర్యాదగా చెప్పాడు ఇంకో పౌరుడు.

'నిజమేరా.. వయసు పెద్దది అయిపోవటం వల్ల ఇదివరకు మాదిరిగా పరిగెత్తలేకపోతున్నాను. రాయుడిపల్లి పోవాలిరా. చీకటి పడకుండా పోవాలి' మెయిన్‌రోడ్డు పక్కనే ఉన్న ఒక సిమెంట్ బెంచి మీద కూర్చుంటూ చెప్పాడు ఆయన.

పక్కనే ఉన్న కుప్పలోనుంచి ఒక కలర్ సోడాని తెచ్చి ఆయనకి అందించాడు ఆ పౌరుడు. 'అరేయ్.. ఎవరైనా అయ్యగారిని రాయుడిపల్లి తీసుకుపోయి దిగబెట్టండి' అన్నాడు గుమికూడిన వారితో.

'రాయుడిపల్లి రవీంద్రన్న ఇందాక రెండు గంటలకి నంద్యాల నించి తిరిగి వచ్చాడు. ఆయన బిడ్డకు సంబంధం కుదిరింది. ముహూర్తాలు పెట్టుకోవటం ఒక్కటే మిగిలిందట' విషయం తెలిసిన ఇంకో పౌరుడు వెంటనే చెప్పాడు.

అతను చెపుతూ ఉండగానే, డబడబమని మ్రోతలు చేస్తూ దూసుకు వస్తున్న బుల్లెట్ బండి కనిపించింది వారందరికీ.

'అదుగో... రవీంద్రన్న బావమరిది' అన్నాడు మరో పౌరుడు.

మెయిన్‌రోడ్డు మీది నించి ఒక చిన్న వీధిలోకి మరలబోతున్న ఆ బండి ఉన్నట్లుండి సూటిగా ముందుకే వచ్చి ఆ గుంపు దగ్గర ఆగింది.

'ఏంటి, అందరూ ఇక్కడ? ఏం జరిగింది?' అని అడుగుతూ సిమెంట్ బెంచి మీద పిచ్చిపూజారిని చూసి నవ్వేశాడు ఆ యువకుడు.

'మా బావయ్య మీ దగ్గరికే పోయి రమ్మని చెప్పాడు. నా అదృష్టం బాగుంది. మీరు కనిపించారు. రండి.. రండి బండెక్కండి' అని పిలిచాడు.

'నా తల్లికి నా మీద ఎంత అభిమానమో.. నడవలేకపోతున్నానని చెప్పి బండి పంపించింది' అంటూ సిమెంట్ బెంచి మీది నించి లేచాడు పిచ్చిపూజారి.

***(ఇంకావుంది)***

# జన్మపత్రిక


రమేశ్చంద్ర మహర్షి
సెల్ : 92 46 58 22 55
040-65 22 55 54
rameschandramaharishi.com




భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం అనే పంచ భూతాలూ, అహంకారం, బుద్ధి, ప్రకృతి, పంచ జ్ఞానేంద్రియాలు, మనసూ అనే పదకొండు ఇంద్రియాలూ, శబ్ద, రూప, స్పర్శ, రసగంధాలనే ఇంద్రియ విషయాలూ కోరిక, ద్వేషం, తెలివి, సుఖం, దుఃఖం, ధైర్యం... వీటి వికారాలూ కలిసి ఏర్పడే క్షేత్రం... మనిషి! ఆ మనిషికి భవిష్యత్తనే దారి చూపే నేత్రం, జ్యోతిశ్శాస్త్రం!!

★ ★ ★

ఎన్ని శతాబ్దాలు గడిచినా మనిషి ఒక కొలిక్కి రాలేని విషయం..

Life is more by accident than design... నిజమా

లేక life is more by design than accident నిజమా ... అన్నది.

గోడ మీద నుండి పతనం కావడం భవిష్యత్తు అని నిర్ధారించబడి ఉంటే "పడడం" accident! "దూకడం" design! భవిష్యత్ ముందే తెలిస్తే పడడాన్ని దూకడంగా మలచుకోవచ్చు.

కృతే కార్యే కింముహూర్త ప్రశ్నేన? పని ముగిసిన పిదప ముహూర్తమడగడం, జరగకూడనిది జరిగిపోయాక పరిహారాలు పాటించడం వలన ఏమిటి ప్రయోజనం?

భవిష్యత్ ముందే తెలిస్తే ముప్పు నుండి తప్పించుకోవడం లేదా తగ్గించుకోవడం సాధ్యమే!

కాలః క్రీడతి గచ్ఛత్యాయుః

కాలం ఆడుకుంటూ ఉంటుంది. ఆయువు గతించిపోతూ ఉంటుంది. రాబోయే మంచి చెడులు తెలిస్తే ఉన్నంతలోనే ఉన్నతంగా జీవించగలుగుతాం!

వయం భగవంతః స్యామ!

| | | | |
|---|---|---|---|
| గు రా | కు | | |
| (బు) / ర | రాశి | | చం |
| శు | | | |
| | శ | | కే |

| | | | |
|---|---|---|---|
| రా | కు | | |
| గు / ర | భావ | | చం |
| బు శు | | | |
| | శ | | కే |

| | | | |
|---|---|---|---|
| శ | | / శు | ర కే |
| | నవాంశ | | |
| | | | |
| రా చం | బు | | గు కు |

❖ ఈ జన్మకుండలి ప్రకారం

1) శుక్ర శనుల వలన ఈ జాతకుడు ఆఖరి సంతానం.

2) స్థానం మీద, అధిపతి మీద శని వీక్షణ. కారకునికి రవి సామీప్యం, బుధునికి ఒక వయిపు శుక్రుడు, మరో వయిపు రవి గురులు వంటి కాంబినేషన్స్ వలన విద్య ఇంజినీరింగ్.

3) తండ్రి స్వతస్సిద్ధంగా యోగ జాతకుడు. ఇతడు పుట్టాక సామాజికంగా పేరు ప్రతిష్ఠలు పెరుగుతాయి. అయితే ఈ జాతకుని 13వ సంవత్సరంలో తండ్రి ఉద్యోగం మాని వ్యాపారం ప్రారంభించి ఇతని 23 వరకూ దానిలో చాలా ఇబ్బందులు పడడం జరుగుతుంది.

ఇక అప్పటి నుండి... అంటే శుక్ర దశ ప్రారంభం నుండి ఇతని తండ్రి వృద్ధి పొందడం ఉంటుంది.

4) తల్లి ప్రభుత్వోద్యోగి.

5) ఒక అక్క ఉంటుంది. ఆమె మంచి జాతకురాలే కానీ ఆమె పేరు మీద స్థిరాస్తులు పెట్టకూడదు. అలా పెట్టి ఆ ఆస్తి లిటిగేషన్‌లో పడి ధన నష్టం కలిగేది శుక్రునిలో బృహస్పతి అంతర్దశలో... అంటే ఈ జాతకుని 33 వయసులో.

6) ఇతని 23 నుండి 43 వయసు మధ్య నడిచే శుక్ర దశ అడగక పోయినా విదేశ నివాసాన్నిస్తుంది. మంచి ఉద్యోగాన్నిస్తుంది. అయితే... తృష్ణా గరీయసి!

ఆశ... ఉద్యోగం కాదు, ఏదో వ్యాపారం చేయాలి అన్న ఆలోచనా దారుఢ్యం, భావ చాలనం.

మనం భోంచేస్తాం, మనల్ని ఆలోచన భోంచేస్తుంటుంది!

7) 43 నుండి 49.... 6 సంవత్సరాల పాటు నడిచే రవి దశ. గురు చండాల యోగంలో ఇమిడి ... హస్త పుట పానీయానీవ... అధిపతి అయి ధనాన్ని ఆవిరి చేసే పోర్ట్‌ఫోలియో కలిగి ఉన్న బృహస్పతి రవికి కంట్రోలింగ్ ఫేక్టర్. లగ్న స్థితి వలన నిక్షేపం లాంటి ఉద్యోగం మాని స్వదేశానికి వచ్చి సప్తమ ఆధిపత్య ప్రభావం వలన ఇక్కడ వ్యాపారం ప్రారంభించి, శుక్ర దశలో సంపాదించిన విత్తం మొత్తం పోగొట్టుకోవడం జరుగుతుంది. దీనంతటికీ మూల కారణం ఒకనాడు తన గురువుని అవమానించడం...

కాలోహి బలవత్తరః!

ఎవరు తప్పించుకోగలరు.

8) అయితే గత జన్మలో ఈ జాతకునికి స్త్రీల పట్ల ఉన్న గౌరవం, ఒక స్త్రీకి చేసిన ఉపకారం, ఒక శతృవు చేసిన అన్యాయాన్ని పెద్ద మనసు చేసుకుని క్షమించగలగడం... ఇక్కడ చంద్ర దశలో... అంటే 49 నుండి 59 వయసులో అక్కరకు రావడం జరుగుతుంది. దాని ఫలితం, I will show what I am made of అన్నట్టుగా చంద్ర దశలో తిరిగి విదేశాలకు పయనమవడం, అక్కడ జీవితాన్ని పునర్నిర్మించు కోవడం జరుగుతుంది. లగ్నాధిపతికి కంట్రోలింగ్ ఫేక్టర్స్ అయిన బుధ శుక్రుల వలన తదుపరి జీవితమంతా తన ప్రమేయం లేకుండానే అమేయమయి పోయే యోగంతో విదేశాల్లో భోగో భూషయతే ధనం... భోగాలనుభవించడం జరుగుతుంది. 59 నుండి నడిచే కుజ దశ విదేశాల్లో పెలాషియల్ బంగ్లా ఇస్తుంది. ఎప్పుడు కూడా ఈస్ట్ ఫేసింగ్ ఇల్లయితే ఫిజికల్ స్టామినా. అలాగే మెంటల్ స్టామినా. నార్త్ ఫేసింగ్ అయితే వృత్తిలో అసాధారణ ప్రతిభా పాటవాలు.

శక్తి యుక్తులు : జన్మ నుండి జన్మకు వలస పోయేది ఆత్మ! దానికి దశా నిర్దేశం చేసేది కర్మ! జీవితంలో విజయం సాధించిన వారి జీవిత చరిత్రలు పఠించాల్సిన పని లేదు. ఓడిపోయిన వారి జీవితాలు చదివితే చాలు. ఎందుకంటే మనం ప్రపంచాన్ని జయించాల్సిన పని లేదు, జీవితంలో ఓడిపోకుండా ఉంటే చాలు! అదే పది కోట్లు! దానికే ఇన్ని పాట్లు!! కానీ భావ్యస్య నాశః కుతః! దానికే పరిహారాలు!



# దూకుడుకు పగ్గాలు

**ముఖ్యమంత్రిగా పదవీ బాధ్యతలు చేపట్టిన తరువాత యోగి ఆదిత్యనాథ్ మతపరమైన దూకుడుకు కళ్లెం పడినట్లయింది.**

**ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రిగా యోగి ఆదిత్యనాథ్‌ను ఎందుకు ఎంపిక చేశారన్నది ఆశ్చర్యమే. హిందుత్వవాదులకు సైతం ఈ ఎంపిక మింగుడు పడడం లేదు. దూకుడుగా, ఘాటుగా ప్రకటనలు ఇచ్చే ఆదిత్యనాథ్ ఓ నాయకుడిగా వ్యవహరించగలరా అన్నది వాళ్ల సందేహం.**

హిందుత్వలో కూడా తీవ్రవాదిగా పేరుపడ్డ ఆదిత్యనాథ్ ఈ 'లౌకిక ప్రజాస్వామ్య' దేశంలో ముఖ్యమంత్రిగా సఫలం కాగలరా అన్నది ఆలోచించాల్సిన విషయం. 2014 లోక్‌సభ ఎన్నికల్లో బీజేపీ విజయం సాధించిన తరువాత నరేంద్ర మోదీ గురించి కూడా పలువురిలో ఇటువంటి సందేహాలే వ్యక్తమయ్యేవి. నరేంద్ర మోదీ హిందుత్వకు ప్రతినిధిగా వ్యవహరిస్తారు కదా? ఆయన నాయకత్వంలో భారత దేశం మునుపటిలా కొనసాగడం సాధ్యమా? మూడేళ్లయ్యేసరికి ఈ ప్రశ్నలన్నీ అదృశ్యమైపోయాయి. ఇప్పటికీ కొన్ని విషయాల్లో ఆయన మీద అనుమానాలు తొలగిపోలేదు కానీ, ప్రజలకు మాత్రం ఆయన పట్ల నమ్మకం అపారంగా పెరిగిపోయిన సూచనలు కనిపిస్తున్నాయి. పార్టీ ప్రచార సారథిగా ఆయన వాడే భాషకు, ప్రధానిగా వాడే భాషకు హస్తి మశకాంతరం తేడా కనిపిస్తుంది.

యోగి ఆదిత్యనాథ్ కూడా ఇదే పంథా అనుసరిస్తారేమో! ఆయన గత చరిత్ర చూస్తే నమ్మకమేమీ కలగదు కానీ, మనం ఆయన గురించి ముందే ఓ నిర్ణయానికి రావడం సమంజసం కాకపోవచ్చు. ఉత్తరప్రదేశ్‌లో బీజేపీకి వచ్చిన భారీ మెజారిటీని దృష్టిలో పెట్టుకుని ఆలోచిస్తే, ఈ పార్టీ ప్రత్యేకంగా హిందుత్వను చేపట్టాల్సిన అవసరం రాకపోవచ్చనిపిస్తోంది. హిందువుల ఏకీకరణ కారణంగానే బీజేపీకి ఇంత భారీ మెజారిటీ లభించిందని నిపుణుల అభిప్రాయం. యోగి ఆదిత్యనాథ్‌తో సహా పార్టీ అగ్ర నాయకులందరూ ఇదే భావనతోనే ఉన్నారు. మత సంబంధమైన విషయాలపై యోగి ఆదిత్యనాథ్ ప్రభుత్వం మరీ అతిగా దృష్టి కేంద్రీకరించడం ప్రారంభిస్తే ఈ ప్రభుత్వంపై జనానికి మొహం మొత్తిపోవడానికి ఎంతో కాలం పట్టకపోవచ్చు. అధిక సంఖ్యాక హిందువులు బీజేపీకి ఓటు వేసిన మాట నిజమే అయినప్పటికీ, కేవలం మత విషయాల కోసం వారు ఆ పార్టీకి ఓటు వేయలేదన్న సంగతి కూడా గుర్తుంచుకోవాలి. ప్రస్తుతం ఉత్తరప్రదేశ్ ప్రజానీకానికి, ముఖ్యంగా యువతకు కావాల్సింది ఉద్యోగాలు, అభివృద్ధి మాత్రమే. దీన్ని బట్టి ఆలోచిస్తే ఆదిత్యనాథ్ హయాంలో రాష్ట్రం హిందుత్వానికి ప్రాధాన్యం ఇచ్చేందుకు అవకాశం లేదు.

ఆయనను ముఖ్యమంత్రిగా ఎంపిక చేసుకోవడంతోనే బీజేపీకి భారీ మెజారిటీ కట్టబెట్టిన పరమార్థం నెరవేరినట్టయింది. నిజానికి ఆదిత్యనాథ్ కూడా అయిదు పర్యాయాలు పార్లమెంట్ సభ్యునిగా ఎన్నికైన వ్యక్తి. పార్టీలోని ఐదుగురు ప్రధాన ప్రచార సారథుల్లో ఆయన కూడా ఒకరు. ముఖ్యమంత్రి పదవికి ఆయన అర్హుడు కాదనుకుంటే అది ఆత్మవంచనే అవుతుంది. ప్రధాని పదవికి అర్హుడు కారని మోదీ గురించి కూడా కొందరు అనుకున్నారు. చివరికి, వారి అభిప్రాయం తప్పని తేలింది. ఆదిత్యనాథ్‌కు అంతగా జనాకర్షణ లేకపోవచ్చు కానీ, ఆయనను పూర్తిగా తిరస్కరించడం మాత్రం సరైనది కాదు. ఉత్తరప్రదేశ్ ఎన్నికల ప్రచారంలో కూడా బీజేపీ పూర్తిగా అభివృద్ధి మీదా, మతంతో సంబంధం లేని అంశాల మీదా దృష్టి కేంద్రీకరించింది. హిందూ ఓట్ల ఏకీకరణకు విరుద్ధంగానే ప్రచారం జరిపింది. అన్ని వర్గాల నుంచీ ఓట్లను ఆశించింది.

### మోదీ అడుగుజాడలు

తన భావాలు, నమ్మకాలు, సిద్ధాంతాల విషయంలో తామేమీ పశ్చాత్తాపపడడం గానీ, బాధపడడం గానీ జరగదని బీజేపీ తేల్చి చెప్పింది. ఉత్తరప్రదేశ్‌లో తమ పార్టీకి భారీ మెజారిటీ లభించడం తమ సిద్ధాంతాలకూ, భావాలకూ జనం ఆమోదం తెలిపినట్టుగానే తాము భావిస్తున్నామని కూడా అది స్పష్టం చేసింది. ఇతర పార్టీలు ఇక ఆయనను లక్ష్యంగా చేసుకోవడం వల్ల ప్రయోజనం లేదు. నరేంద్ర మోదీ మాదిరిగానే ఆదిత్యనాథ్ కూడా ప్రతిపక్షాలు, ప్రత్యర్థుల అభిప్రాయం తప్పు అని నిరూపించే అవకాశం ఉంది. ఎంపీగా ఉండగా యోగి ఆదిత్యనాథ్ ఓ అగ్గిబరాటాగా వ్యవహరించి ఉండొచ్చు. తన ప్రకటనల ద్వారా సంచలనాలు రేకెత్తించి ఉండొచ్చు. కానీ ఇప్పుడు ఆయన భారత దేశంలోనే అత్యంత ఎక్కువ జనాభా కలిగిన రాష్ట్రానికి ముఖ్యమంత్రి. ఉత్తరప్రదేశ్‌లో ఉన్నన్ని కుల, మత సమీకరణాలు మరే రాష్ట్రంలోనూ ఉండవు. ఇటువంటి రాష్ట్రంలో ఓ ముఖ్యమంత్రిగా ఆదిత్యనాథ్ ఎటువంటి సంచలన ప్రకటనలు చేసినా అది వ్యక్తిగతంగా ఆయనకూ, ఆయన పార్టీకీ తీరని




- రాజశుక

దెబ్బే అవుతుంది.

ఆసలు ఆయన దూకుడుకు కళ్లెం వేయడానికే ఆయనకు ముఖ్యమంత్రి పదవి అప్పగించినట్లుంది. ఆదిత్యనాథ్‌కు ఈ విషయంలో మోదీయే గురువు, మార్గదర్శకుడు. గుజరాత్ ముఖ్యమంత్రిగా ఉండగా మోదీ 'సబ్‌కా సాథ్ సబ్‌కా వికాస్' అనే నినాదం ప్రారంభించారు. అందరినీ కలుపుకుని ముందుకు వెడితేనే అభివృద్ధి సాధ్యం అన్న ఆ నినాదంతో ఆయన అటు హిందువులను, ఇటు మైనారిటీ వర్గాలను కలుపుకుని వెళ్లారు. గుజరాత్‌లో ఈ నినాదం ఆయనకు ఘన విజయాలు సాధించి పెట్టింది. కుల, మతాలకు అతీతంగా ఆయనకు, ఆయన పార్టీకి ప్రజలు ఓట్లు వేయడానికి కూడా ఇది తోడ్పడింది. మతానికి సంబంధించి వివాదాస్పద అంశాలకు పోకుండా ఆయన అటు గుజరాత్‌లోనూ, ఇటు కేంద్రంలోనూ సంయమనంతో వ్యవహరించారు. మోదీని అనుసరించడం తెలివైన పని అని ఆదిత్యనాథ్ కూడా గ్రహించి అదే విధంగా వ్యవహరించారు.

రాజకీయ నాయకులకే కాదు, మత, సాంస్కృతిక సంస్థలకు సైతం మోదీ ఓ ఉదాహరణగా నిలిచారు. రామజన్మభూమిపై ఆయన ఓ సిద్ధాంతపరమైన వైఖరి తీసుకుని, తనపై ఉన్న అనుమానాలను నివృత్తి చేశారు. రాజ్యాంగం పరిధిలోనే రామమందిర నిర్మాణం జరుగుతుందని ఆయన తేల్చి చెప్పి, మత కలహాలకు అవకాశం లేకుండా చేశారు. త్వరలో సుప్రీం కోర్టు ఈ రామజన్మ భూమి వివాదాన్ని పరిష్కరిస్తుంది. ఇందులో సందేహం లేదు. అంతవరకూ ఈ వివాదాస్పద అంశం ప్రమాద స్థాయికి చేరుకోకూడదు. తమ పార్టీ ఇంతవరకూ సంపాదించుకున్న సుహృద్భావాన్ని చేజార్చుకోవడానికి మోదీ గానీ, ఆదిత్యనాథ్ గానీ సిద్ధంగా లేరు. ఆదిత్యనాథ్ ఈ విషయంలో తొందరపడే అవకాశం లేదు. అధికారమనేది ఓ నియంతను విశృంఖలంగా మార్చవచ్చు కానీ, ప్రజాస్వామ్యంలో అది ఎవరినైనా వినమ్రుడిగా మార్చేస్తుంది.

ముఖ్యమంత్రి నియంతగా ఉండడం సాధ్యం కాదు. ఒకవేళ ఆయన నియంతృత్వ పోకడ అనుసరిస్తే ప్రతిపక్షం అడ్డుకుంటుంది. ఆ తర్వాత పార్టీలోని ప్రత్యర్థి అధికార కేంద్రాలే చక్రాలు అడ్డువేస్తాయి. అప్పటికీ తన ధోరణిలో తాను వ్యవహరిస్తే, వచ్చే ఎన్నికల్లో ప్రజలే తమ ఓటు ద్వారా తొలగించేస్తారు. బీజేపీకి, దాని నాయకులకు ఈ సంగతి బాగా తెలుసు. ప్రతి పార్టీకి ఇది అనుభవంలోకి వస్తూనే ఉంటుంది. 2004 ఎన్నికల్లో బీజేపీ ఎన్నికల ప్రచారంలో భారత్ మెరిసిపోతోంది అనే నినాదాన్ని చేపట్టింది. మొదట్లో ఈ నినాదం అందరినీ ఆకట్టుకుంది. కానీ, రోజులు గడిచే కొద్దీ దీన్లో అందరికీ అహంకారమే కనిపించింది. పేదలు ఆగ్రహావేశాలతో ఊగిపోయారు. ప్రజాస్వామ్య వ్యవస్థలో ముఖ్యంగా లౌకికవాద దేశంలో అన్ని మతాలను, అన్ని కులాలను కలుపుకుని పోవడం తప్ప గత్యంతరం లేదు.

### సామాజిక సంక్షేమం

పేదల అభ్యున్నతే పరమావధిగా ఇందిరా గాంధీ రెండు దశాబ్దాల పాటు దేశాన్ని పాలించారు. మోదీ కూడా పేదల సంక్షేమం కోసమే పోరాడుతున్నారు. వారికి తాయిలాలు పంచిపెట్టడానికి బదులుగా వారు ఆర్థికంగా అభివృద్ధి సాధించడానికి పథకాలు రూపొందిస్తున్నారు. ఆదిత్యనాథ్ కూడా ఈ విషయంలో మోదీని అనుసరించడం తప్ప మార్గం లేదు. ఇష్టారాజ్యంగా వ్యవహరించడానికి ఇక్కడ అవకాశమే లేదు. ఎంత అణగిమణిగి ఉంటే ఆయనకు, ఆయన పార్టీకి అంత మంచిది. అధికారానికి వచ్చిన వారం రోజుల్లోనే ఆదిత్యనాథ్ సుమారు యాభై నిర్ణయాలు తీసుకున్నారు. అవి రాజకీయంగా, సామాజికంగా కొద్దిపాటి సంచలనాలు సృష్టించాయి. ముఖ్యంగా మంత్రులందరూ 15 రోజుల్లో తమ ఆస్తుల వివరాలు ప్రకటించాలని ఆయన అధికారంలోకి వచ్చీ రాగానే ఆదేశించడం రాజకీయంగా సంచలనాత్మక నిర్ణయమే.

ఆ తరువాత ఆయన అక్రమ కబేళాలను మూసేయాలని ఆదేశించారు. నిజానికి అక్రమ కబేళాలను మూసేయాలని జాతీయ హరిత ట్రైబ్యునల్ రెండేళ్ల క్రితం నుంచీ ఆదేశిస్తోంది. ఈ నిర్ణయం వల్ల రాష్ట్రంలోని అనేక రెస్టారెంట్లు, షాపులకు గొడ్డు మాంసం సరఫరా ఆగిపోయింది. ఈ నిర్ణయంతో కాన్పూర్ జంతు ప్రదర్శనశాలలోని జంతువులకు కూడా సరఫరా ఆగిపోయిందని, దాని వల్ల జంతువులు నానా ఇబ్బందులూ పడుతున్నాయని ఇప్పటికే పత్రికలు రాశాయి. క్రయ విక్రయాలు నిలిచిపోవడంతో మాంసం విక్రయ దారులు సమ్మెకు దిగారు. బాలికలు, మహిళలపై లైంగిక వేధింపులకు అడ్డుకట్టవేయడానికి రౌడీ వ్యతిరేక దళాలను (యాంటీ రోమియో స్క్వాడ్) ఏర్పాటు చేయాలని ఆయన ఆదేశించారు. ఇందుకు సంబంధించి వెంటనే మార్గదర్శకాలు రూపొందించాలని అధికారులకు ఉత్తర్వులు జారీ చేశారు. ఎన్నికల ప్రచారంలో ఆదిత్యనాథ్ ఈ అంశం గురించి పదే పదే ప్రస్తావించారు.

ఆయన స్వచ్ఛభారత్‌కు కూడా అత్యంత ప్రాధాన్యం ఇస్తున్నారు. ప్రభుత్వ కార్యాలయాలు, కళాశాలలు, పాఠశాలల్లో పాన్, పొగాకు వంటి వాటి వినియోగం నిషేధిస్తూ ఆయన ఆదేశాలు జారీ చేశారు. రోడ్లపై వాహనదారులు ఎంతో అవసరమైతే తప్ప సైరన్లు ఉపయోగించరాదని కూడా ఆయన ఆదేశించారు. శబ్ద కాలుష్యాన్ని తగ్గించాల్సిన బాధ్యత అధికారులదే అని స్పష్టం చేశారు. ఇటువంటి పలు రాజకీయ, సామాజిక చర్యలకు ఆయన శ్రీకారం చుట్టారు. వీటన్నిటినీ దృష్టిలో పెట్టుకుని ఆలోచిస్తే, ఆదిత్యనాథ్ రామమందిర నిర్మాణంవంటి మత సంబంధమైన అంశాలకు, అల్పసంఖ్యాక వర్గాలను వెలివేసే చర్యలకు ఏమాత్రం ప్రాధాన్యం ఇవ్వరని, ఆయన కూడా మోదీ మాదిరిగానే కులమతాలకు అతీతంగా అభివృద్ధి, సంక్షేమాలకు ప్రాధాన్యం ఇస్తారని అనిపిస్తోంది.



**యూపీ ముఖ్యమంత్రి పదవి ఆదిత్యనాథ్‌ను వరించడం హిందుత్వవాదులకు కూడా మింగుడుపడటం లేదు. వాళ్ళల్లోనూ ఎన్నో సందేహాలు! కానీ ఆ రాష్ట్ర ప్రజలకు, యువతకు ప్రస్తుతం కావాల్సింది ఉద్యోగాలు, అభివృద్ధి మాత్రమే. ఇప్పటికే యాభైకి పైగా సంచలన నిర్ణయాలు తీసుకున్న ఆదిత్యనాథ్ హిందుత్వానికి ప్రాధాన్యం ఇచ్చే అవకాశం లేదు అంటున్నారు రాజశుక. అదేమిటో మీరే చదవండి.**






పి. చంద్రశేఖర్ ఆజాద్

**రాత్రి పది గంటలు.**
**హాల్లో అయిదారుగురు మాట్లాడుకుంటున్నారు.**
**వికాస్‌ని ఏవేవో ప్రశ్నలు అడుగుతున్నారు. అతను జవాబులు చెబుతున్నాడు.**
**"ఎన్ని రోజులుంటున్నావు!" అన్నారెవరో.**

"రెండు వారాలుంటాను. ఈలోగా కలవాల్సిన బంధువులున్నారు. ముందు తిరుమల వెళ్ళిరావాలి" అన్నాడు వికాస్. అప్పుడే వచ్చిన వికాస్‌తల్లి భ్రమరాంబ" భోజనాలు ఏర్పాటు చేస్తాను" అనగానే అందరికీ సమయం గుర్తుకు వచ్చింది.

"లేదు లేదు. మేం బయలుదేరతాం" అన్నారు.

***

రాత్రి పన్నెండు గంటలు.

'విరజ' గదిలోకి అడుగుపెట్టింది. ఎలాంటి అలంకరణ లేదు. కనీసం తలలో పూలు పెట్టుకోలేదు. వికాస్ ఆమె దగ్గరికి నడిచి వచ్చాడు.

'నన్నేం చేయమంటావు. మాట్లాడుతున్న వారిని వెళ్ళిపొమ్మని ఎలా చెప్పను?' అంటూ ఆమె భుజం మీద చేతులువేసి దగ్గరకు లాక్కున్నాడు. విరజ మౌనంగా ఉండేసరికి, రేపటి నుండి పూర్తి సమయం నీకే కేటాయిస్తాను. ఐ లవ్‌యూ విరీ' అన్నాడు.

'మీతో ఓ ముఖ్య విషయం మాట్లాడాలి' అంది.

అతని భ్రుకుటి ముడిపడింది.

***

రఘు ఆ ఇంటిముందు ఆగాడు. లోపలికి వెళ్ళాలావద్దా అని కొద్దిక్షణాలు సంశయించాడు. తర్వాత తలుపు తీసుకుని లోపలకు వెళ్ళాడు. దబ్బ పండు ఛాయలో ఉన్న భ్రమరాంబ కనిపించింది.

"నమస్కారమండి. నా పేరు రఘు. జూనియర్ అసిస్టెంట్‌గా ఓ కార్పొరేషన్‌లో పని చేస్తున్నాను. టెలిగ్రామ్ ట్రాన్స్‌ఫర్ వచ్చింది. నాలుగురోజుల నుంచి ఇంటికోసం ప్రయత్నం చేస్తున్నాను. వెంటనే ఫ్యామిలీని తీసుకురావాలి. మాకోబాబు. మీ ఇంటి ముందు టు లెట్ బోర్డ్ లేదు. అయినా మీకు తెలిసిన వారి ఇల్లు ఉంటే చెబుతారని వచ్చాను. ఏమీ అనుకోకండి" ఆపకుండా చెప్పాడు.

భ్రమరాంబ అతన్ని ఆపాదమస్తకం పరిశీలించింది. ఎందుకో ఆమెకు రఘుమీద సదభిప్రాయం కలిగింది. ఎన్ని గదులు కావాలి, ఎంత అద్దెలో కావాలి లాంటి ప్రశ్నలు అడిగింది. తనకువచ్చే జీతం తక్కువని, కొత్తగా ఉద్యోగంలో చేరానని చెప్పాడు రఘు.

ఆమె కొంచెంసేపు ఆలోచించింది. 'ఇంటి వెనకాలకి రా బాబూ' అంది. చిన్నచిన్న పూలమొక్కలు దాటుకుని రఘు ఆ ఇంటి వెనక్కి వెళ్ళాడు. చిన్న షెడ్ లాంటిది కనిపించింది. దానిముందు తులసి కోట ఉంది చిన్నదిగా. భ్రమరాంబ తాళం చెవి

తీసుకువచ్చింది.

'అవసరంలేని వస్తువులు ఇందులోపెట్టాం. మాకు అద్దెకి ఇవ్వాలనిలేదు. నీకు సరిపోతుందేమో చూడు' అంది.

అదో హాలులా ఉంది. నాలుగువందల అడుగుల లోపు ఉంటుంది. వంట చేసుకోవటానికి కొంతస్థలం ఉంది. బయట బాత్‌రూమ్, టాయ్‌లెట్ కట్టించారు.

'సరిపోతుందండి. ఎక్కువ అద్దె నేను భరించ లేను' అన్నాడు.

'మాకు తోడుగా ఉంటారని ఇవ్వాలనుకున్నాను. మా వారికి ఆరోగ్యం బాగుండలేదు. మంచానికి పరిమితం అయ్యారు' అంది భ్రమరాంబ. ఆమెకు అరవై సంవత్సరాలు పైబడి ఉండవచ్చు.

'అద్దె ఎంత ఇవ్వమంటారో చెప్పండి' అన్నాడు రఘు.

'మీ శ్రీమతికి నచ్చుతుంతో లేదో?' అందామె.

'నచ్చుతుంది. ఇంతకుమించిన ఇంటిని నేను ప్రస్తుతం తీసుకోలేను'. ఆమె చెప్పిన మొత్తానికి అంగీకరించి అడ్వాన్స్ ఎన్నినెలలకి ఇవ్వమంటారు అన్నాడు. అలాంటిదేమీ వద్దనగానే ఆశ్చర్యపోయాడు రఘు.

'ఈ వస్తువులు ఇంట్లో సర్దిస్తాను. మీరు ఎప్పుడైనా రావచ్చు' అనగానే అప్రయత్నంగానే చేతులు జోడించి, రెండురోజుల్లో వస్తాం' అని వెనక్కి తిరిగాడు. గేటు దగ్గరికి వస్తుంటే ఓ స్త్రీ ఎదురైంది.

తెల్లటి తెలుపు. నల్లటికళ్ళు. సన్నగా లేదు. అలా అని లావుగానూ లేదు. ఆమె కురులు ముఖంమీద పడుతున్నాయి. ఆ చీరలో ఎంతో హుందాగా ఉంది. ఆమె రఘునిచూసి ముఖం చిట్లించింది. అందులోనూ వింత అందం ఉంది. రఘుకి ఏం మాట్లాడాలో తెలియటం లేదు. అప్పుడు వెనుకనుంచి మాటలు వినిపించాయి,

'మన ఇంటి వెనకషెడ్‌లోకి అద్దెకి వస్తున్నారు విరజా' అంటూ. అలాగా అన్నట్లు మనోహరంగా చిరునవ్వు నవ్వింది. రఘు నమస్కరించాడు. కాస్త చిత్రంగాచూసి తలపంకించి లోపలకు వెళ్ళింది.

**పెరటివైపు ఇల్లు. తక్కువ అద్దెలో దొరికింద తనికి. రేపే ఇంట్లోకి వచ్చేస్తాం అని చెప్పి వెళుతుంటే ఒక అందమైన స్త్రీ ఎదురైందతనికి. మిల్కీ బ్యూటీ అనుకున్నాడు. తర్వాత కొన్ని రోజులకు ఓ రాత్రి నిద్రపోతుండగా తలుపు తట్టిన శబ్దం. తలుపు తీశాడతను. ఎదురుగా ఆమె! ఆమె కళ్ళల్లో కాంక్ష! అకస్మాత్తుగా వచ్చి కౌగలించుకుందామె. అతడి పెదవులు ముద్దు పెట్టుకుంది. ఆ తర్వాత ఏం జరిగింది?**

'మిల్కీబ్యూటీ' అనుకోకుండా ఉండలేకపోయాడు రఘు.

***

రఘు తన కుటుంబాన్ని తీసుకువచ్చాడు. వారికి చిన్న బీరువా, సింగిల్‌కాట్ ఉన్నాయి. అవి రెండూ ఉంచాక పెద్ద ఖాళీలేదు. అయినా రమణికి ఆ పోర్షన్ నచ్చింది. ముందు అక్కడి మొక్కలకి సరైన పోషణ లేదు. రమణికి చిన్నప్పటినుంచి మొక్కలంటే ప్రాణం. అందుకే వచ్చిన నాలుగైదు రోజుల్లోగానే ఆ దొడ్డిని సరిచేసి కొత్త మొక్కలు నాటింది. వాళ్ల అబ్బాయి 'రాజా' పెరట్లో హాయిగా తిరుగుతున్నాడు.

భ్రమరాంబకి ఆ కుటుంబం బాగా నచ్చింది. రఘుకి సైకిల్ ఉంది. దానిమీద ఆఫీస్‌కి వెళ్ళాడు. ఆరోజు కనిపించిన 'విరజ' మళ్ళీ కనిపించలేదు. ఇంతకు ఆమె వారి అమ్మాయా? ఇంకెవరన్నానా అని అర్థం కాలేదు. ఉదయం, సాయంకాలం పని మనిషి వస్తుంది. పని పూర్తి చేసుకుని వెళ్ళిపోతుంది. ఇంట్లో ఇంకెవరూ కనిపించరు. భర్త పనులన్నీ భ్రమరాంబగారు చూసుకుంటారు. ఇల్లు నిశ్శబ్దంగా ఉంటుంది.

రమణి, భ్రమరాంబ మాట్లాడుకుంటారుతప్ప వాళ్ళింట్లోకి రమణి ఎప్పుడూ వెళ్ళలేదు. పదిరోజుల తర్వాత రఘు ఆఫీస్‌కి వెళ్తుంటే విరజ మెరుపులా దర్శనం ఇచ్చింది. మరుసటిరోజు తులసికోటచుట్టూ తిరుగుతూ కనిపించింది. ఇద్దరూ ఒకరినొకరు చూసుకున్నారు. ఆమె కళ్ళతో చిరునవ్వు నవ్వినట్లు అనిపించింది.

ఆ సాయంకాలం రమణి చెప్పింది.

"భ్రమరాంబగారి కోడలు. ఆమెపేరు విరజ. మన రాజాని దగ్గరకు తీసుకుని ఎన్ని ముద్దులు పెట్టారో!"

"భ్రమరాంబగారి అబ్బాయి కనిపించడు. ఏం ఉద్యోగం చేస్తున్నాడో?" అడిగాడు రఘు.

"తెలియదు. వారంతటవారు చెబితే ఫర్వాలేదు గానీ మనకి అనవసరం కదా వారి స్వంత విషయాలు" అంది రమణి.

"వాళ్ళనాన్నగారి ఆరోగ్యం బాగుండనప్పుడు పక్కన ఉంటే బాగుండును కదా అనుకున్నాను"

'వారికే సమస్యలు ఉన్నాయో?' అంది రమణి.

***

మూడు నెలలు గడిచిపోయాయి.

విరజ భర్త ఎప్పుడూ కనిపించలేదు. ఇంటిపని విరజ చూసుకుంటుంది. వెనుక తలుపుతీసి రమణిని కలుస్తుంది. రాజాని తీసుకువెళ్తుంది. వాడికి నాలుగు సంవత్సరాలు. రఘు ఆఫీస్‌నుండి వచ్చేటప్పటికి అప్పుడప్పుడు రమణితో మాట్లాడుతూ ఉంటుంది. అతన్ని చూడగానే చిరునవ్వుతో ఇంట్లోకి వెళ్ళిపోతుంది. ఆరోజు ఇంటికివచ్చాడు రఘు. రమణి లేదు. దగ్గర్లో కూరగాయల దుకాణం ఉంది. అటు వెళ్దామా అనుకుంటుంటే 'నాన్నా' అని పిలిచాడు రాజా. విరజ రాజాని ఎత్తుకుని ఉంది. 'ఇప్పుడే వస్తుంది మీ రమణి' అంది నవ్వుతూ. రఘు దగ్గరకు వెళ్తానని రాజా గొడవ చేస్తుంటే అందించింది. ఆమె చేతులు తగిలాయి. జివ్వుమంది రఘుకి. అలాంటి భావన ఇంతకుముందు కలగలేదు. ఆమె ముఖంలోకి చూడాలన్నా ధైర్యం చాలలేదు. అయినా రాజాని కిందకు దింపితే నడిచి వస్తాడు. ఇలా చేయటం ఎందుకు అనుకున్నాడు. వాణ్ణి తీసుకుని రమణికోసం బయటకు నడుస్తుంటే చిరునవ్వుతో చూస్తూ ఉండిపోయింది విరజ.

అకస్మాత్తుగా రమణి నాన్నకి ఆరోగ్యం బాగుండలేదని కబురు రావటంతో బయలుదేరి వెళ్ళింది. రాజాని అయిదు సంవత్సరాలు నిండాకే బడిలో చేర్చాలనుకున్నాడు. రఘుకి వంటవచ్చు. మిగతా అన్ని పనులూ చేసుకోగలడు.

'మీ వారికి ఏమన్నా కావాలంటే అడగమనండి' అని చెప్పింది విరజ.

'అంత అవసరం రాదులెండి' అంది రమణి. తాను వెళ్ళిన రెండోరోజున స్టవ్‌మీద కుక్కర్‌వుంచి వంకాయలు, ఉల్లిపాయలు తరగటానికి కూర్చున్నాడు. అప్పుడు గుమ్మం ముందు గాజులచప్పుడు వినిపిస్తే చూశాడు. గదిలో బల్బు వెలుగుతోంది. దాన్నిమించిన వెలుగుతో 'విరజ' కనిపించింది. ఆమె చేతిలో హాట్ క్యారియర్ ఉంది. చొరవగా లోపలకు వచ్చి ఓ పక్కన ఉంచింది.

'మీకు శ్రమ ఎందుకండి' అన్నాడు గొంతు పెగల్చుకుని.

## టాలీవుడ్ గురించి తెలియదట!



*ఈ మాట ఎవరో విదేశీ భామ అంటే నమ్మొచ్చు కానీ, తమన్నా నోటి నుంచి ఈ మాట విన్నవారందరూ ఒక్కసారిగా షాక్‌కి గురయ్యారు! కాకపోతే తమ్ము చెప్పిన మాట నిజమే అయినా అది ఇప్పటి మాట కాదట! ఆమెగారు సినిమాల్లోకి వచ్చిన కొత్తల్లో సంగతి చెప్పుకొచ్చింది. అప్పట్లో పాకెట్ మనీ కోసం ఓ కన్నడ సినిమా చేసిందట! ఆ తరువాత తెలుగులో 'శ్రీ'లో అవకాశం వచ్చిందట! అప్పటి దాకా టాలీవుడ్ ఒకటుందనే విషయం కూడా తనకి తెలియదనీ, ఇక్కడ సినిమాలు చేయడం మొదలెట్టిన తరువాత టాలీవుడ్ తన పుట్టిల్లు అయిపోయిందనీ చెప్పుకొచ్చింది. కాకపోతే ఇంటర్వ్యూమొదట్లోనే టాలీవుడ్ ఒకటుందనే విషయం తనకు తెలియదని చెప్పుకు రావడమే చర్చనీయాంశంగా మారింది. తమ్మూ ఈ మాటలు కావాలనే చెప్పిందనీ, టాలీవుడ్‌లో తన హవా తగ్గిపోతోందని గ్రహించి ఇక్కడ పట్టు పెంచుకోవాలనే ఉద్దేశంతోనే నెగెటివ్‌గా మాట్లాడిందని కొందరు అంటున్నారు.*

'ఇందులో శ్రమేం ఉంది. రాత్రిపూట మీరు చేతులు కాల్చుకోవటం ఎందుకు? కూరలవరకు నేను పంపిస్తాను' అంది విరజ.

'అదీ...' అని నసుగుతుంటే నవ్వుతూ వెళ్ళింది. ఆమె తలలో పెట్టుకున్న మల్లెపూల పరిమళం ఆ గదంతా పాకింది. కొంతసేపు తను ఎక్కడ ఉన్నాడో మరిచిపోయాడు. మెల్లగా ఈ లోకంలోకి వచ్చాడు. కూరలు ఇవ్వటం తప్పుకాదు. అదేదో రెండుపక్కలా ఉండాలి. రమణి ఎప్పుడన్నా ఇస్తుందో లేదో తెలియదు. భ్రమరాంబగారికి ఇది తెలుసా? తను చూసుంటే ఏమనుకుంటారు? ఇల్లు ఖాళీచేయమంటే ఎలా? ఇంతతక్కువ అద్దెలో ఇల్లు మళ్ళీ దొరకటం కష్టం. ఎప్పుడన్నా చిరునవ్వులు తప్ప ఇంతవరకు మాట్లాడలేదు. విరజగారికి ఎంత ధైర్యం? ఇలా సాగుతున్నాయి అతని ఆలోచనలు.

మంచంమీద పడుకున్నాడు. ఇంతవరకు విరజ కథేంటో తెలియదు. ఆమె భర్త ఏం చేస్తుంటాడో, ఎక్కడ ఉంటాడో రమణికి కూడా చెప్పలేదు. భ్రమరాంబగారు చెప్పలేదు. ఆ గదుల్లోకి రమణి వెళ్ళ లేదు. తీరిక దొరికినప్పుడు విరజ రమణి దగ్గరకు వస్తుంది. వారి జీవితాల్లో ఏదో విషాదం ఉంది. అదేంటో... అనుకుంటుండగానే రఘుకి నిద్ర పట్టింది.




మరుసటిరోజు ఆలస్యంగా ఇంటికి వచ్చాడు. మెల్లగా తలుపుతీసి లోపలకువెళ్ళి గడియ పెట్టేసు కున్నాడు. ఉదయం ఆఫీస్‌కి వెళ్తుంటే భ్రమరాంబ గారు అడిగారు. 'మీ మామయ్యగారికి ఎలా ఉంది బాబూ" అని.

"ఆయనకి బీపీ, షుగర్ ఉన్నాయండి. మొన్న కళ్ళు తిరిగి పడిపోయారు. రెండురోజులు హాస్పి టల్లో ఉంచారు. ప్రస్తుతం కోలుకుంటున్నారు".

'రమణి' ఎప్పుడు వస్తుంది?'

'ఇంకో నాలుగు రోజులుంటానంది'.

'అలవాటైపోయారు అమ్మాయి, బాబూ ఏంటో లోటుగా ఉంది' అందామె నిట్టూరుస్తూ.

***

రమణి వచ్చిన రాత్రి ఇద్దరూ భోజనం చేస్తున్నారు. ఇంటి దగ్గర విషయాలు చెప్పింది. 'విరజగారి వంటకాలు బాగుండ లేదా?" అంది అకస్మాత్తుగా.

'అదేంటి?' అన్నాడు కంగారుగా.

'నేను ఓ రోజు కూరలు ఇచ్చాను. రెండోరోజు నుండి నా వంటకాలు తినాల్సి వస్తుందని భయ పడి తలుపులు మూసేసుకున్నారు మీ వారు అన్నారామె'.

'నువ్వేం అన్నావు?'

'ఆయనకి మొహమాటం ఎక్కువ అన్నాను'.

'తనేం అన్నారు?'

'అంత మొహమాటం పనికిరాదు. చివరకి హాట్ క్యారియర్ కూడా శుభ్రంగా కడిగి ఇచ్చారు. మా పనిమనిషి ఉంది. లేదంటే నేను క్లీన్ చేసుకుంటాను కదా అన్నారు'.

'ఆమె వంటకాల సంగతి అలా ఉంచు. నాకు ఇబ్బందిగా అనిపించింది. ముందు ఆడవాళ్ళతో మాట్లాడా లంటే నాకు సిగ్గు'.

'నాతో మాట్లాడాలన్నానా?'

'ఆడవాళ్ళు, భార్య ఒకటేనా?' అన్నాడు రఘు.

***

ఈసారి మళ్ళీ రమణి పుట్టింటికి వెళ్ళాల్సి వచ్చింది. అందుకు కారణం తను మళ్ళీ గర్భవతి అయింది. అయిదోనెలలో తీసుకువెళ్తున్నారు. కనీసం నెలరోజులుండాలి. తిరిగి పురుటికి ముందు ఓ రెండు వారాలు అక్కడ ఉంటాను అంది.

భ్రమరాంబగారు దీవించి పంపుతూ 'ఈసారి పండంటి ఆడపిల్లని కనాలి' అంది. ఎప్పుడూ చిరు నవ్వుతూ ఉండే విరజ కళ్ళల్లో ఎందుకో బాధ కని పించింది. ఓరోజు భ్రమరాంబగారు వచ్చింది.

"నువ్వు ఎందుకు బాబూ చేతులు కాల్చు కోవటం. మేం కూరలు పంపిస్తాం. మొహమాట పడకు' అంది రమణి గురించి అడిగాక.

"ఎందుకండి. నాకు వంటవచ్చు. మీరు పెద్దా యనకి సేవలు చేయాలి. తక్కువ అద్దెకు ఇల్లు ఇచ్చారు. అది చాలు" అన్నాడు రఘు.

"ఆయన విషయం మాకు అలవాటైనదే. ఆ రోగం తగ్గదు, పెరగదు. అయినా పక్కవారికి అవ సరం అయినప్పుడు ఉపయోగపడని బతుక్కి అర్థం ఏముంటుంది" అంది.

"అలా కాదండి. నిజానికి నేను మీకు ఉప యోగపడాలి. మీరే ఏదన్నా పని నాకు చెప్పటానికి మొహమాట పడుతున్నారు" అన్నాడు రఘు.

'అవసరం వచ్చినప్పుడు అడగకుండా ఎలా ఉంటాం నాయనా' అందామె.

'నేనూ అంతేనండి!'

"వారానికి రెండుమూడు రోజులైనా వంట చేసు కోకు. పెద్దదాన్ని చెబుతున్నాను. పొద్దున్నుంచి పని చేసి మళ్ళీ వంట చేసుకోవటం అంటే చిరాగ్గా ఉంటుంది".

'ఒకేసారి చేసుకుంటాను'.

"ఆరిపోయిన కూరల్లో రుచీపచీ ఉండదు కాద నకు" అని ఆమె వెళ్ళిపోయింది.

రాత్రికి విరజ హాట్ క్యారియర్ తెచ్చింది.

'అయ్యో...' అన్నాడు. 'నేను తీసుకువస్తే తినరు మా అత్తగారు తీసుకు వస్తే తింటారు' అంది అదోలా.

"అలాంటిదేం లేదండి. అసలీ శ్రమ మీకెందుకు?"

"నేను చేసే వంటకాలు ఎదుటివారు తిన్న ప్పుడు సంతోషం కలుగుతుంది. రమణి ఉన్నప్పుడు ఇవ్వటం లేదు కదా!"

"ఏం మాట్లాడాలో నాకు తెలియటం లేదు".

'మాట్లాడకుండా రుచి చూడండి. నేను కూడా మీతో వంటచేయించుకుని తింటాను' అని వెళ్తుంటే బిత్తరపోయాడు.

***

ఓ రాత్రి...

అమావాస్య రావటానికి ఇంకా మూడు రోజు లున్నాయి. రఘు అప్పుడే నిద్రలోకి జారుతున్నాడు. అప్పుడు తలుపుమీద చప్పుడు వినిపించింది. ఉలికి పడి లేచివెళ్ళి తలుపు తీశాడు.

ఎదురుగా విరజ!

"అత్తయ్యగారికి ఆయాసంగా ఉంది."

"నేను వెళ్ళి ఆటో తీసుకువస్తాను. హాస్పిటల్‌కి తీసుకెళ్దాం" అన్నాడు.

"మావయ్యకి ఏ అవసరం వస్తుందో తెలియదు. మీరు అత్తయ్యని తీసుకు వెళ్తారా" అంది విరజ.

తలూపి అప్పటికప్పుడు ఆమెను హాస్పిటల్‌కి తీసుకెళ్ళాడు. ఐ.సి.యులో ఉంచారు. బయటకు వచ్చి విరజకు ఫోన్ చేశాడు.

"సీరియస్ అంటున్నారా?" అంది విరజ.

"అబ్జర్వేషన్‌లో ఉంచారు. రేపు ఉదయం ఏమన్నా చెబుతారేమో" అన్నాడు.

"మీరు ఇంటికి రండి, మామయ్య దగ్గర మీరుంటే నేను అత్తయ్య దగ్గరుంటాను" అంది.

రెండురోజుల తర్వాత భ్రమరాంబగారిని ఇంటికి తీసుకువచ్చారు. ఆఫీస్‌కి సెలవుపెట్టి రఘు ఇంటికీ, ఆసుపత్రికీ తిరుగుతూనే ఉన్నాడు.

"నా కొడుకులా కష్టపడ్డావు బాబూ" అంది భ్రమరాంబ.

***

రఘు, విరజ ఎదురెదురుగా ఉన్నారు.

భ్రమరాంబగారు వేసుకున్న మందుబిళ్ళల ప్రభావంవల్ల ఒళ్ళు తెలియకుండా నిద్రపోతోంది. ఆమె భర్త ఈ లోకంలో లేదు.

'మీరు ఇంతవరకు సరిగ్గా భోజనం చేయలేదు. నేను వంట చేస్తాను' అన్నాడు రఘు.

'నాకు ఆకలిగా లేదు' అంది విరజ.

"అలా అనకండి. నేను వంటచేసి పిలుస్తాను" అని తన గదికి వచ్చాడు. చకచక కూరగాయలు

తరిగి వంట పూర్తి చేసేటప్పటికి విరజ వచ్చింది. స్నానం చేశాక ఆమెలో అలసట మాయం అయింది.

"నేనూ స్నానం చేసి వస్తాను. ఈలోగా మీరు భోంచేస్తారా?" అన్నాడు.

మాట్లాడకుండా అతన్నే చూస్తోంది.

ఆ చూపులో ఏదో కాంక్ష. రఘులో సన్నగా ప్రకంపనలు మొదలయ్యాయి. అకస్మాత్తుగావచ్చి రఘును గట్టిగా కౌగలించుకుంది. ఆమె గుండెలు అతన్ని తాకుతున్నాయి. అతను వివశత్వానికి లోనవుతున్నాడు. విరజ అతని పెదవులమీద గాఢంగా ముద్దు పెట్టుకుంది.

రఘు వివేకం, ఉద్వేగాల మధ్య నలిగిపోతున్నాడు. మెల్లగా ఆమెని వదిలించుకున్నాడు.

'రఘూ, ఈ దేహానికి తృష్ణవుంది. అది చల్లారాలి. ఒక్కసారి.. ఒక్కసారి ఆ అనుభవం కావాలి' అంటోంది ట్రాన్స్‌లో ఉన్నట్లు.

'మీకు పెళ్ళయింది. మీ భర్త..' అంటున్నాడు రఘు. 'అవన్నీ తర్వాత..' అంటూ మరింతగా హత్తుకుంటూ మంచం దగ్గరకు నెట్టుకుంటూ వెళ్ళింది.

'మీ వారు ఏ ఉద్యోగం చేస్తున్నారు?' అన్నాడు మెల్లగా.

"మిలట్రీలో చేస్తున్నారు. నేను అలాంటిదాన్ని కాదు. అయినా ఇంతకాలం సప్రెస్ చేసుకున్న కోరిక నన్ను దహించివేస్తోంది. ఇలా ఉంటే నేను ఏమైపోతానో తెలియటంలేదు. నేను అశక్తురాల్ని.. నేను..." అంటోంది ఉద్విగ్నంగా.

రఘుకి ఈడ్చికొట్టినట్టు అనిపించింది.

"విరజగారూ... ఒక్క నిమిషం. మీ వారు సరిహద్దుల్లో పని చేస్తున్నారు. నా భార్య ప్రస్తుతం నాకు దూరంగా ఉంది. మిమ్మల్ని నేను అర్థం చేసుకుంటాను. మనకి నిగ్రహం కావాలి. మనం తప్పు చేయవద్దు. ప్లీజ్" చేతులు జోడించాడు.

అప్పటిదాకా మోహావేశంలో ఉన్న 'విరజ' మెల్లగా మంచంమీద కూర్చుంది. కొద్దిసేపు కణతలు నొక్కుకుంటూ ఉండిపోయింది. ఆ తర్వాత తేరుకుంది. రఘుకేసి చూడకుండా మెల్లగా ఇంటిలోపలికి వెళ్ళిపోయింది. ఆ ఇల్లు ఖాళీ చేయాలని రఘు అప్పుడే అనుకున్నాడు.

***

రాత్రి ఒంటి గంట.

ఇద్దరి మధ్య నిశ్శబ్దం. వికాస్‌లో మథనం. అప్పటిదాకా దూరదూరంగా కూర్చున్నారు ఇద్దరూ. మెల్లగా విరజ దగ్గరకువచ్చి వంచిన ఆమె తల పైకెత్తాడు. ఆమె కళ్ళ నుండి జారుతున్న కన్నీటి బొట్లు తుడిచాడు.

'విరజా.. ఇప్పటివరకూ నేను భ్రమల్లో బతుకుతున్నాను. అమ్మానాన్నల గురించి పట్టించుకోలేదు. కట్టుకున్న భార్య గురించి ఆలోచించలేదు. దేశం, దేశభక్తి అనే ఓ గాఢమైన భావనలో బతుకుతున్నాను'.

విరజ అతన్నే చూస్తోంది.

'మేం దేశం కోసం ప్రాణాలు ఇస్తుంటాం. మా సైనికుల తల్లిదండ్రులు, భార్యలు అప్పుడు ప్రకటనలు ఇస్తుంటారు. మాకు ఇంకో బిడ్డ ఉంటే వారిని కూడా యుద్ధంలోకి పంపిస్తాం అంటారు అమ్మానాన్నలు. నాకు పుట్టినబిడ్డనో, పుట్టబోతున్న వారినో దేశానికి అంకితం చేస్తామంటారు చనిపోయిన వారి భార్యలు.

ఇవన్నీ వినటానికి బాగుంటాయి. అసలు యుద్ధాలు ఎందుకు వస్తున్నాయి. ఈ దేశాన్ని పరిపాలించేవారు దేశాన్ని ఎందుకు తాకట్టుపెడుతున్నారు. ఎందుకు రహస్యాలు అమ్మేస్తున్నారు. దేశభక్తి అంటే రాజకీయమా? ఓట్లా? అది సైనికులకు మాత్రమేనా? ప్రభుత్వాలకు అవసరం లేదా? ప్రజలకు అవసరం లేదా? దేశాలకు వద్దా? మతాలకు వద్దా?' అని ఆగాడు అటూ ఇటూ తిరిగాడు.

'ఇలాంటి ఆలోచనలు వస్తున్నాయి. నాకే కాదు అన్ని దేశాల్లో సైనికులకూ వస్తున్నాయి. అయినా ఎప్పటికప్పుడు నేనూ, నా దేశం అనే భావన మమ్మల్ని నడిపిస్తోంది.

నువ్వు, రఘు ఆరోజు నిజంగా ఒకటైనా ప్రపంచం బద్దలైపోదు. ఆ సందర్భం అలాంటిది. మనుషులకి తిండి కావాలి. ప్రేమ కావాలి. శృంగారం కావాలి. పిల్లలు కావాలి. ఇద్దరూ ఒకే గూటికింద ఉంటూ ఒకరినొకరు మోసం చేసుకుంటే అది మోహం. అవధులులేని కామంతో సంబంధాలు పెట్టుకునేవారు ఎంత తర్కాన్నైనా ఉపయోగించుకోవచ్చు. ఎవరు ఎందుకు అలాంటి పనులు చేస్తున్నారనేది ముఖ్యం. అందుకే నువ్వన్నా, రఘు అన్నా నాకు గౌరవం కలుగుతోంది. దేశాన్ని ప్రేమించటం అంటే ఇంటిని ప్రేమించటం. కుటుంబాన్ని ప్రేమించటం. ఇప్పటివరకూ దేశాన్ని ప్రేమించాను. ఇప్పుడు మనందరి గురించి ఆలోచిస్తాను విరీ. నేను ద్వంద్వంగా బతకలేను. ఇది నాకు పార్ట్‌టైమ్ జాబ్‌కాదు. నాకు ఒకటే అనిపిస్తోంది. ప్రపంచం దగ్గరవటం అంటే సరిహద్దులు చెరిగిపోవటం. ఇలాంటి దుస్థితి ఏ మనిషికీ రాకుండా ఉండటం' అన్నాడు.

విరజ మెల్లగాలేచి అతని హృదయం మీద వాలిపోయింది. వారిమధ్య నైతికత, అనైతికత మీమాంస లేదు. స్వచ్ఛమైన కన్నీటితో వారిద్దరూ పునీతులవుతున్నారు.

సెల్: 92465 73575

# సిరాధార




పొద్దు బద్ధకంగా నిద్రలేచింది...
రైలు తొలి కూత కూసింది
సెల్‌ఫోన్ పిచ్చుకలు
కిచకిచలు మొదలెట్టాయి...
ఎప్పుడో నిలిచిపోయిన వాల్‌క్లాక్
వాల్ హ్యాంగరయిపోయింది....

ఎవరో తరుముకొస్తున్నట్లు...
నగరం పరుగెత్తడం మొదలెట్టింది
కిక్కిరిసిన షేర్ ఆటో
బాత్‌రూమ్ సింగరై గర్జిస్తోంది...
బస్సు చెట్టుపై వాలిన ఒకాకి
నోట దాచుకున్న ఎర్రరెట్ట
రోడ్డుపై వేసింది.

కంప్యూటర్ బాస్‌కి తలాడించడం
మొదలెట్టాయి గంగిరెద్దు జీవితాలు
వృద్ధాప్యం ముంచుకొచ్చిన ఇళ్ళు
పిల్లలకు పహరాగా మారాయి

సాంత్వన ఇచ్చిన గుడి
చూపుల అలికిడి లేక బూజుపాలైంది
ఎండకు పగిలిన రోడ్డు
తిష్ట వేసుక్కూర్చున్న బిచ్చగాడైంది.
ప్రేమ తన చిరునామా వెదికి వెదికి
మనసు మూగదై...
చంకెక్కిన బిడ్డలా గుక్కందుకుంది

***

పొద్దు వాలింది...
నేలచూపు చూస్తూ నడుస్తున్నాయి
వాట్సప్ గబ్బిలాలు..



పొద్దుట నుంచి పారే
మురుగు తాగిన వరాహం
తుళ్ళుకుంటూ రోడ్డెక్కింది
మేధమింగిన చీకటిదారిలో
ఐన్‌స్టీన్ కళ్ళజోడు నీడలో వేచున్న
మెరిసే మల్లెపువ్వు వైపు అడుగులేసింది

చీకటిని చీకటిలో చూడలేకనేమో
నీలి ఖాకీ వెన్నెల విజిలేశాడు
దుండగుడెవడో...
మనిషి తనం లాక్కెళ్ళాడు

కలత కలం కంటిచివరి
సిరాధార పట్టి
తలగడ డైరీలో పుటలు నింపేస్తోంది.
వాడరేవు సముద్రం పంపిన పిల్లగాలి
ఓదార్పు పాటై చెక్కిలి నిమిరింది.

**—కరణం కళ్యాణ్ కృష్ణకుమార్,**
**సెల్: 98484 28978**



రగా నిలబడి, కళ్లలోకి సూటిగా చూస్తాడు.' అది చాలు.. ఎలాంటి వాళ్ల గుండెల్లోనైనా గుబులు రేపటానికి. ఆ తర్వాత కొద్దిక్షణాలకు అంతా సర్దుకుంది. లొరెంజ్ క్యాస్ట్రోకు పడవంతా తిప్పి చూపించింది. కేబిన్‌లోకి వెళ్లి వంట కోసం స్టీవర్డ్‌ని పురమాయించింది. ఆలోగా ఆమె వెనకే వచ్చిన క్యాస్ట్రో ఆమె రెండు చేతులు పట్టుకుని దగ్గరకు లాక్కుని ఆమె పెదవులందుకున్నాడు. ఆ చర్యనామె అడ్డుకోలేకపోయింది. ఆ రాత్రంతా సరదా జోకులతో గడిచిపోయింది. మరుసటి రోజు లొరెంజ్ క్రూజ్ క్యాస్ట్రో బృందాన్ని వదిలి న్యూయార్క్‌కు బయల్దేరింది. కొన్ని రోజుల తర్వాత లొరెంజ్ ఇంట్లో ఫోన్ మోగింది. అవతల క్యాస్ట్రో. ఆ తర్వాత క్యాస్ట్రో లొరెంజ్‌ను రప్పించటం కోసం న్యూయార్క్‌కు ప్రైవేట్ ప్లేన్ పంపించాడు. అప్పటినుంచి ఏడు నెలలపాటు లొరెంజ్ క్యాస్ట్రోతోపాటు హబానా లిబ్రే హోటల్‌లో ఉండిపోయింది.



# ఫిడెల్ క్యాస్ట్రో ప్రేమలో... మహిళా గూఢచారి

**అతను అప్పటికే బాగా అలసిపోయి నిద్రలోకి జారుకోడానికి సిద్ధంగా ఉన్నాడు. సిగార్ పక్క పళ్లకింద నలుగుతోంది. అలాగే బెడ్ మీదకు ఒరిగి చాలా మామూలుగా అడిగాడు. 'నువ్వు నన్ను చంపటానికొచ్చావు కదా?' సమాధానంగా నేనేదో చెప్పేలోపే.... 'ఇదిగో... దీంతో కాల్చు.' అంటూ ముందుకు వంగి, 45 పిస్టల్ నాచేతిలో పెట్టాడు.**

మెదడు మొద్దుబారి, అయోమయంగా తుపాకీ అతని ఛాతికి గురిపెట్టాను. అతను రెప్ప ఆర్పకుండా నన్నే చూస్తూ...'నువ్వే కాదు, నన్నెవరూ చంపలేరు.' అంటూ...అదే మరులుగొలిపే నవ్వుతో నన్ను బలంగా దగ్గరికి లాక్కున్నాడు. అతనికి తెలుసు నేనతన్ని చంపలేనని...నేనే కాదు. అతనన్నట్టు అతన్ని చంపటం ఎవరి తరం కాదు. అమెరికన్ సిఐఏకి కూడా! కాబట్టే సిఐఏ చేసిన 638 ప్రయత్నాలు వరసగా ఫెయిలయ్యాయి. వాటిలో ఒకటి నేనే! నా పేరు... 'మారిటా లొరెంజ్'. ఫిడెల్ క్యాస్ట్రో ప్రియురాలిగా మారి అతని ప్రేమలో పీకల్లోతు మునిగిపోయి ఓడిపోయిన రియల్ లైఫ్ ఫిమేల్ జేమ్స్‌బాండ్ మారిటా...'ది స్పై హు లవ్డ్ క్యాస్ట్రో' పుస్తకంలో స్వయంగా రాసుకున్న మాటలివి. ఈ పుస్తకం ఆధారంగా హాలీవుడ్ సినిమా రూపొందబోతోంది... ఆ విశేషాలు...

### లొరెంజ్ ఫస్ట్ లవ్

లొరెంజ్, క్యాస్ట్రోల తొలి పరిచయం ఫిబ్రవరి 28, 1959లో హవానా హార్బర్‌లో జరిగింది. తన తండ్రి క్రూజ్ షిప్స్‌లో ప్రయాణిస్తూ హవానాలో లంగరు వేసి ఆగినప్పుడు తమవైపు కదలివస్తున్న పడవొకటి కనిపించింది లొరెంజ్‌కు. దాన్లో ఒకే రకమైన గడ్డాలతో 27మంది ఉన్నారు. అందర్లోకి కాస్త పొడవుగా ఉన్నతని చేతిలో రైఫిల్ చూడగానే కంగారుపడిపోయిన లొరెంజ్ జర్మన్‌లో గట్టిగా అరిచింది. అందుకతను 'మీ పడవలో చోటు కావాలి' అంటూ సముద్రపు హోరుని మించి గట్టిగా అరిచాడు. 'ఇంతకీ నువ్వెవరు?' అని అడగ్గానే...'పళ్లన్నీ మెరిపిస్తూ గట్టిగా నవ్వి 'కమాండెంట్ ఫిడెల్ క్యాస్ట్రో!' అని చెప్పాడు. అంతకు రెండు నెలలకు ముందే ఫిడెల్ బాటిస్టా నుంచి క్యూబాను హస్తగతం చేసుకున్నాడని తెలుసు. అయినా ధైర్యం కూడగట్టుకుని 'ఇది జర్మన్ నేల...మా నేల మీద మీ పెత్తనమేంటి?' అనే అర్థం వచ్చేటట్టు అడిగింది లొరెంజ్. దానికతను 'నిజమే! కానీ మీరు మా ఓడరేవులో ఉన్నారు!' అన్నాడు. అనటమే కాదు...అప్పటికే అతను టీమ్‌తో సహా పడవలోకి ఎక్కేశాడు. అంతకుముందువరకూ పరాయి మగాళ్లతో పరిచయంలేని పంతొమ్మిదేళ్ల లొరెంజ్ ఆరడుగుల క్యాస్ట్రోని అంత దగ్గరగా చూసి మెస్మరైజ్ అయిపోయింది. 'ఫిడేల్ మాట్లాడేటప్పుడు చాలా దగ్గరగా నిలబడి, కళ్లలోకి సూటిగా చూస్తాడు.'

### ఆ నేరం ఎవరిది?

ఏప్రిల్, 1959 క్యాస్ట్రోతో లొరెంజ్ అమెరికా ట్రిప్‌లో పాల్గొంది. ఆ సమయంలో తను గర్భవతి నని గ్రహించి విషయం క్యాస్ట్రో చెవిలో వేసింది. అందుకు క్యాస్ట్రో ఆనందంతో గ్రీట్ చేస్తూ... 'వండర్‌ఫుల్! జర్మన్‌క్యూబన్ బేబీ అన్నమాట!' అన్నాడు. కానీ లొరెంజ్ గర్భం నిలవలేదు. దానికి కారణాలు లొరెంజ్‌కే పూర్తిగా తెలియవు. తనకు తెలిసినది తక్కువ. విన్నవే ఎక్కువ. కారణమేదైనా గర్భస్రావానికి క్యాస్ట్రోనే కారణమని నమ్మింది లొరెంజ్.

1959 అక్టోబరులో ఏడున్నర నెలల గర్భవతి అయిన లొరెంజ్ తాగే పాలలో విషం కలిపారు. బహుశా అది క్యాస్ట్రో మీద జరగాల్సిన హత్యాప్రయత్నం అయి ఉంటుంది. దానికి లొరెంజ్ బలయింది. ఆ చాక్లెట్ మిల్క్‌షేక్ తాగగానే స్పృహ కోల్పోయిన ఆమె కళ్లు తెరిచి చూసేసరికి ఆస్పత్రిలో ఉంది. పాప పుట్టిందని, హబానా హోటల్‌లో క్షేమంగా ఉందని నమ్మించిన క్యూబన్ ఆర్మీ కమాండర్ 'కామిలో సెన్‌ఫ్యూగస్' క్యాస్ట్రోకున్న శత్రుభయం వల్ల అలా చేయాల్సొచ్చిందని చెప్పాడు. తర్వాతి రోజు ఆమె సూట్‌కేసులు సర్ది న్యూయార్క్ పంపించేశాడు. అదంతా నిజమో, కాదో చెప్పటానికి ఆ సమయంలో ఫిడెల్ అక్కడ లేడు. దీనికి సరిగ్గా అవతల వైపునున్న ఫిడెల్‌కి ఇలా జరుగుతున్న విషయం తెలుసో లేదో కూడా ఆమెకు తెలియదు!

## శత్రువైన ప్రేమికుడు

న్యూయార్క్‌లోని రూజ్‌వెల్ట్ హాస్పిటల్‌లో అడ్మిట్ అయిన లోరెంజ్‌కు అక్కడ వింత అనుభవం ఎదురైంది. అక్కడి ఎఫ్‌బిఐ ఏజెంట్ ఫ్రాంక్ ఓ బ్రీన్, హవానాలో ఆమెకు బలవంతపు అబార్షన్ జరిగిందని చెప్పాడు. క్యాస్ట్రోకు సన్నిహితురాలైన లోరెంజ్‌ను ఇంటర్వ్యూ చేయటం కోసం ఎఫ్‌బిఐ తరపున వచ్చిన ఫ్రాంక్, ఇంకో విషయం కూడా గమనించాడు. లోరెంజ్‌కు అప్పటికి 20 ఏళ్లు. క్యాస్ట్రోకు వ్యతిరేకంగా ఉపయోగించుకోదగ్గ శక్తి ఆమె దగ్గరుంది. ఆ ఆలోచనతో క్యాస్ట్రో ఆమెకు మత్తు మందు ఇప్పించి బలవంతంగా అబార్షన్ చేయించాడని నమ్మబలికి లోరెంజ్‌కు క్యాస్ట్రో పట్ల అసహ్యం కలిగేలా చేశాడు. ఆ తర్వాత జరగాల్సిన పనులన్నీ చకచకా జరిగిపోయాయి.

లోరెంజ్ సిఐఏకు కాంట్రాక్ట్ ఏజెంట్‌గా మారింది. సిఐఏ నిధులతో పనిచేసే క్యాస్ట్రో వ్యతిరేక శక్తులతో చేతులు కలిపింది. క్యాస్ట్రో మీద పగ తీర్చుకోవటమే లోరెంజ్ లక్ష్యం. క్యాస్ట్రోతో సన్నిహితంగా మెలుగుతూనే న్యూయార్క్‌లో సిఐఏ శిక్షణ తీసుకుంటూ తెరవెనక కార్యకలాపాలు చురుగ్గా సాగించింది. గర్భస్రావం తర్వాత పిల్లలు లేరనే కారణంత ఓ అనాథను క్యాస్ట్రో దగ్గరే ఉంచి పెంచటం మొదలుపెట్టింది. సంబంధం పూర్తిగా తెంచుకోకుండా రాకపోకలు సాగిస్తూనే ఉంది.

## బెడిసికొట్టిన ఫైనల్ ప్లాన్

క్యాస్ట్రోను తుదముట్టించే ప్రణాళిక ఆచరణలో పెట్టే సమయం వచ్చింది. వ్యక్తిగత విషయాలు మాట్లాడాలనే నెపంతో క్యాస్ట్రోను కలవాలనేది ప్లాన్. కొన్ని రోజులు కలిసి గడిపాక వెనక్కొచ్చిన లోరెంజ్ తిరిగి హవానా వెళ్లేటప్పుడు రెండు 'బాట్యులిజం టాక్సిన్ పిల్స్' వెంట తీసుకెళ్లింది. చూడటానికి తెల్లని జెలటిన్ క్యాప్స్యూల్స్‌లా ఉంటాయవి. డ్రింక్‌లో కలిపితే 30 సెకండ్లలో చావు తథ్యం. హవానాలో హిల్టన్ హోటల్ రూమ్ నంబర్ 2408. రెండు క్యాప్సూల్స్‌ను కోల్డ్ క్రీమ్ జార్‌లో దాచిన లోరెంజ్ క్యాస్ట్రో కంటే ముందే రూమ్‌కి చేరుకుని కోల్డ్ క్రీమ్ జార్ తెరిచింది. కానీ అవి క్రీమ్‌లో పూర్తిగా కరిగి కలిసిపోయి కనిపించాయి. ఇప్పుడెలా? పోనీ...క్యాస్ట్రో నిద్రపోతున్న సమయంలో ఆ క్రీమ్‌ను అతని నోట్లో ఉంచితే? ఆ ప్లాన్ కచ్చితంగా వర్కవుట్ కాదు. క్యాస్ట్రో కనిపెట్టేస్తాడు. ఎలా? కంగారు మొదలైంది. చేసేదేం లేక ఆ క్రీమ్‌ను బాత్‌రూమ్‌లో ఫ్లష్ చేసేసింది. క్యాస్ట్రో వచ్చాడు. 'అవునూ...ఏంటి? ఈమధ్య సడెన్‌గా మాయమై ప్రత్యక్షమవుతున్నావ్? నా వ్యతిరేకులతో కూడా సన్నిహితంగా మెలగుతున్నావని తెలిసింది. నిజమేనా?' సూటిగా అడిగాడు. దానికామె కంగారు పడకుండా పరిస్థితిని కూల్‌గా హ్యాండిల్ చేయాలనుకుంది. బయట ఆమె ఏజెంట్లున్నారు. విషం కలిపిన డ్రింక్ తాగించేసి ఆ రాత్రికి స్పీచ్ ఇవ్వనివ్వకుండా అతన్ని చంపేయాలనేది ప్లాన్. కానీ క్యాస్ట్రో కనిపెట్టేశాడు.

అతనప్పటికే బాగా అలసిపోయి ఉన్నాడు.. ఆమె తడబాటును, ముఖంలోని భావాలను పసిగట్టాడు. చంపటానికే వచ్చినట్టు అర్థమై...నింపాదిగా అడిగాడు...'నువ్వు సిఐఏ తరపున పని చేస్తున్నావా?' దానికామె... 'లేదు...నేను నా కోసమే పని చేస్తున్నాను' అంది.

.45 పిస్టల్ చేతికిచ్చి కాల్చి చంపమన్నాడు. ఆ పని తను చేయలేకపోయింది. ఆ తర్వాత ఆమెను తను గుండెలకు హత్తుకున్నాడు. ఏడుపు తన్నుకొచ్చింది. మనసులో ఉన్నదంతా చెప్పేయాలనుకుంది. అతను స్పీచ్ ఇచ్చి వచ్చాక జరిగిందంతా వివరంగా మాట్లాడాలనుకుందామె. కానీ అతని స్పీచ్ ఏకధాటిగా 8,9,10 గంటలపాటు సాగుతుంది. 'అప్పటిదాకా వెళ్లకు...ఉండు' అంటాడేమోనని అతని మాట కోసం ఎంతో ఆశగా ఎదురుచూసింది. కానీ క్యాస్ట్రో...ఏమీ మాట్లాడకుండా డ్రస్ చేసుకుని వెళ్లిపోయాడు. అతను వెళ్లిపోయాక విశాలమైన ఆ గదిలో నిశ్శబ్దంగా కూర్చుండిపోయిందామె. కొద్దిసేపటికి తేరుకుని 'మళ్లీ కలుస్తాను' అనే చిన్న నోట్ రాసి గదిలోంచి బయటకొచ్చింది. కానీ అదే వాళ్లిద్దరి ఆఖరి కలయిక. లోరెంజ్, క్యాస్ట్రోల దార్లు ఆరోజు నుంచి వేరయ్యాయి.

**–గోగుమళ్ల కవిత**

## క్యాస్ట్రో హత్యా ప్రయత్నాల్లో కొన్ని...

క్యాస్ట్రోను చంపటం కోసం సిఐఏ అర్థ శతాబ్దం పాటు లెక్కలేనన్ని ప్రయత్నాలు చేసింది. విషపు గుళికలు, విషపు సిగార్లు, పెన్ సిరంజి.. ఇలా క్యాస్ట్రోను అంతం చేయటం కోసం ఊహకు అందని ఎత్తులెన్నో వేసింది సిఐఏ. స్కూబా డైవింగ్ ఇష్టపడే క్యాస్ట్రోను నీళ్ల అడుగునే చంపటం కోసం విస్ఫోటకాలు నింపిన పెద్ద ఆల్చిప్పను సముద్ర గర్భంలో ఉంచాలని కూడా ప్లాన్ చేసింది సిఐఏ. ఆ ఆల్చిప్పకు ముదురు రంగులు వేసి క్యాస్ట్రోని ఆకర్షించాలనేది సిఐఏ ప్లాన్. కానీ ఆ ప్లాన్ వర్కవుట్ కాదని విరమించుకున్నారు. తర్వాత క్యాస్ట్రో వేసుకునే స్కూబా సూట్‌లో ప్రమాదకర ఫంగస్ వేయాలని, దాంతో మొండి చర్మ వ్యాధితో క్యాస్ట్రోని ఇబ్బంది పెట్టాలని కూడా ప్రయత్నించి విఫలమైంది సిఐఏ. ఓ సందర్భంలో క్యాస్ట్రో హ్యాండ్ కర్చీఫ్‌లో విషం చల్లాలని, అతను తాగే టీ, కాఫీల్లో విషం కలపాలని ప్లాన్ చేసింది. కానీ ఆ విషం నీళ్లలో కరగట్లేదని పరీక్షల్లో తేలటంతో ఆ ప్రయత్నం విరమించుకుంది. సిఐఏ ప్రయత్నాలన్నీ కాలక్రమేణా బట్టబయలయ్యాక క్యాస్ట్రో అమరుడు...అతనంతట అతనే చనిపోవాలిగానీ అతన్నెవరూ చంపలేరనే ఓ నమ్మకం క్యూబాలో ఏర్పడిపోయింది.

అతను మరణించే ముందు వరకూ క్యాస్ట్రో మరణం గురించిన జోక్స్ క్యూబాలో విపరీతంగా ప్రచారంలో ఉండేవి. వాటిలో ఒకటి...'క్యాస్ట్రో పుట్టినరోజునాడు ఒక అభిమాని ఆయనకు గాలాపాగస్ తాబేలును బహూకరించాడు. దాన్ని అందుకున్న క్యాస్ట్రో...'ఇది వందేళ్లకు మించి బ్రతకదు. ఈ పెంపుడు జంతువులతో ఉన్న చిక్కే ఇది! వాటితో అనుబంధం పెంచుకుంటాం. అవేమో మనకంటే ముందే చనిపోతాయి' అని ఆ బహుమతిని తిరస్కరిస్తాడు.




## హాలీవుడ్ మూవీ

ది స్పై హు లవ్డ్ క్యాస్ట్రో సినిమాలో ఆస్కార్ విన్నర్ 'జెన్నిఫర్ లారెన్స్' మారిటా లోరెంజ్ పాత్ర పోషిస్తోంది. హంగర్ గేమ్స్ సిరీస్‌తో మంచి పేరు తెచ్చుకున్న జెన్నిఫర్ ప్రస్తుతం 'స్పేస్ రొమాన్స్ పాసెంజర్స్', ఎక్స్ మెన్ అపోకలిప్స్ సినిమాల్లో నటిస్తోంది. ఈ సినిమాలో ఫిడెల్ క్యాస్ట్రో పాత్ర కోసం ఇంత వరకూ ఏ నటుడి పేరూ ఖరారు కాలేదు.





# జీవితమే ఒక ప్రతిఘటన

(కోట శ్రీనివాసరావు కథాకథనం) 27

**ఎన్ని పాత్రలు చేసినా కొన్ని మనసుకు దగ్గరగా ఉంటాయి. 'అత్తారింటికి దారేది'లో పాత్ర అటువంటిదే. ఆ వేషం విషయంలో నిజంగా త్రివిక్రమ్‌కి చాలా రుణపడి ఉన్నా. ఇంత పెద్ద మాట ఎందుకంటున్నానంటే అనుకున్నప్పుడల్లా అలాంటి పాత్రలు పడవు.**

బన్నితో నటించిన 'జులాయి' కూడా అంత మంచి చిత్రమే.. బనియన్ వేసుకుని, పంచె కట్టు కుని మెడలో రుద్రాక్షతో నల్లదారం వేసుకుని చాలా బావుంటుంది ఆ పాత్ర.

అవగాహన ఉండాలి. లోకజ్ఞానం అవసరం. అది ఉంటే తప్ప ఇలాంటి డైలాగులు రాయలేరు. జనా లకు ఇట్టే కనెక్ట్ అయ్యే డైలాగులు ఇవే మరి.

ఆ చిత్రంలో మరో సన్నివేశంలో సోనూసూద్ ఆయన.

### వేదికమీద నా కళ్ళు చెమర్చడం అదే ఫస్ట్ టైమ్

అంతకు ముందు 'అత్తారింటికి దారేది' సినిమా సక్సెస్‌మీట్ హైదరాబాద్ శిల్పకళావేదికలో జరిగింది. దాదాపు యూనిట్ మొత్తం ఆ వేడుకకు హాజరయ్యాం. చాలా భారీ ఎత్తున చేశారు. ఆ వేడుకలో పవన్ కల్యాణ్‌గారు ఆర్టిస్టులు అందరి

## ఆ చనువుతోనే ఒక మాట చెబుతుంటా...

అందులో ఒక డైలాగ్ ఉంటుందండీ.

'రిషికొండ నుంచి భీమిలికి వెళ్ళే రూట్‌లో రోడ్డు కొంచెం మలుపు తిరుగుతుందయ్యా అమ్మాయి నడుములాగా. కరెక్టుగా అక్కడ పదెకరాల బిట్టు మనకుంది బిట్టూ... అక్కడ కూర్చుంటే వైజాగ్ మొత్తం మన కాళ్ల కింద ఉన్నట్టు ఉంటుంది. చిన్న ప్పుడు అక్కడే కూర్చునేవాణ్ణి. కరెక్టుగా అట్టాంటి బిట్టే ఒకటి హైదరాబాద్‌లో ఉందని విన్నానయ్యా. అక్కడ కూర్చోవాలని ఉంది. అలా సెయ్యాలంటే పవరుండాలి.. అది రావాలంటే కనీసం వెయ్యి ఉండాలి. వెళ్ళి తెచ్చేయ్..' అని.

సోనూసూద్‌ని వెళ్ళి 1500 కోట్ల రూపాయలు తీసుకురమ్మని నేను చెప్పే డైలాగ్ అన్నమాట.

ఇలాంటి డైలాగులు రాయాలంటే కేవలం భాషమీద పట్టు ఉంటే సరిపోదు. ప్రాంతాల మీద

నన్ను చంపుతాడు. నేను బాధతో అల్లాడుతూ "డబ్బు మీకిచ్చేస్తానయ్యా" అని అరుస్తాను. అయినా కనికరించకుండా చంపేస్తాడు. నేను విల విలా కొట్టుకుని చచ్చిపోయాక బిట్టు అంటాడూ, "తప్పు... మెమ్మమ్మ బెబ్బబ్బానా? మేమేం మాట్లాడు కున్నామో తెలుసా.... హ్యాండీకేప్డ్‌ని కామెంట్ చేయ కూడదు. తప్పు అది..' అని.

రైటర్ ఎంత సెన్సిటివ్‌గా ఆలోచించకపోతే అలాంటి డైలాగులు పుడతాయి చెప్పండి.

ఆ మాటే నేను త్రివిక్రమ్‌తో అంటే 'నటుడిగా మీరేమైనా తక్కువ తిన్నారా కోటగారూ.. నేను డైలాగులే రాశాను. కానీ మీవి ఎక్స్‌ప్రెషన్స్, గొంతులో ఎక్స్‌ట్రా సౌండ్స్‌తో ఆ డైలాగుకు ప్రాణం పోశారు కదా. అలాంటివి మీకు ఎవరూ నేర్పక్క ర్లేదు. సహజసిద్ధంగా వస్తూ ఉంటాయి' అన్నారు

గురించి మాట్లాడి నా వరకు వచ్చేసరికి "కోటగారు పెద్దవారు, ఆయన గురించి నేనేమని చెబుతాను? ఆయన గురించి మాట్లాడాలంటే నా వయసుగానీ, అనుభవం కానీ సరిపోదు" అన్నారు. ఫస్ట్‌టైమ్ అనుకుంటా ఒక వేదిక మీద నాకు కళ్ళు చెమ ర్చడం. ఒక అరనిమిషం నా కళ్ళ నుంచి నీళ్ళు కారాయి. హాల్లో జనాలందరూ 'పవర్‌స్టార్ పవర్ స్టార్' అని కేకలు పెడుతుంటే, అంతటి క్రేజ్ ఉన్న నటుడు నా గురించి రెండు మాటలు గౌరవంగా చెప్పడం నాకు గొప్పగానే అనిపించింది. అదే వేదిక మీద త్రివిక్రమ్ మాట్లాడుతూ "నాకు ఇష్టమైన నటుడు కోట శ్రీనివాసరావుగారు" అన్నారు.

ఆయన సినిమాల్లో ఎక్కువ వేషాలు చేయక పోయినా, చేసింది తక్కువే అయినా జీవితంలో గుర్తుండిపోయే చిత్రాలు చేశాను. ఒక ఆర్టిస్టుగా నేను చేయదగ్గ పాత్రలను త్రివిక్రమ్ చిత్రాల్లో చేశా. నాలోని నటుణ్ణి వెలికితీసిమరీ మంచి వేషా లిచ్చి చేయించారు త్రివిక్రమ్. త్రివిక్రమ్ దగ్గర నేను చేసిన చివరి చిత్రం 'సన్నాఫ్ సత్యమూర్తి'. అందులో నా వేషం భలే గమ్మత్తుగా కుదిరింది.

ఆ సినిమాలో ఇంటి సీన్లు హైదరాబాద్‌లో ఉన్న 'మర్యాదరామన్న' సెట్లో తీశారు. ఆ సెట్లోకి నేను వెళ్ళగానే త్రివిక్రమ్ ఎదురొచ్చి చెప్పింది ఏమిటంటే...

"అసలు ఈ సినిమాలో ముందు మేం మీకు వేషమే అనుకోలేదండీ. ఏమిటో ఈ సెట్లోకి రాగానే ఇక్కడ కోటగారు కూర్చుని ఉంటారు. ఇక్కడ



# ఖాళీగా కూర్చోవడం పరమ చిరాకు



ఇదిగో ఇలా ఖాళీగా కూర్చున్నప్పుడు నాకు ఆ రోజులన్నీ గుర్తుకొస్తుంటాయి. ఆ చనువుతోనే త్రివిక్రమ్‌లాంటివారితో 'బోర్ కొడుతోందయ్యా నాకు. అనవసరంగా ఆర్టిస్టుని ఊరికే కూర్చోపెడుతున్నారు. ఖాళీగా ఉంటే ఏ ఆర్టిస్టుకయినా బ్రెయిన్ పాడయిపోతుంది. నన్ను ఇలా కూర్చో పెట్టొద్దు. మంచి వేషాలివ్వండి' అని అడుగుతుంటా. ఎందుకంటే ఖాళీగా కూర్చోవడం నాకు పరమ చిరాకు. ఎప్పుడన్నా ఎవరన్నా పలకరించడానికి ఎవరో ఒకరు వస్తే తప్ప నాకు పొద్దుపోయేది ఎలాగ? అందులోనూ మూడున్నర దశాబ్దాలకు పైగా బతికిందంతానూ సినిమాల్లోనాయే. ప్రతిరోజూ 150 మంది ఆర్టిస్టుల మధ్య మెలిగేవాడిని. అదీ తీరిక లేకుండా... మూడు షిఫ్టులతో. చుట్టూ జనం మధ్య కోలాహలంగా బతికి ఒక్కసారిగా సైలెంట్ అయిపోయి ఇంట్లో కూర్చోవాలంటే ఎంత నరకం? ఇంట్లో నేను, మా ఆవిడ, మా కోడలు, పిల్లలు ఉంటాం. పిల్లలు కూడా స్కూలుకి వెళ్తుంటారు. వస్తుంటారు. నేను, మా ఆవిడ ఎంత సేపని ఒకరిని ఒకరం చూస్తూ కూర్చోవడం? అందుకే మంచి వేషాలుంటే నన్ను మర్చిపోవద్దని నలుగురైదుగురిని అడుగుతుంటా.

ఫలానా వాళ్ళుంటారు అన్నాను గభాలున. నా సినిమా అంటే మీరుండాలి, మీరు లేకపోవడమేంటి? అనే తపన నా మనసులో ఉన్నట్టుంది. అందుకే నా నోటివెంట మీ పేరు వచ్చేసింది. వెంటనే కో డైరెక్టర్‌ని పిలిచి మీ క్యారెక్టర్‌ని చెప్పించాం. వేషం పెద్దగా ఉండదు. ఏమనుకోవద్దు' అన్నారు. అతని నిజాయతీకి ముచ్చటేసింది. 'సన్నాఫ్ సత్యమూర్తి' సెట్లో ఉన్నప్పుడే నాకు పద్మశ్రీ పురస్కారం వచ్చింది. విషయం తెలిసి నిర్మాత చినబాబుగారు కేక్ తెప్పించారు. ఆయన చాలా సహృదయుడు. మంచి ఆర్టిస్టుని ప్రోత్సహించాలనే మనస్తత్వం ఉన్నవాడు. నేనంటే ప్రేమ ఉన్న నిర్మాతల్లో ఆయన ఒకడు.

### 'సింహా' చాలా స్పెషల్ !

'సింహా' సినిమా గురించి తప్పకుండా చెప్పుకోవాలండీ.

బోయపాటి శ్రీను 'ఈ వేషం మీకోసమే రాశానండీ. మీరు వేస్తేనే బావుంటుంది' అన్నప్పుడు మామూలుగానే తీసుకున్నా. కానీ సినిమా చేశాక తెలిసింది ఆయన మాటల్లోని అర్థం. చాలా పవర్‌ఫుల్ వేషం వేశాను అందులో. ఆ సినిమా అయిన తర్వాత ప్రెస్‌తో నందమూరి బాలకృష్ణ మాట్లాడుతూ "ఈ పాత్ర కోటగారు చేస్తే బావుంటుందని అనుకున్నాం. సెట్లో డైలాగులు ఆయన చెబుతుంటే చాలా ఉత్సాహంగా అనిపించింది. ఆ పాత్రకు న్యాయం చేశారు" అన్నారు.

### ఇలాంటి కెపాసిటీ ఉన్న నటుల్ని ఎంకరేజ్ చెయ్యాలి

సింహా సినిమా గుర్తొచ్చిన ప్రతిసారీ నాకు జగపతిబాబుగారు జ్ఞాపకం వస్తారు. బాబు చాలా కమిటెడ్ ఆర్టిస్ట్. చిన్న పాత్ర నుంచి ఎలాంటి వేషం ఇచ్చినా సరే తనలో తాను చాలా మథనపడతారు. హీరోగా ఒక వెలుగు వెలిగి విలన్ వేషాలకు మలుపు తీసుకోవడం ఆయన వేసిన డేరింగ్ స్టెప్. నేను విలన్‌గా నటించినవాణ్ణి కనుక, జగపతిబాబు విలన్‌గా ఎంతో బాగా చేస్తున్నారనే విషయం బల్ల గుద్ది చెప్పగలను. 'హీరో వేసినన్నాళ్ళూ వచ్చిన పేరు కన్నా, విలన్ వేషాలు వేసినప్పుడు చాలా మంచిపేరు వచ్చింది' అని బాబు ఒకసారి మీడియాతో కూడా అన్నట్టున్నారు. ఆయన టేలెంట్‌ను ప్రేక్షకులు గుర్తించారు మరి. అయితే ఇక్కడొక మాట చెప్పాలండీ.. కొందరు సొద అనుకున్నా ఫర్వాలేదు. చెప్పితీరాలి. ఎందుకంటే ఏం తక్కువ చేశారని జగపతిబాబును విలన్‌గా అందరూ ఎంకరేజ్ చేయడం లేదు? ఎక్కడెక్కడో పొరుగు భాషల వాళ్ళు పనిగట్టుకుని వచ్చి పట్టుకుపోతున్నారుగానీ, ఇక్కడి వాళ్ళు ఎందుకు కనిపించడం లేదు. ఏం అతనేం తక్కువ ఆర్టిస్టా? బావుండదా అతను చేస్తే? పోనీ ఫేస్ వాల్యూ లేదా? అసలు అతనికి ఏం తక్కువ? అయినా ఎందుకు ఎంకరేజ్ చేయరు? తెలుగులో ఇలాంటి కెపాసిటీ ఉన్న నటులు ఉన్నప్పుడు ఎంకరేజ్ చేయాలి.

జగపతిబాబు నాకు 'గాయం' నుంచే పరిచయం. ఆ సినిమాకి చేస్తున్నంతకాలం 'మీ పక్కన సీన్‌లో నిలబడాలంటే కాసింత ప్రాక్టీస్ అవసరమండీ కోటగారు' అనేవారు. ఏదో ఒక ఇంటర్వ్యూలో కూడా 'కోటగారు ఈజ్ ఎ వండర్‌ఫుల్ ఆర్టిస్ట్...' అని అన్నట్టు గుర్తు.

### వాళ్ళ మేలు మరిచిపోకూడదు

ఇవన్నీ పక్కనపెడితే జగపతిబాబు పేరు నేను ఎల్లప్పుడూ తలచుకోవాలి. ఎందుకంటారా? మా అబ్బాయి విషయంలో జగపతిబాబు, జె.డి.చక్రవర్తి చేసిన మేలు మర్చిపోకూడదు.

ఒకరోజు చక్రవర్తి మా ఇంటికి వచ్చి 'మీకెందుకండీ కోటగారు.. మీ అబ్బాయితో నేను చేయిస్తాను. అద్భుతంగా చేయగలడు' అన్నాడు.

అందుకు నేను 'హీరో వేషాలు చేయించకండయ్యా... నా మాట విని విలన్ పాత్రలు చేయించండి' అన్నా.

'మేమూ అదే అనుకుంటున్నామండీ' అన్నాడు చక్రవర్తి. అన్నట్టుగానే చాలా చక్కగా చేయించాడు. అవతల జగపతిబాబు కూడా ఎంతో సహకరించారు. మా అబ్బాయి అంత బాగా చేయగలడా? అని నేనే ఆశ్చర్యపోయాను. అంటే ఒకటండీ... సెట్లో ఎప్పుడూ ఒక కొత్త ఆర్టిస్ట్ నిలదొక్కుకోవాలంటే, ఎస్టాబ్లిష్డ్ ఆర్టిస్టు ధైర్యం చెప్పాలి. ఎదుటివారికి కాసింత ఊపిరి తిరగనివ్వాలి. వాళ్లని ప్రోత్సహించాలి. అవన్నీ చేశారు బాబు. అంతే కాదు, ఆయన నాకు చేసిన సాయం మరొకటి ఉంది. మా అబ్బాయి విషయంలోనే అదీను. ఒకరోజు స్పాట్‌కి వ్లాక ఒక సీన్‌కి అరేంజ్‌మెంట్స్ చేస్తున్నారు. అవన్నీ చూసి నా మనసు ఇబ్బందిపడసాగింది. అప్పుడు నా మానసిక పరిస్థితిని బాబుకి చెప్పా. అలాగే చేద్దాం అన్నారు.



**(ఇంకా ఉంది)**

**–డా.చల్లా భాగ్యలక్ష్మి**

**సెల్: 88850 55528**

# మహానంది



-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287

**మహారాణి మహిమాదేవి బంగారు పళ్ళెంలో ఉన్న తాంబూలాన్ని తీసి కుబేరవర్మకు అందించింది. శయనాగారంలో అటూ ఇటూ తిరుగుతున్న కుబేరవర్మ తాంబూలాన్ని అందుకుని, నోటికి అందించాడు. నములుతూ విశ్రాంతిగా ఆసనం మీద కూర్చున్నాడు.**

**'ప్రభూ.." తాంబూలం నములుతూ అంది మహిమాదేవి.**

**కుబేరవర్మ ప్రశ్నార్థకంగా చూశాడు.**

"అమ్మాయి ఆలయంలో అదృశ్యమయ్యాక స్వయంవర మండపంలో మీరొక ప్రకటన చేశారు. అమ్మాయిని అన్వేషించి సురక్షితంగా తీసుకు వచ్చిన వ్యక్తికి అమ్మాయితో వివాహం జరిపించి, రాజ్యం అప్పగిస్తామన్నారు. ఇప్పుడు ఒక సన్యాసి అమ్మాయిని మనకు అప్పజెప్పాడు. లాలసనూ, రాజ్యాన్నీ ఆయనకు ధారపోస్తారా?"

కుబేరవర్మ చిన్నగా నవ్వాడు. "నీ కుమార్తెను ఒక సర్వసంగ పరిత్యాగికి, సన్యాసికి ధారబోస్తానని భయపడుతున్నావా?"

"ఆ అనుమానం నన్ను కలవరపెడుతోంది."

కుబేరవర్మ మళ్ళీ నవ్వాడు. "ఆనాటి మా ప్రకటనను నువ్వు అర్థం చేసుకోలేదు. స్వయంవర మండపంలో ఉన్న వాళ్ళందరూ రాకుమారులే! సామాన్యులూ, సన్యాసులూ లేరు! రాకుమారులను ఉద్దేశించి చేసిన ప్రకటన అది. నిత్యనిర్మలానంద యోగి రాకుమారుడైతే, లాలసనూ, రాజ్యాన్నీ ఇవ్వ వలసి వచ్చేది. నీ సందేహం సమస్య కాదు!"

"నా మనసు ఇప్పుడు తేలికపడింది!" మహిమాదేవి తేలికగా నిట్టూర్చింది.

"నిత్యనిర్మలానంద యోగి వరుడు కాదు గురుడు" కుబేరవర్మ నవ్వుతూ అన్నాడు.

మహిమాదేవి శ్రుతి కలిపింది.

****

"మనం రాజధానికి వచ్చి నెల దాటింది..." అంతఃపుర ఉద్యానవనంలో నందితో బాటు విహారం చేస్తున్న లాలస అంది.

"అవును..."

"అపరాధుల గురించి నువ్వు అంతగా ఆలోచిస్తున్నట్టు లేదు!"

ఎందుకలా అనుకుంటున్నావు లాలసా? అనుక్షణం ఆలోచిస్తూనే ఉన్నాను. పథకం వేస్తే, అది



## జరిగిన కథ

**కా**మరూపరాజ్య సర్వసైన్యాధ్యక్షుడు రుద్రాక్షుడిని రాజద్రోహిగా నిర్ధారించి యావజ్జీవ కారాగారశిక్ష విధించాడు మహారాజు కుబేరవర్మ. రుద్రాక్షుడి కొడుకు నందికి రాజ్యబహిష్కార శిక్ష విధిస్తాడు. స్వయంవరం రోజున యువరాణి లాలసాదేవి మాయమవుతుంది. తనను అపహరించిన కళింగరత్న చెరనుంచి తప్పించుకున్న లాలసను నంది రక్షిస్తాడు. మార్గంలో ఎదురైన ఆపదలు తప్పించుకుంటూ, స్వదేశానికి చేరతారు నంది, లాలస. తల్లిదండ్రులను కలుసుకుని, జరిగినదంతా వివరంగా చెబుతుంది వారికి. నందిని యోగిగా పరిచయం చేస్తుంది. విషయం తెలుసుకున్న కుబేరవర్మ, ఆలయానికి దారితీసే సొరంగమార్గాన్ని మూయించివేస్తాడు. కళింగరాజ దంపతులు కామరూప రాజ్యానికి వచ్చి, జరిగినదానికి మన్నించమని కోరి, మహాశ్వేతాదేవి కలశం గురించి కూడా వివరిస్తారు. లేఖకుడైన నందకుడి మాటలను చాటుగా వింటాడు నంది.

ఆ తర్వాత....

ఫలవంతం కావాలి. అంతఃపురంలో ఉన్న నా చెల్లెలిని కూడా చూడకుండా నిగ్రహించుకుంటున్నానంటే ఎంత తీవ్రంగా ఆలోచిస్తున్నానో తెలుస్తుంది!"

"ఊరికే! గుర్తు చేసేందుకే అలా అన్నాను!" లాలస నవ్వింది.

నంది చెట్లూ పొదరిండ్లూ లేని బహిరంగ ప్రదేశంలో ఆగాడు. అక్కడున్న చిన్న రాతిమీద కూర్చున్నాడు. కూర్చోమన్నట్టు లాలసకు సైగ చేశాడు. లాలస అతని పాదాల దగ్గర పచ్చికమీద, కూర్చుంది. అన్ని వేళలా, అన్ని చోట్లా, అన్ని సందర్భాలలో ఇద్దరూ గురువు శిష్యురాలు లాగే కనిపించాలి. తమ ప్రవర్తన మీద ఎవ్వరికీ అనుమానం రాకూడదు!

"మనకు వివాహిత అయిన ఒక స్త్రీ కావాలి. ఆమెకు సంతానం ఉండకూడదు. ఆమె నీకు మహా విధేయురాలై ఉండాలి. నీ మాటలను వేదంలాగా భావించాలి; పాటించాలి. అలాగే ఆమె ఆస్థాన లేఖకుడి భార్య లవంగికి ఆంతరంగిక స్నేహితురాలై ఉండాలి." నంది చెప్పుకుపోతున్నాడు.

"నాకు విధేయురాలై ఉండాలా?" లాలస అంది.

"ఆ! నువ్వు ఆడమన్నట్టు ఆడాలి; పాడమన్నట్టు పాడాలి. నువ్వు చెప్పింది వినాలి; చేయమన్నది చేయాలి..."

లాలస చిరునవ్వుతో చూసింది. "నేను గీసిన గీత దాటని వాళ్ళు అంతఃపురం దాసీజనంలో ఎందరో ఉన్నారు."

"నువ్వు ఒక అబద్ధం ఆడమని చెప్తావు. నిస్సంకోచంగా, ఎందుకు అని ఎదురు ప్రశ్నించకుండా అబద్ధం ఆడాలి. అలాంటి వివాహిత, సంతానం లేని వివాహిత కావాలి మనకు!"

"ఉంది! దాని పేరు చిత్రాంగి. పెళ్ళయి రెండేళ్ళు దాటింది. దానికి పిల్లలు కలిగేలా వైద్యం చేయమని ఆస్థాన వైద్యుడికి చెప్పాను కూడా..."

"అలాగా...అయితే.."

"చిత్రాంగి మీద ఆ వైద్యుడి ఆయుర్వేదం పని చేయలేదులే!" లాలస నవ్వింది.

"చిత్రాంగి నందకుడి భార్యకు సన్నిహితురాలా?"

"సహజంగా పరిచయం ఉంటుంది. సాన్నిహిత్యం పెంచుకుంటుంది. నేను చెప్తానుగా!" లాలస అంది. "చిత్రాంగి ఏం చేయాలి? దానికి నేను ఏం చెప్పాలి?"

"జాగ్రత్తగా విను లాలసా; చిత్రాంగిని నువ్వు నా వద్దకు నెలప్పుడు తీసుకు వచ్చావు. సంతానం కలిగేలా ఆమెను దీవించమన్నావు. నేను ధ్యానం చేసి దీవించాను. దీవెన ఫలించింది. ఆమెకు నెల తప్పింది. ఆ శుభవార్తనూ, నా దీవెన మహిమనూ చిత్రాంగి లేఖకుడి భార్యకు చెప్పాలి. సంతాన ప్రాప్తిని అనుగ్రహించే దీవెన కోసం నన్ను ఆశ్రయించమని లవంగికి బోధించాలి..."

లాలస చిరునవ్వుతో చూసింది. "నిత్యనిర్మల నంద యోగిపుంగవుల ఆశీస్సుల ప్రభావంతో చిత్రాంగి గర్భవతి అయ్యింది. ఆ స్వామివారిని ఆశ్రయిస్తే తన కడుపు కూడా పండుతుందని లవంగి నమ్మాలి. ఇది చిత్రాంగి ద్వారా జరగాలి. అంతేగా?"

"అంతే కాదు; లవంగి నీ ద్వారా, నీ సహకారంతో నన్ను దర్శించి, ప్రార్థించాలి."

"అంతేగా?"

"అంతే! లవంగికి బాగా నూరిపోసేలా చిత్రాంగికి నువ్వు నూరిపోయగలవా?"

"నేను చిన్న నాటకం ఆడుతాను, చెప్పనా?" లాలస అడిగింది.

నంది తలాడించాడు.

"చిత్రాంగి ముందు లవంగి పట్ల జాలీ, కరుణా కలిగినట్లు నటిస్తాను. తనకు స్వామివారి దీవెన ఫలించి, నెల తప్పిందని చిత్రాంగితో నమ్మబలికి తీసుకురమ్మంటాను. తనకూ సంతాన వరం ఇప్పించమని చిత్రాంగి నన్ను తప్పకుండా అడుగుతుంది. చెప్పిన పని చేస్తే తప్పకుండా ఇప్పిస్తానంటాను."

"ఇదంతా పరమ రహస్యంగా జరగాలి. చిత్రాంగిని నువ్వు తగిన విధంగా హెచ్చరించాలి!"

"అది నాకు వదిలెయ్. నటించడం వచ్చు.



గంగిరెడ్డుల వాడి గర్భిణి భార్యగా నటించాను. సన్యాసినిగా నటించాను. పోతే నటింపజెయ్యడం కూడా వచ్చు. 'నంది'ని కూడా సన్యాసిగా నటింప జేస్తున్నాను!"

"కాదనలేను..."

లాలస నంది వైపు ప్రశ్నార్థకంగా చూసింది. "నాకొక సందేహం కలుగుతోంది. రాజధానికి రాగానే భుజబలంతో దోషుల్ని పట్టుకుని శిక్షిస్తావను కున్నాను. దానికి భిన్నంగా ప్రవర్తిస్తున్నావు. ఎందుకు?"

నంది చిన్నగా నవ్వాడు. "భుజబలాన్ని మించిన బలం మరొకటి ఉంది. అది బుద్ధిబలం. కత్తి పదునును మించిన పదునైన, బలమైన ఆయుధం అది. ప్రస్తుత పరిస్థితిలో మనం ఉప యోగించాల్సింది బుద్ధిబలం. నేను భుజబలంతో నందకుడిని లొంగదీసి నిజం చెప్పించవచ్చు. తెర వెనుక దాగిన దోషులు ఎవరో తెలుసుకోవచ్చు. వాళ్ళను అంతం చేయవచ్చు. ఆ విధంగా దోషు లను శిక్షించగలను కానీ, నిర్దోషులను విడుదల చేయలేను!"

"ఔను.." లాలస సాలోచనగా అంది.

"ఇక్కడ అపరాధులను శిక్షించాల్సిందీ, నిరప రాధులను రక్షించాల్సిందీ మహారాజుగారే! అది ఆయన విధి."

"అర్థమైంది..."

"మహారాజుగారికి నేనెవరో తెలియకూడదు; నేరస్థులెవరో తెలియాలి.." నంది అన్నాడు.

"ఎవరో ఒకరు చెప్పకుండా నాన్నగారికి ఎలా తెలుస్తుంది?"

నంది చిన్నగా నవ్వాడు. "ఎవరో ఒకరు కాదు; నేరం చేసినదెవరో నేరస్థులే చెప్పాలి!"

లాలస ఆశ్చర్యంగా చూసింది. "నేరస్థులు చెప్పాలా? చెప్తారా?"

"నువ్వు చిత్రాంగిని సిద్ధం చెయ్యి లాలసా!" అంటూ నంది రాతి మీద నుండి లేచాడు.

***

మరుసటి ఉదయం తన విడిదిలో కూర్చున్న నంది చేయబోయే కార్యం గురించి ఆలోచిస్తు న్నాడు. చిన్న చప్పుడుతో తలుపులు తెరుచుకు న్నాయి. నంది కళ్ళు తెరవలేదు. అనుమతి లేకుండా, స్వేచ్ఛగా ఎవరు తన విడిదిలోకి వస్తారో అతనికి తెలుసు...

"గురుదేవులు ధ్యానంలో ఉన్నారు" లాలస కంఠం.

నంది తనలో తానే నవ్వుకున్నాడు. మెల్లగా కళ్ళు తెరిచాడు. ద్వారం దగ్గరగా యువరాణి లాలస, ఆమె వెనుక ఇద్దరు స్త్రీలూ నిలుచున్నారు. ఒకరు నందకుడి భార్య లవంగి. రెండవ స్త్రీ చిత్రాంగి అయ్యుంటుంది.

"గురుదేవులకు ప్రణామం.." చేతులు జోడించి, అతనివైపు నడుస్తూ అంది లాలస. ఈ మహిళలు ఇద్దరూ నాకు సన్నిహితులు. ఈమె పేరు చిత్రాంగి.."

"తెలుసు...ఆ ఇల్లాలు సంతానార్థం మా ఆశీ స్సులు స్వీకరించింది.." నంది చిత్రాంగి వైపు 'అర్థమైందా?' అన్నట్టు చూస్తూ అన్నాడు.

చిత్రాంగి చేతులు జోడించింది. "చిత్తం స్వామీ...తమ ఆశీస్సు ఫలించింది. ఆ అద్భుతాన్ని నా స్నేహితురాలికి ఇదిగో ఈ లవంగికి చెప్పాను. సంతానం కోసం లవంగి కట్టని ముడుపు లేదు, పట్టని వ్రతం లేదు, నోచని నోము లేదు. తమరు దయ చూపాలి.." చిత్రాంగి వినయంగా అంది.

"ఇలా ముందుకురా తల్లీ!" నంది లవంగి వైపు తదేకంగా చూస్తూ అన్నాడు.

"వెళ్ళు లవంగీ, గురుదేవుల పాదాలకు నమస్క రించు" లాలస హెచ్చరించింది.

లవంగి నంది పాదాలకు నమస్కరించింది.

"పరమేశ్వరార్పణం!" నంది అన్నాడు.

"గురుదేవా...లవంగికి సంతానం కలిగేలా దీవించాలి మీరు" లాలస అంది.

నంది మౌనంగా తల పంకించాడు. తన ముందు చేతులు కట్టుకుని వినయంగా నిలుచున్న లవంగి వైపు ప్రసన్నంగా చూశాడు. "నువ్వు ఆ దర్పణం ముందు నిలబడు తల్లీ!" అన్నాడు నిలువు టద్దం వైపు చేత్తో చూపుతూ.

లవంగి భయభక్తులతో అద్దం ముందుకు అడుగులు వేసింది.

"యువరాణీ, మా సంభాషణ మీరు విన కూడదు...." నంది అన్నాడు.

**మనం రాజధానికి వచ్చి నెల దాటుతున్నా నువ్వింకా అపరాధుల గురించి ఆలోచిస్తున్నట్టు లేదు అంటూ నిందించింది లాలస. అందుకు నంది నవ్వుతూ, ఎందుకలా అనుకుంటున్నావు లాలసా? అనుక్షణం అపరాధులు ఎవరా అన్నదే నా ఆలోచన. పథకం సిద్ధమైంది. ఇక ఆచరణలో పెట్టడమే ఆలస్యం అన్నాడు. నంది వేసిన పథకం ఏమిటి? అందుకు లాలస ఏమన్నది?**

లాలస వినయంగా తల వాల్చింది. "అలాగే గురుదేవా! మేం వెలుపల ఉంటాం."

లాలస ద్వారం వైపు నడిచింది. చిత్రాంగి ఆమెను వెంబడించింది. ఇద్దరూ గుమ్మం దాటారు. చిత్రాంగి తలుపుల్ని నెమ్మదిగా మూసింది.

నంది అద్దం ముందు నిలుచున్న లవంగి వైపు వెళ్ళాడు.

"అమ్మా, నేను అద్దంలో నీ ప్రతిబింబం వైపు చూస్తూ మాట్లాడుతాను. నేను అడిగే ఒకటి రెండు ప్రశ్నలకి సమాధానాలు చెప్పు. నిజాలే చెప్పాలి సుమా!"

"అలాగే స్వామీ" లవంగి అద్దంలోకి చూస్తూ అంది.

"నీ పతిదేవుడు ఏం చేస్తాడమ్మా!"

"ఆయన...ఆయన...ఆస్థాన లేఖకుడు.." లవంగి తడబడుతూ అంది.

"ఆస్థాన లేఖకుడా? అంటే.."

"అవును స్వామీ... ఆయన వేసిన పూల మాలను తమరు తీసి పడవేశారు."

"గుర్తొచ్చింది. నీ భర్త విధినిర్వహణలో పాపం చేశాడమ్మా. రెప్ప వేయకుండా చూడు తల్లీ.." అంటూ నంది తదేకంగా ప్రతిబింబం కళ్ళలోకి చూశాడు.

"నీ భర్త చేసిన పాపాల నీడలు నీ కళ్ళల్లో నాకు కనిపిస్తున్నాయమ్మా. అతను పాపం చేశాడు. పాపం చేసినందుకు ప్రతిఫలం స్వీకరించాడు..."

"అవును స్వామీ" లవంగి కంఠం వణికింది.

"ఇలా నావైపు తిరుగు తల్లీ.." అన్నాడు నంది.

లవంగి అతని వైపు తిరిగి చూసింది. నంది చూపుడు వేలిని కనుబొమల మధ్య ఉంచుకుని కళ్ళు మూసుకున్నాడు. "నిజం చెప్పు తల్లీ. తన చేత్తో తీసుకున్న ప్రతిఫలాన్ని, నీ చేతికి అందిం చాడు. అవునా అమ్మా?"

"అవును స్వామీ.." కళ్ళు మూసుకున్న నంది వైపు ధైర్యంగా అంది లవంగి.

నంది కళ్ళు తెరిచి, ఆమెవైపు తీక్షణంగా చూశాడు. "అవి.."

"అవి...రెండు...ఒకటి..." లవంగి వణికే కంఠంతో ప్రారంభించింది.

"ఆ వివరాలు మాకు అవసరం లేదు తల్లీ..."



నంది వారిస్తూ అన్నాడు. "గతంలో కూడా నీ భర్త ప్రవర్తనలో లోపాలున్నాయి. భర్త పాపాల ఫలితం భార్య అనుభవించాలి. అందుకే నీకు సంతానం కలగలేదు. మనిషి పాపాలను ప్రక్షాళించుకోవాలమ్మా.."

"అ..అవును స్వామీ.."

"కదా! భర్త చేసిన పాపాలను భార్య ప్రక్షాళన చేయవచ్చు. ఏ విధంగా అంటే భర్త పాపకర్మ ఫలంగా తెచ్చిన ఆహారం తినకుండా, పాపకర్మల ఫలంగా తెచ్చి ఇచ్చిన వస్త్రాలను ధరించకుండా...ఇలాగే అన్నమాట. అర్థమైందా తల్లీ?"

"అర్థమైంది స్వామీ!"

"జ్ఞాననేత్రంతో చూసి చెబుతున్నాను. జాగ్రత్తగా విను. నీ భర్త ఇటీవల చేసిన పాపం సంతాన ప్రాప్తికి ఆటంకం కలిగిస్తోంది. ఆ పాప ఫలం నీ గృహంలో ఉన్నంత కాలం మా దీవెన ఫలించదు.."

"స్వామీ..."

"ఆందోళన వద్దు తల్లీ. ఆ పాపాలకు లభించిన ప్రతిఫలాలను నువ్వు పరిత్యజించాలి."

"ఏం చేయాలో ఉపదేశించండి స్వామీ..."

"పరిత్యజించడం ద్వారా పాప ప్రక్షాళన జరిగాక మా దీవెన ఫలిస్తుంది. నీ కడుపు పండుతుంది. ఆ త్యాగం చేయగలవా?"

"చేస్తాను స్వామీ...ఆజ్ఞాపించండి."

"ఆ పాప ప్రతిఫలాన్ని అమ్మవారికి అర్పించు. మానవ మాత్రులు ఎవ్వరూ దానిని జీర్ణం చేసుకోలేరు. ఇవాళ దీపాల వేళకు నువ్వు ఆ పాపఫలాన్ని మూటకట్టి కామరూపాంబిక ఆలయానికి రా. మేము నీకోసం అక్కడుంటాం. మంత్రపూర్వకంగా, సంకల్పపూర్వకంగా అమ్మవారి 'కొప్పెర'లో సమర్పించుదాం. తదనంతరం ఆ దేవి సమక్షంలో నిన్ను దీవిస్తాం!"

"అలాగే స్వామీ, తప్పకుండా వస్తాను" లవంగి ఉత్సాహంగా అంది.

"వెళ్ళిరా తల్లీ. ఇదంతా పరమ రహస్యం. యువరాణిగారూ, చిత్రాంగి అడిగితే, సాయంత్రం ఆలయంలో ఆశీర్వదిస్తారు అని మాత్రమే చెప్పు!"

"చిత్తం!" అంటూ లవంగి తల వాల్చి నమస్కరించింది.

"పరమేశ్వరార్పణం!" నంది చిరునవ్వుతో అన్నాడు.

"స్వామీ! గతంలో చేసిన పాపాలు.." లవంగి అనుమానంగా అంది.

"అన్నింటినీ ఆ తల్లి దహించివేస్తుంది. ధైర్యంగా వెళ్ళి, ధైర్యంగా ఆలయానికి రామ్మా" నంది అన్నాడు.

***

నంది కామరూపాంబిక ఆలయంలో గర్భాలయం ముందున్న మండపంలో విగ్రహానికి అభిముఖంగా నిలుచున్నాడు. గర్భాలయంలో నేతి దీపాలు ఘుమఘుమలాడుతూ వెలుగుతున్నాయి. తన ప్రయత్నం ఫలించేలా చేయమని నంది కామరూపాంబికకు మొక్కుకున్నాడు.

"స్వామీ.."

అర్చకుడి పిలుపు విని నంది ద్వారం వైపు తిరిగాడు.

"ఆస్థాన లేఖకుడి ధర్మపత్ని తమ కోసం వచ్చింది" అర్చకుడు అన్నాడు.

"ఆ ఇల్లాలిని ఇక్కడికి రమ్మనండి ఆచార్యా" అన్నాడు నంది.

అర్చకుడు వెలుపలకి వెళ్ళి లవంగిని వెంటబెట్టుకు వచ్చాడు. ఆమె చేతుల్లో పసుపు గుడ్డతో కట్టిన మూట ఉంది. నంది అర్చకుడి వైపు చూశాడు.

"ఆచార్యా! ఈ సాధ్వికి మంత్రోపదేశం చేయాలి. కాసేపు మీరు..." అంటూ నంది ద్వారం వైపు చేయి చూపించాడు.

"చిత్తం.. అవశ్యం.." అంటూ అర్చకుడు ద్వారం వైపు వెళ్ళాడు.

అతను గడప దాటగానే నంది తలుపులు మూసి గొళ్ళెం బిగించాడు. లవంగి దగ్గరగా నడిచాడు. లవంగి అతని వైపు వినయంగా చూసింది.

"అనుకున్నవన్నీ అర్పించడానికి తెచ్చావా

## మనమీదేనర్రోయ్!

సరసి





తల్లీ?"

"తెచ్చాను స్వామీ..."

నంది మెప్పుగా తల పంకించాడు. "చేసిన పాపం చెప్పుకుంటే పోతుంది అన్న సామెత విన్నావా అమ్మా?"

"...విన్నాను స్వామీ."

"నేను సంకల్పం చేసి, అంబికను ప్రార్థించి, నిన్ను ఆశీర్వదిస్తాను. దానికి నాందిగా పాప ప్రక్షాళన కార్యంగా ఆ నగలు నీ భర్తకు ఏ విధంగా లభించాయో స్పష్టంగా, నిస్సంకోచంగా ఈ దేవత సన్నిధిలో, ఆమె సాక్షిగా నాకు వినిపించు తల్లీ! అన్నట్టు ఆ వివరాలు నీకు తెలుసుగా?"

"అమ్మవారి సన్నిధిలో అబద్ధమాడను స్వామీ. తెలుసు. విన్నవించుకుంటాను. ఒక చిన్న ప్రార్థన.."

"ఏమిటి తల్లీ?"

"ఇది పరమరహస్యం. నా పసుపు కుంకుమల భవిష్యత్తు ఈ రహస్యం మీద ఆధారపడి ఉంది స్వామీ! తమరు...తమరు...విని, మరిచిపోవాలి స్వామీ..." లవంగి ప్రాధేయపూర్వకంగా చూస్తూ అంది.

నంది చిన్నగా నవ్వాడు. "నేను అన్నింటినీ వదులుకున్న విరాగిని తల్లీ. నీ భర్త మాల వేయగానే, ఆ స్పర్శతో కొంత తెలుసుకున్నాను. నా జ్ఞాన నేత్రంతో నేను స్వయంగా తెలుసుకోగలను. నువ్వు చెప్పాల్సిన అవసరం లేదు తల్లీ! చేసిన పాపం చెబితే పోతుందన్న సువర్ణ సూత్రం పట్ల ఉన్న విశ్వాసాన్నీ, గౌరవాన్నీ దృష్టిలో ఉంచుకుని చెప్పమన్నాను. నీ నోటితో నువ్వు నాకు చెప్పనవసరం లేదు; నా జ్ఞాన నేత్రంతో జరిగిన దానిని, నీ భర్త చేసిన తప్పిదాన్ని అద్దంలో ప్రతిబింబంలాగా స్పష్టంగా చూడగలను! వ్యక్తిగత రహస్యాలను మరొక చెవిలో వేసే అవసరం ఈ సర్వసంగ పరిత్యాగికి లేదు తల్లీ.."

"క్షమించండి స్వామీ! ఆందోళన నా నోట ఆ విధంగా పలికించింది" లవంగి సిగ్గుపడుతూ అంది.

"మంచిది. ముహూర్తం మించిపోకూడదు. మూట విప్పి అందులోని సాక్ష్యాలు కామరూపాంబిక దర్శించేలా పట్టుకో. అవి నీకు ఎలా లభించాయో, ఆ కానుకలు నీ భర్తకు ఎందుకు లభించాయో స్పష్టంగా, నిస్సంకోచంగా చెప్పుకో. నేను వింటాను. ఆ తల్లి ఆలకిస్తుంది. చెప్పినంత సేపూ కళ్ళు మూసుకునే ఉండాలి తల్లీ. నేను హెచ్చరించేదాకా కళ్ళు తెరవకూడదు సుమా!" నంది వివరించాడు.

లవంగి తల ఊపుతూ మూట విప్పింది. అందులో ఉన్న వజ్రాలహారాన్నీ, ముత్యాలహారాన్నీ రెండు చేతుల్లో పట్టుకుంది. కామరూపాంబిక విగ్రహం వైపు దీనంగా, ఆర్ద్రంగా చూసింది. నంది వైపు చూపులు తిప్పింది.

"కళ్ళు మూసుకుని ప్రారంభించమ్మా. అంబిక ఆలకిస్తుంది!" అన్నాడు నంది. "సత్యమే చెబుతానని కామరూపాంబిక మీద ప్రమాణం చేసి ప్రారంభించు!"

## సల్మాన్‌ని అదే అడుగుతుందట!



ఐదు పదుల వయస్సున్న సీనియర్ బాచిలర్ సల్మాన్‌ఖాన్ పెళ్ళి గురించి బయట వారికే కాదు, హీరోయిన్లకూ బోలెడన్ని అనుమానాలు ఉన్నట్టున్నాయి. అందుకే సోనాక్షి ఓ ఇంటర్వ్యూలో ఈ విధంగా చెప్పుకొచ్చింది. తనకే కనుక సల్మాన్‌ని ఇంటర్వ్యూ చేసే అవకాశం వస్తే మొట్టమొదట అతగాడు ఎప్పుడు పెళ్ళి చేసుకుంటాడో అడిగి తెలుసుకుంటాను అని చెప్పుకొచ్చింది. బాలీవుడ్‌లో ఇంటా బయటా కూడా సల్మాన్ పెళ్ళి గురించి తెగ టెన్షన్ పడుతుంటే సల్మాన్ మాత్రం నిమ్మకు నీరెత్తినట్టుగా వ్యవహరిస్తున్నాడు అని బాలీవుడ్ జనాలు తెగ టెన్షన్ పడుతున్నారు.

ఒకసారి అమ్మవారి విగ్రహం వైపు చూసి, కళ్ళు మూసుకుని లవంగి ప్రారంభించింది. "కామరూపాంబికా దేవి మీద ప్రమాణం చేసి సత్యమే చెబుతాను. ఈ వజ్రాలహారాన్నీ, ముత్యాలహారాన్నీ నా భర్త నందకుడు నాకు ఇచ్చాడు. తన హస్త లాఘవంతో వీటిని సంపాదించానన్నాడు. నేను వివరం అడిగాను. సర్వసైన్యాధ్యక్షుడుగా విధి నిర్వహించిన రుద్రాక్షుడుగారు వ్రాసినట్టు ఒక కల్పిత లేఖను లిఖించి, రుద్రాక్షుల వారి చేవ్రాలు తానే చేశానన్నాడు. ఆయన ఇంటిలోంచి వజ్రాలహారాన్నీ తెలివిగా కాజేశానన్నాడు. లేఖ వ్రాసినందుకు రుద్రాక్షులవారు బహూకరించినట్టు మహారాజుగారికి మనవి చేశానన్నాడు. రాజుగారు ముత్యాలహారం బహూకరించారని చెప్పాడు.

ఈ ఆభరణాలు నా భర్త ధర్మబద్ధంగా సంపాదించినవి కావు. ఇది అక్రమార్జన. కామరూపాంబికకు సమర్పించుకుంటున్నాను. ఆ జగజ్జనని... నా భర్త చేసిన పాపాలను క్షమించాలని వేడుకుంటున్నాను.." లవంగి గద్గద స్వరంతో అని, ఆగింది.

"చక్కగా విన్నవించుకున్నావు తల్లీ. నీ భర్త పాపాలను ప్రక్షాళన చేశావు. ఇంక కళ్ళు తెరు!" నంది హెచ్చరించాడు.

లవంగి వినయంగా కళ్ళు తెరిచింది. ఎదురుగా ఉన్న దృశ్యాన్ని చూసి కెవ్వుమంది. ఆమె చేతిలోంచీ వజ్రాలహారమూ, ముత్యాలహారమూ జారి కింద పడిపోయాయి. తూలి పడబోతూ నిలదొక్కుకుని, లవంగి భయం నిండిన కళ్ళతో చూసింది. నందికి కొంచెం దూరంలో తనవైపు చూస్తూ ఇద్దరు నిలుచున్నారు. ఒకరు యువరాణి లాలస, మరొకరు మహారాజు కుబేరవర్మ.

లవంగి భయంతో వణికిపోతున్న శరీరాన్ని అదుపులో పెట్టుకోవడానికి వ్యర్థ ప్రయత్నం చేస్తోంది. మహారాజు కళ్ళు చింతనిప్పుల్లా ఎర్రగా ఉన్నాయి. ఆ కళ్ళ మీద గుబురు కనుబొమలు మధ్యలో కలుసుకున్నాయి. ఆగ్రహం స్పందన రూపంలో ఆయన దవడల మీద ప్రత్యక్షమవుతోంది. తీక్షణమైన ఆయన చూపుల్ని తట్టుకోలేకపోతున్న లవంగి తలను వాల్చింది.

కుబేరవర్మ నిట్టూర్పు రూపంలో తన ఆగ్రహాన్ని వెళ్ళగక్కుతూ, నంది వైపు తిరిగాడు. ఆయన ఎర్రటి కళ్ళల్లో ఇప్పుడు భయభక్తులు తాండవిస్తున్నాయి.

"స్వామీ, మీరు త్రికాలజ్ఞులు. ఆ భగవంతుడే మిమ్మల్ని ఇక్కడికి పంపించాడు!" అన్నాడు కుబేరవర్మ.

నంది చిరునవ్వు నవ్వాడు. "సాధ్వి లవంగి అమ్మవారి సన్నిధిలో సత్యం పలికింది. ఆమె పలికిన సత్యాన్ని స్వీకరించండి."

"స్వామీ, ఈ సందేహాన్ని కూడా తీర్చండి. లవంగి భర్త నందకుడు ఎందుకు ఆ దుష్కార్యం చేశాడు?"

"మీ సందేహాన్ని తీర్చవలసిన వాడు నందకుడే మహారాజా! రేపు ఉదయం కొలువు కూటంలో సభాసదుల సమక్షంలో, అతని ఇల్లాలి ముందు నందకుణ్ణి ప్రశ్నించండి. ఎందుకు చేశాడో, ఎవరి కోసం చేశాడో బహిరంగంగా వెల్లడి చేయించండి."

"ఎవరి కోసమో అంటున్నారు... అంటే ఈ కుబేరవర్మ నిరపరాధుల్ని శిక్షించాడా?" కుబేరవర్మ అన్నాడు.

"సింహాసనం మీద ఆసీనులు కండి. ధర్మ దండం పట్టుకోండి. ప్రథమ అపరాధి అయిన నందకుడిని ప్రశ్నించండి. మీ సందేహాలు నివృత్తి అవుతాయి" నంది అన్నాడు.

"భద్రకా!" కుబేరవర్మ కంఠం గర్భాలయంలో మారుమ్రోగింది.

సహాయ సేనాని భద్రకుడు తలుపు తెరుచుకుని వచ్చాడు. "ప్రభూ"

"నందకుడి భార్య లవంగిని అంతఃపురంలోని కక్ష్యలో బంధించి ఉంచాలి!"

"ఆజ్ఞ!"

**(ముగింపు వచ్చేవారమే)**

# కిడ్నీలో రాళ్ళు

మూత్రపిండాల్లో రాళ్ళు ఏర్పడటం అనేది ఈ మధ్యకాలంలో చాలా ఎక్కువగా జరుగుతుంది. ఒక సర్వే ప్రకారం భారతదేశంలో పురుషుల్లో 10.6% మందిలో మరియు స్త్రీలలో 7.1% మందిలో ఈ సమస్యతో బాధపడుతున్నారు. దీనికి మారిన జీవనశైలి, ప్రపంచ ఆధునీకరణ, మారిన ఆహార అలవాట్లు, స్థూలకాయం వంటివి ప్రధాన కారణాలుగా భావించవచ్చు. ఇది మన శరీరం యొక్క భారీ కర్మాగారం. ఇందులో నిరంతరం రకరకాల జీవక్రియలు జరిగిపోతూనే ఉంటాయి. వీటిని బయటకు పంపించంటంలో మూడు అవయవాలు కీలకపాత్ర పోషిస్తుంటాయి. మూత్రపిండాలు, ఊపిరితిత్తులు, చర్మం ఈ మూడు ముఖ్యమైన విసర్జక అవయవాలు. మళ్ళీ వీటిలో కూడా 90% మలినాలను విసర్జించేవి మూత్రపిండాలే. మూత్రపిండాలు రక్తంలోని విషపదార్థాలను అదనంగా ఉన్న నీటిని క్రమంగా తొలగిస్తుంటాయి. మన కిడ్నీలు ప్రతీరోజు 200 లీటర్ల రక్తాన్ని వడపోస్తాయి.

నేటి ఉరుకు పరుగుల జీవితాల్లో చాలామంది సరిపడా నీళ్ళు కూడా తాగలేకపోతున్నారు. ఫలితంగా ఈ కిడ్నీ రాళ్ళతో సతమతమయ్యే వారి సంఖ్య నానాటికీ పెరిగిపోతుంది. చాలా సందర్భాల్లో ఈ రాళ్ళు చాలా చిన్నవిగా ఉంటూ మూత్రంలో విసర్జింపబడతాయి. కొన్ని సందర్భాల్లో రాళ్ళు పరిమాణం పెద్దగా ఉండటం కాని, మూత్రనాళాల్లో చిక్కుకొని తీవ్రమైన నొప్పిని కలిగిస్తాయి.

**కారణాలు:** అధిక బరువు, ద్రవపదార్థాలు తీసుకోకపోవటం. మూత్రఅవయావాల్లో వచ్చే ఇన్‌ఫెక్షన్. నీరు తగినంత తాగకపోవడం. జన్యుపరమైన ఇన్‌ఫెక్షన్‌లు. ఎక్కువగా వేడి వాతావరణంలో ఉండటం. వంశపారంపర్యం. కొన్ని రకాల మందులు వాడటం.

**లక్షణాలు:** పొత్తికడుపులో తీవ్రమైన నొప్పి, నీరసం, వికారం, తీవ్రమైన జ్వరం. విపరీతమైన చమటలు, బరువు తగ్గడం. మూత్రంలో రక్తంపడటం (దీన్ని హిమచ్యూరియా అంటారు) మూత్రంలో మంట రావటం. మూత్రంలో చీము రావడాన్ని పైయూరియా అంటారు.




**జాగ్రత్తలు:** నీటిని ఎక్కువగా తాగాలి, నీరుగాని ఇతర ద్రవ పదార్థాలు గాని మొత్తంగా కలిపితే రోజుకు 4 లీటర్లు తగ్గకుండా తీసుకోవాలి. కిడ్నీలో అప్పటికీ ఆక్సలేట్ రాళ్ళు ఉంటే, ఆక్సలేట్ ఉండే పదార్థాలు అంటే చాక్‌లేట్, పాలకూర, సోయా, ఎండు చిక్కుడు ధాన్యాలాంటివి తీసుకోకుడదు. కాల్షియం సిట్రేట్‌కు కిడ్నీలో రాళ్ల ఏర్పడకుండా నివారించే లక్షణం ఉంది కాబట్టి అవి శరీరానికీ అందేలా ఆహార నియమాలను పాటించడం మంచిది. కూల్‌డ్రింకులను అస్సలు తాగకూడదు.



**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**

**నిర్ధారణ పరీక్షలు:** కిడ్నీ ఎక్స్‌రే, అల్ట్రాసౌండ్ స్కాన్ & కిడ్నీ పరీక్ష, రక్తపరీక్ష, మూత్ర పరీక్ష.

**హోమియో చికిత్స:** హోమియోపతిలో శారీరక, మానసిక, లక్షణాలను పరిగణలోకి తీసుకొని ఎలాంటి సర్జరీ అవసరం లేకుండానే కిడ్నీలోరాళ్ళ పరిమాణం మరియు అవి ఏ వైపున ఏర్పడ్డాయో వాటి ఆధారంగా మంచి మందులు అందుబాటులో ఉన్నాయి. ముఖ్యంగా బెరిబెరి వల్గరీస్, సరసపరిల్ల, కల్కేరియకార్బ్, కోలోసింత్ మందులను డాక్టర్ పర్యవేక్షణలో వాడాలి.



# ఆయుర్వేదంతో మైగ్రేన్ మటుమాయం

భరించరాని తలనొప్పి, మామూలు తలనొప్పిలా గంటో, కొద్దిసేపో వేధించి వెళ్ళిపోదు, రోజుల తరబడి తలలో ఒకవైపే తీవ్రమైన నొప్పి ఉందంటే అది మైగ్రేన్‌గా భావించాలి. పార్శ్వపు నొప్పిగా వ్యవహరించే మైగ్రేన్‌ను ఆయుర్వేద చికిత్సతో సమూలంగా, శాశ్వతంగా నయం చేయవచ్చని అంటున్నారు ప్రముఖ ఆయుర్వేద వైద్యనిపుణురాలు డాక్టర్ లక్ష్మి..

నేటి ఆధునికజీవతంలో మానసికఒత్తిడి, నిద్రలేమి సర్వ సాధారణమైన సమస్యలు. వీటి కారణంగా తలనొప్పి రావడం మామూలే. అంతేగాక ఎండలో తిరగడం, భౌగోళిక ఉష్ణోగ్రతలు పెరగడంవంటి కారణాల వల్ల కూడ తలనొప్పి వస్తుంది. మెదడులో జరిగే రసాయనిక మార్పులు, నరాల పనితీరులో జరిగే మార్పులే తలనొప్పి కి ప్రధాన కారణాలని చెప్పవచ్చు. మైగ్రేన్ అనే వ్యాధిని ఆయుర్వేదంలో శిరశ్శూల లేదా పార్శ్వపు తలనొప్పి అని అంటారు. **ప్రధాన కారణాలు:** తలనొప్పి లేదా మైగ్రేన్ సమస్యతో బాధపడేవారి సంఖ్య రోజురోజుకూ పెరుగుతుంది. తలనొప్పి రావడానికి వివిధ కారణాలు ఉన్నాయి. ప్రస్తుత యాంత్రిక జీవితంలో పగలు నిద్రపోయి రాత్రిళ్ళు మేలుకుని చేసే ఉద్యోగాలు, దీనికారణంగా జీవనశైలిలో వచ్చే మార్పులు వంటివి కూడా మైగ్రేన్ రావడానికి ప్రధాన కారణాలు. మైగ్రేన్ తలనొప్పి తలలో ఒక వైపు మాత్రమే వస్తుంది. తీవ్రంగా వచ్చే ఈ నొప్పిని భరించడం చాలాకష్టంగా ఉంటుంది. కనుబొమలు, కనుగుడ్ల చుట్టూ నొప్పి అధికంగా ఉంటుంది. నొప్పికారణంగా వాంతులు అవుతుంటాయి. నిద్రలేమి, మానసిక ఒత్తిడివల్ల నొప్పి పెరుగుతుంది. మద్యపానం, మత్తుపదార్థాల సేవనం, ధూమపానం, వేళకు ఆహారం తీసుకోకపోవడం వంటి కారణాలు కూడా మైగ్రేన్‌కు దారితీస్తాయి. అలాగే వేసవి ఎండలో సూర్యకిరణాల ప్రభావం, ఎక్కువ సేపు టీవీచూడటం, కంప్యూటర్ ముందు ఎక్కువ సేపు పని చేయడం వల్ల కూడా ఈ సమస్య ఏర్పడుతుంది. **మైగ్రేన్‌రకాలు:** అన్ని తల నొప్పులకు మైగ్రేన్‌గానే భావించకూడదు. టెన్షన్ లేదా మానసిక ఆందోళన కారణంగా వచ్చే తలనొప్పిని టెన్షన్ హెడ్‌ఏక్ అంటారు. మానసిక ఒత్తిళ్ళు, ఆఫీసుల్లో వచ్చే సమస్యలు, కుటుంబ సమస్యలు ఉన్నవారికి టెన్షన్ హెడ్‌ఏక్ వస్తుంది. ఈ తలనొప్పి ఉదయం కంటే సాయంత్రం ఎక్కువగా ఉంటుంది. కొన్నిసార్లు తల తిరగడం జరుగుతుంది.తలనొప్పితో పాటు కడుపునొప్పి రావడాన్ని అబ్డామినల్ మైగ్రేన్ అంటారు. వెన్నుసమస్యల కారణంగా కూడా తలనొప్పి రావచ్చు. **ఎవరికి వస్తుంది?:** సాధరణంగా మైగ్రేన్ 20-30సం॥ల లోపు వారికి వస్తుంది. చిన్న వయస్సులో 6 నుండి 7 సం॥రాల మధ్య పిల్లల్లోనూ ఈ తలనొప్పి వస్తుంది. బాలుర కంటే బాలికలలో పార్శ్వపు నొప్పి ఎక్కువగా వస్తుంది. వంశపారంపర్యంగా కూడా ఈ తలనొప్పి వస్తుంది. **ముందుజాగ్రత్తలు:** అల్కహాలు, మత్తుపదార్థాలు సేవించకూడదు. ప్రతినిత్యం సరైనసమయానికి ఆహారం తీసుకోవాలి. రాత్రివేళ సమయానికి నిద్రపోవాలి.ఎండలో వెళుతున్నప్పుడు, టీవీ చూసేటప్పుడు, కంప్యూటర్‌పై పనిచేసేటప్పుడు యాంటీగ్లేర్‌కళ్లద్దాలు పెట్టుకోవాలి. చైనీస్ ఫుడ్‌లో వాడే అజీనోమోటోను వాడకూడదు. **ఆయుర్వేద వైద్యం:** ఆయుర్వేదశాస్త్రంలో మైగ్రేన్‌ని అర్థావ చేదికంగా వర్ణించారు.ముఖ్యంగా ఇది వాతనిదానం వల్ల వస్తుంది. అంటే ఎక్కువగా వేపుడు పదార్థాలు తినడం. ద్విచక్ర వాహనాలపై ఎక్కువగా ప్రయాణం చేయడం, మలమూత్రాదివేగాలను ఆపటం,అధికంగా శ్రమించడం, అధిక వ్యాయామం వంటివి వాత కారణాలుగా చెప్ప వచ్చును. ఈ వాత ప్రకోపంచెంది. తలలో సగభాగాన చేరి మన్యశిరలు, కనుబొమలు,కణతలు, చెవులు, కళ్ళు, నుదురువంటి అవయవాల సగభాగాన్నిశస్త్రంతో వేదించి నట్లు తీవ్రమైన బాధ కలుగుతుంది. అందుకే దీనిని అర్థావచేదికంగా ఆయుర్వేద ఆచార్యులు వర్ణించారు. దీనికి ప్రారంభ దశలోనే చికిత్స చేయాల్సి ఉంటుంది. లేనిపక్షంలో వ్యాధి తీవ్రమై కంటికి, చెవికి సంబంధించిన సమస్యలు వచ్చే అవకాశం ఎక్కువగా ఉంటుంది. ఈ తలనొప్పి మొదలైన తర్వాతమూడురోజుల వరకు బాధిస్తుంది. **ఆయుర్వేద చికిత్స:** ఆయుర్వేదంలో మైగ్రేన్ సమస్యకు రెండురకాల చికిత్సలు అందచేయాల్సి ఉంటుంది. మొదటిది ఔషదచికిత్స కాగా రెండవది పంచకర్మచికిత్స.పంచకర్మలలో ముఖ్యంగా అభ్యంగా, స్వేదన, నస్యకర్మ, తక్రధార, శిరోవస్తి లాంటి చికిత్సా పద్ధతులుఅవసరాన్నిబట్టి ఆయుర్వేదవైద్యుల పర్యవేక్షణలో తీసుకున్నట్లయితే మంచి ఫలితాలు ఉంటాయి.

**డా.లక్ష్మి.** M. D (Ayurveda)
**స్టార్ ఆయుర్వేద**

ADVT



# మరణానికి మగువలు దూరం

**మరణం... ఇది తథ్యం. ప్రతివారికెదురయ్యే సత్యం. మనిషికి చావు తప్పదు అని మూడుముక్కల్లో చెప్పే పాట ఇది. పుట్టిన ప్రతి వ్యక్తి చని పోవడం గ్యారెంటీ. కాకపోతే కొందరు కాలం తీరి మరణిస్తారు. మరికొందరు అనారోగ్యంతో మరణిస్తారు. ఇంకొందరు ప్రమాదాలు జరిగి మరణిస్తారు. ఇలా చనిపోతున్న వారి సంఖ్యతో సమానంగా, ఆత్మహత్యలకు పాల్పడుతూ ఉసురు తీసుకుంటున్నవారు కూడా ఉన్నారు. జీవితంలో ఏమీ సాధించలేకపోయామన్న భావనో, కుటుంబ భారం మోయలేమన్న కారణమో ఏమో కానీ చావు రాకుండానే మృత్యు ఒడికి చేరుకోవాలనుకుంటున్నవారు రోజురోజుకూ పెరిగిపోతున్నారు. అయితే ఈ అన్ని రకాల చావుల్లోనూ పురుషులే ముందున్నారనేది సర్వేలు చెబుతున్న అంశం. స్త్రీల కంటే ముందుగానే పురుషుల ఆయువు తీరిపోతోందనీ, దీనికి చాలా కారణాలున్నాయనీ పరిశోధకులు చెబుతున్నారు. చావు ముందుగా పురుషులకే ఎందుకు వస్తోంది? పురుషుల కంటే స్త్రీలు ఎక్కువ కాలం ఎలా జీవించగలుగుతున్నారు? అసలు స్త్రీపురుషుల మరణ రహస్యాలేమిటి? ఆ విషయం తెలుసుకుందామా?**

### అధిక ఒత్తిడిలో కూడా...

పురుషులకు మహా అయితే ఆఫీసులో మాత్రమే ఒత్తిడి ఉంటుంది. కానీ స్త్రీకి మాత్రం ప్రతి పనిలోనూ ఒత్తిడే! అత్తమామల ఆరోగ్యం, పిల్లల బాధ్యతలు, ఇంటిపని, వంటపని వంటి సవాలక్ష పనులతో ఒంటి చేత్తో సంసార నావను నడిపిస్తుంటుంది. చూడటా నికి, చెప్పుకోవడానికి చిన్న చిన్న పనుల్లా కనిపి స్తున్నా బండెడు చాకిరీ భారాన్ని మోస్తుంది. సమా జంలో వేధింపులు కూడా మహిళలకే ఎక్కువ. ఇంటా బయటా మహిళలపై జరుగుతున్న దాడులకు లెక్కే లేదు. సాధారణంగా అయితే ఇన్ని బాధలు, కష్టాలు పడుతున్న మహిళలే... పురుషుల కంటే ముందుగా చావు దరికి చేరాలి. కానీ జరుగుతున్నది మాత్రం పూర్తిగా భిన్నం. ఆఫీసు వ్యవహారాలు తప్పితే ఎలాంటి ఒత్తిడీ లేకుండా హాయిగా కలకాలం ఆరో గ్యంగా ఉండాల్సిన పురుషులు అతితొందరగా చని పోతున్నారు. కేవలం మానవజాతిలోనే ఈ విధమైన పరిణామం ఉందనుకుంటే పొరపాటే.. జంతువులు, పక్షుల్లో కూడా ఇదే జరుగుతోంది. ఉదాహరణకు ఓ పిల్లి సగటు జీవిత కాలం నాలుగు నుంచి అయిదు సంవత్సరాలయితే... మగ పిల్లుల కంటే ఆడపిల్లులు ఒకటి రెండేళ్లు ఎక్కువ కాలమే బతుకుతున్నాయి. ప్రకృతి ఇచ్చిన వరం, స్త్రీ జీవుల్లో ఉండే నైతిక స్థైర్యం, జీవన విధానాలు.. ఇవన్నీ ఇందుకు కారణాలుగా చెప్పుకోవచ్చంటున్నారు పరిశోధకులు.

### ఏ దేశమేగినా...

ప్రాంతం ఏదయినా, దేశం ఏదయినా స్త్రీలే ఎక్కువ కాలం బతుకుతున్నారనేది.. ఆయా దేశాల అధికారిక లెక్కలే చెబుతున్నాయి. అమెరికాలో స్త్రీల సగటు జీవిత కాలం 81.2 సంవత్సరాలుగా ఉంటే... పురుషుల సగటు జీవిత కాలం 76.4 సంవత్సరాలుగా ఉంది. అంటే సగటున ఒక అమెరికన్ మహిళ... పురు షుల కంటే అయిదేళ్లు ఎక్కువగా జీవించగలుగుతోం దన్నమాట. ఇక మన దేశంలో చూస్తే పురుషుల సగటు జీవిత కాలం 66.9 ఏళ్లుగా ఉంటే.. మహిళల్లో మాత్రం 69.9 ఏళ్లుగా ఉంది. ప్రపంచంలో అత్యధిక జనాభా దేశం చైనాలో కూడా ఇదే రకమైన పరిస్థితి ఉంది. అక్కడ పురుషుల సగటు జీవిత కాలం 68.6 ఏళ్లుగా ఉంటే.. స్త్రీల సగటు జీవిత కాలం 73.6 ఏళ్లుగా ఉంది. జపాన్, కెనడా, ఆస్ట్రేలియా, రష్యా.. ఇలా ఏ దేశమేగినా ఎక్కువ కాలం జీవించడంలో స్త్రీలదే పై చేయి.

### రోగాలతో స్త్రీలకు నో ప్రాబ్లమ్

పని ఒత్తిడి ఎక్కువగా ఉన్నా, జబ్బులతో ప్రాణాలు కోల్పోయే స్త్రీలు తక్కువేనని రిపోర్టులు చెబు తున్నాయి. స్త్రీల జీవనశైలి, శరీరక్రియలు వారి జీవిత కాలాన్ని పెంచేందుకు ఉపకరిస్తున్నాయి. మహిళల్లో విడుదలయ్యే ఈస్ట్రోజన్ అందుకు పెద్ద ఉదాహరణ అని చెప్పవచ్చు. చెడు కొవ్వును తగ్గిస్తూనే.. ఆరోగ్యానికి ఉపకరించే కొవ్వుపదార్థాల ఉత్పత్తికి ఈస్ట్రోజన్ సహక రిస్తుంటుంది. తద్వారా హృద్రోగ సమస్యలు

లేకుండా చేస్తుంటుంది. కానీ పురుషుల్లో విడుదలయ్యే టెస్టోస్టిరాన్ హార్మోన్ మాత్రం ఇందుకు విరుద్ధంగా ప్రవర్తిస్తుంటుంది. ఇది చెడు కొలెస్ట్రాల్ బ్లడ్ లెవల్స్‌ను పెంచుతూ, ఆరోగ్యాన్ని పెంచే కొలెస్ట్రాల్ బ్లడ్ లెవల్స్‌ను తగ్గిస్తుంటుంది. తద్వారా రక్తపోటును పెంచి హృదయ సంబంధ వ్యాధుల్ని, గుండెపోటు ముప్పును పెంచుతుంది. సాధారణంగా స్త్రీలు ప్రాణాంతకం కాని దీర్ఘకాలిక వ్యాధులతో బాధపడుతుంటే.. పురుషులు మాత్రం ప్రాణాంతకమయిన దీర్ఘకాలిక వ్యాధులను కలిగి ఉంటారు. స్త్రీలు కీళ్లనొప్పులతో బాధపడుతుంటారని వేరుగా చెప్పనక్కర్లేదు. ఈ కీళ్లనొప్పుల వల్ల ప్రాణం ఏమీ పోదు. అయితే దీర్ఘకాలిక వ్యాధుల్లో ఒకటైన గుండెజబ్బులు స్త్రీలతో పోల్చితే పురుషులకు పదేళ్లు ముందుగానే వస్తుంటాయి. ఈ లక్షణాలు స్త్రీలు ఎక్కువకాలం బతికేందుకున్న కారణాల్లో అతి ముఖ్యమైనవని చెప్పుకోవచ్చు.

### మహిళలకే ఎక్కువ శ్రద్ధ

మహిళలకు అందం మీద శ్రద్ధ ఎక్కువని వేరుగా చెప్పనక్కర్లేదు. ఫేస్‌క్రీమ్‌లు, పౌడర్లు, లోషన్లు.. ఇలా చెప్పుకుంటూ పోతే చాంతాడంత జాబితా ఉంటుంది. అయితే అందంతో పాటు ఆరోగ్యంపై కూడా స్త్రీలు ఎక్కువగా దృష్టిపెడతారనేది చాలా మందికి తెలియని విషయం. వంటింటి మహారాణి మహిళే కాబట్టి ఎలాంటి ఆహార పదార్థాలు ఆరోగ్యాన్ని ఇస్తాయో తెలుసుకుని పాటిస్తుంటారట. అంతే కాకుండా ఏ చిన్న రోగం వచ్చినా దాన్ని తగ్గించుకునేందుకు తీవ్రంగా ప్రయత్నిస్తారట. ఒక్కపూట అన్నం తినకుంటే పురుషులు నీరసించిపోతుంటారు. కానీ వారానికి ఓ రోజు ఉపవాసం పేరిటో, డైటింగ్ పేరిటో ఆహారానికి దూరంగా ఉంటూ ఆరోగ్యాన్ని హ్యాండ్‌బాగుల్లో వేసుకు తిరుగుతున్న మహిళల సంఖ్య తక్కువేమీ కాదు. ఏ అనారోగ్య సమస్యకు ఎలాంటి పద్ధతులు అనుసరిస్తే ఉపశమనం లభిస్తుందో మహిళలకు తెలిసినంతగా పురుషులకు తెలియదు. అనారోగ్యం వస్తే స్త్రీలు పట్టించుకున్నంతగా పురుషులు పట్టించుకోరు. చిన్నదేలే.. తగ్గిపోతుందిలే అంటూ కాలయాపన చేస్తారు. ఇలాంటివే కొన్ని సందర్భాల్లో పురుషులకు ప్రాణాంతకంగా మారుతుంటాయి.

### అలవాట్లు కూడా కీలకమే

వందేళ్లు వచ్చినా ఎంచక్కా కర్ర సాయం లేకుండానే నడుస్తున్నవారి గురించి చదివే ఉంటారు. వారి పనులు వారే చేసుకుంటూ పూర్తి ఆరోగ్యంగా ఉన్న వారి గురించి ఎన్నోసార్లు వినే ఉంటారు. ప్రస్తుత కాలంలో ఓ వ్యక్తి 60 నుంచి 70 ఏళ్లు బతకడమే గగనమవుతోంది. యాభై ఏళ్లు దాటడంతోనే రోగాలు మనిషిని ముసురుకుంటున్నాయి. కానీ వందేళ్లు దాటినా ఆరోగ్యంగా ఉన్నారంటే దీనికి ప్రధాన కారణం వారి ఆహార, వ్యక్తిగత అలవాట్లేనని వేరుగా చెప్పనక్కర్లేదు. ఓ వ్యక్తి ఎక్కువ కాలం బతకడంలోనూ, పూర్తి ఆరోగ్యంగా ఉండటంలోనూ అతడికున్న అలవాట్లే 90 శాతం ముఖ్యపాత్ర పోషిస్తాయి. స్త్రీలు మితంగా తింటారు. బయటి తిండికి వారు చాలా వరకూ దూరం. మిర్చీలు, బజ్జీలు అంటూ బయట దొరికే ఆయిల్‌ఫుడ్‌ను వారు ఎక్కువగా తినరు. కావాలంటే ఇంట్లోనే చేసుకుంటారు. ఇంట్లో చేసుకున్నా, కుటుంబ సభ్యులందరితో కలిసి తింటారు కాబట్టి మితంగానే తింటారు. పండ్లు ఎక్కువగా తింటుంటారు. లావు అవుతున్నామని గ్రహించినా, శరీరంలో కొవ్వు పెరిగిపోతోందని తెలిసినా వెంటనే తక్షణ చర్యలు తీసుకుంటారు. ఎటువంటి ఆహారం తీసుకుంటే బరువు తగ్గుతారో ఒకరికిద్దరిని అడిగి మరీ పాటిస్తుంటారు. ఇలా చెప్పుకుంటూ పోతే ఆరోగ్యకరమైన అలవాట్లు స్త్రీలకు ఎన్నో ఉన్నాయి. కానీ పురుషులు అలా కాదు.. ఫ్రెండ్స్‌తో కలిసి పార్టీలు, బయట చిరుతిండి.. కాఫీ, టీలు లెక్కకుమించి తాగేయడం, సిగరెట్, పాన్, గుట్కా, మందు అలవాట్లు ఎన్నో ఉంటుంటాయి. ఒకవేళ ఇలాంటి అలవాట్లు లేకున్నా మానసిక ఒత్తిడి వారిని వేధిస్తుంటుంది.



## ఒత్తిడిలో ఉన్నప్పుడు...

మానసిక ఒత్తిడి.. ప్రస్తుతం ప్రతిఒక్కరినీ వేధిస్తున్న సమస్య. స్కూలు పిల్లల దగ్గర నుంచి పండు ముసలి వరకూ ప్రతి ఒక్కరూ ఏదో ఒక సమస్యతో ఒత్తిడితో సతమతమవుతూనే ఉన్నారు. ఒత్తిడిలో ఉన్నప్పుడు జీవితం గురించి నిర్ణయాలు తీసేసుకుని ఉసురు తీసుకుంటున్నవాళ్లలో పురుషులే ఎక్కువగా ఉన్నారని బోస్టన్‌లోని కానర్స్ సెంటర్ ఫర్ విమెన్స్ హెల్త్ డైరెక్టర్ జిల్ గోల్డ్‌స్టెయిన్ చేసిన సర్వేలో తేలింది. వివిధ కారణాల వల్ల మానసిక ఒత్తిడి తీవ్రమై, మరణించాలని మగాళ్లు నిర్ణయించుకుంటున్నారట. మానసిక ఒత్తిడి అధికంగా ఉన్నప్పుడు స్త్రీలు, పురుషులు ఏమేం పనులు చేస్తారో తన పరిశోధనలో వివరించారు. తద్వారా ఒత్తిడిని స్త్రీలు ఎలా అధిగమిస్తున్నారు, పురుషులు ఎలా దానికి బలవుతున్నారనేది స్పష్టంగా చెప్పారాయన.



### స్త్రీలు

1. తన కష్టాలను గుర్తుకు తెచ్చుకుంటూ ఏడుస్తారు.
2. ఒత్తిడిలో ఉన్నప్పుడు టెన్షన్ పడుతుంటారు.
3. స్త్రీలు ఒత్తిడిలో ఉంటే సులభంగా గుర్తించవచ్చు. తద్వారా ఎదుటివారి ఓదార్పు లభిస్తుంది.
4. తిండిపై ధ్యాస ఉండదు.
5. పుస్తకాలు చదవడం, ఇంటిపని చేయడం వంటి వాటిపై దృష్టిపెడుతుంటారు.

### పురుషులు

1. సిగరెట్, మందు వంటి ప్రాణాంతక అలవాట్లకు బానిసలుగా మారతారు.
2. నిర్లక్ష్యంగా, రాష్‌గా డ్రైవింగ్ చేస్తుంటారు.
3. కొందరయితే టీవీ చూడటమో, సినిమాలకు వెళ్లడమో చేస్తుంటారు.
4. ఓ పురుషుడు ఒత్తిడిలో ఉన్నాడా..? లేదా..? అనేది తెలుసుకోవడం అంత సులభం కాదు.
5. ఇక బతకడం వేస్ట్ అని ఫీలవుతుంటారు.

ఇవే అనారోగ్యానికి మెట్లని గ్రహించేలోపే జరగరాని ఘోరం జరిగిపోతుంటుంది.

### అతి అనర్థదాయకం

ఆహార అలవాట్లే కాదు.. పురుషుల్లో ఉండే గుణాలు కూడా వారి అకాల మరణాలకు కారణాలవుతున్నాయి. ర్యాష్ డ్రైవింగ్, గొప్పగా చెప్పుకోవడానికి బాటిల్స్‌కు బాటిల్స్ బీర్లు లాగించేయడం, చిన్న రోగాలకు కూడా భయపడితే సమాజంలో చిన్నచూపు చూస్తారని భావించి.. ఆసుపత్రులకు వెళ్లకపోవడం వంటివి మగాడిని అని చెప్పుకోవడానికి బాగానే ఉంటాయి కానీ.. అవి కాస్త వికటిస్తే భూమిపై నూకలు చెల్లినట్లే. రోడ్డు దాటేటప్పుడు కూడా.. స్త్రీలు ఓ పద్ధతి ప్రకారం వెళ్తే.. రోడ్డు ఎంత రద్దీగా ఉన్నా పురుషులు ఆవలివైపుకు దూసుకెళ్తుంటారు. ఇలా ఒకటా రెండా.. ప్రతిదాంట్లోనూ దూకుడు చూపిద్దామనుకోవడమే పురుషుల కొంప ముంచుతోందని విశ్లేషకులు చెబుతున్నారు. అనవసరమైన విషయాల్లో దూకుడు తత్వాన్ని తగ్గించుకుంటే మేలని చెబుతున్నారు. సరైన ఆహార అలవాట్లను పాటిస్తూ, ఆరోగ్యం పెంపొందించుకుంటే పురుషులు కూడా ఎక్కువ కాలం బతుకుతారని స్పష్టం చేస్తున్నారు. మనోవేదనతో ఒంటరిగా బాధపడేకంటే తన సమస్యను కుటుంబ సభ్యులతో పంచుకుంటే పరిష్కార మార్గమో, ఉపశమనమో దొరుకుతుందంటున్నారు.


—కె.హసాన్
kandula.hassan@gmail.com



# ప్రాణంచెట్టు

ఈతకోట సుబ్బారావు

**ఉదయ సంధ్య వేళ.**

**చుట్టూ స్వచ్ఛమైన ప్రాణవాయువు ఆవరించిన స్పృహ..**

**ప్రాణం నిలకడగా ఉచ్ఛ్వాస నిశ్వాసల్లో డోలలూగుతున్న భావన..**

**ఎంతో హాయిగా అనిపించింది ఆదినారాయణకి.**

**ఎప్పుడో వెళ్ళిపోయిన యవ్వనం తిరిగి వచ్చినట్టు ఎంతో ఉత్సాహంగా ఉంది. సంధ్య దాటి సూర్యోదయం అయ్యేంతవరకు అలా తిరుగుతూనే ఉండిపోయాడు. తీరా ఇంటికి తిరిగి వచ్చినప్పుడుగాని తెలిసిరాలేదు. వాతావరణాన్ని ఆనందించే సందట్లో పొయ్యిపైన పెట్టిన పాలు పొంగి పొయ్యిని ఆర్పేశాయి. కిరోసిన్ పొయ్యి అవటంతో సరిపోయింది. అదే గ్యాస్‌స్టవ్ అయ్యుంటే?**

"నాన్నా! నువ్వు ఎప్పటికీ కిరోసిన్ పొయ్యే వాడు. గ్యాస్ స్టవ్ అయితే నీ ఫొటో ఫ్రేమ్ కట్టించుకోవలసి వస్తుంది. నువ్వు బైటికెళ్తే ఇల్లు గుర్తుండదు నీకు" పెద్దకూతురు వసంతలక్ష్మి మాటలు గుర్తొచ్చాయి. కళ్ళల్లో నీళ్ళొచ్చాయి. గ్యాస్ స్టవ్ ప్రమాదంలోనే పోయింది పిచ్చితల్లి. ఆ మాటకొస్తే పెద్దకూతురే కాదు. పెద్దవాడు అర్జున్ కూడా మోటర్ బైక్ యాక్సిడెంట్లో పోయాడు. మూడేళ్ళైంది. ఒకప్పుడు ఇంట్లో అందరూ ఉండి ఒంటరిగా బతికేవాడు ఆదినారాయణ. ఇప్పుడు ఎవరికి వారు ఉద్యోగాల్లో సొంతకాపురాల్లో ఇమిడిపోయారు. తను ఇలా ఒంటరిగా బతుకుతున్నాడు.

స్టవ్ పైనుండి పాలగిన్నె కిందికి దించాడు. ఒలికిపోయిన పాలను గుడ్డతో శుభ్రంగా తుడిచి, గిన్నె కడిగేశాడు. బైటికెళ్ళి పాలపాకెట్టు తెచ్చుకుంటేనే గ్లాసుడు కాఫీ. ఇంటి తలుపు వారగా వేసి లంకంత వసారా దాటి బైటిగేటు వేయబోతున్నప్పుడు తన అదృష్టం కొద్దీ శంకరం వచ్చాడు.

"నమస్తే మేష్టారూ! చలి ఊపుమీదుంది. ఇంత ఉదయాన్నే ఎక్కడికి?" సైకిలు దిగుతూ ప్రశ్నించాడు శంకరం.

"చిన్న సాయం చేసి పెడుదువూ. నారాయణ గారి కొట్టుదాకా వెళ్ళి ఓ పాలపాకెట్టు..." మాట పూర్తి కాకుండానే సైకిలెక్కి "సరే.. సరే మీరు లోపలికెళ్ళండి, బాగా చలిగా ఉంది" అంటూ నలభైయేళ్ళ వయస్సులోనూ బుర్రుపిట్టలా తుర్రున వెళ్ళిపోయాడు శంకరం. ఓ మూడు ఫర్లాంగులైనా నడవాలి నారాయణగారి కొట్టుకెళ్ళాలంటే. పాతికేళ్ళ కిందటి పంతులుగిరీ ఇలా పనులు చేసి పెడుతుంటుంది ఆదినారాయణకి. పాతికేళ్ల కిందటి స్టూడెంట్లలో ఒకడు శంకరం. టెన్త్ పూర్తి చేసి పశువుల ఆస్పత్రిలో అటెండర్‌గా చేస్తూ ఈ మధ్యనే కాంపౌండరయ్యాడు. పుట్టి పెరిగిన ఊళ్ళోనే పని చేస్తున్నాడు. ఆ రోజుల్లోనే కుర్రాడు. అందుకే గురువులంటే గౌరవం. ఈ రోజుల్లో కుర్రాళ్ళకి అభిమాన హీరోని మించిన గురువు, దైవం లేరు మరి.

శంకరం పాలపాకెట్టు పట్టుకొచ్చేదాకా వెనక పెరట్లో చెట్లకి నీళ్ళు పెడుతూ ఉండిపోయాడు ఆదినారాయణ.

పాలపాకెట్టు తీసుకుని గేటు దగ్గరికి వచ్చాక పెరటి వాకిలి తెరచివుండటం గమనించాడు శంకరం. మేష్టారు పెరట్లో ఉన్నారంటే దాదాపు అరగంట వరకు ఆయనకి మానవ ప్రపంచంతో సంబంధం తెగిపోయినట్టే. పెరట్లో పెరిగిన పాతిక పై చిలుకు చెట్లకి తనివితీరా నీళ్ళు పెడితేనేగానీ, ఆయనకి సంతృప్తి ఉండదు.

ఇంట్లోకొచ్చి, పాలు వేడిచేసి, కాఫీ కలిపి పెరట్లో మేష్టారి దగ్గరికెళ్ళాడు శంకరం. "మేష్టారూ! కాఫీ..." అన్నాడు గ్లాసు అందిస్తూ. అది తన చాదస్తమని శంకరానికి తెలుసు.

"ఆగవయ్యా! నువ్వూ నేనూ తాగితే సరి

# కొత్త బాయ్‌ఫ్రెండ్‌తో త్రిష చక్కర్లు!

ఓ పక్క త్రిష ఆరోగ్యం మీద పుకార్లు వినిపిస్తుంటే మరో పక్క త్రిష కొత్త బాయ్‌ఫ్రెండ్ ఎవరు? అన్నది హాట్ టాపిక్ అయింది. మొన్నామధ్య అర్ధరాత్రి త్రిష ఓ వ్యక్తితో కలిసి రోడ్డు మీద కనిపించిందట! అర్ధరాత్రి సమయంలో షికార్లు త్రిషకు కొత్తేమీ కాకపోయినా, ఈ సారి స్నేహితు రాళ్ళతో కాకుండా స్నేహితుడితో కనిపించడమే హాట్ టాపిక్ అయింది. అలా కనిపించిందో లేదో వెంటనే తనొక వ్యక్తిని ప్రేమిస్తున్నానంటూ చెప్పిందన్న వార్తలు బయటకొచ్చాయి. మొత్తానికి త్రిష సినిమాల్లో కన్నా వార్తల్లోనే ఎక్కువ నానుతోంది అంటున్నారు తమిళ తంబీలు. ఇప్పటికైనా ఈ తిరుగుళ్ళు మానేసి బుద్ధిగా పెళ్ళి చేసుకుంటే లైఫ్‌లో సెటిల్ కావచ్చని కొందరు త్రిషకు సలహా ఇస్తున్నా అవేమీ పట్టించుకున్నట్టు లేదు త్రిష.

పోతుందా?

నిన్నటి నుండి నీళ్ళకోసం కరువాచి పోయి చెట్లు ఎలా ఒడలిపోయాయో చూడు. ముందు కడుపు నిండా వీటికి నీళ్ళు పట్టి తర్వాత తాగుతాను. దాన్నలా పెట్టెయ్" ఆ మాటలంటున్నప్పుడు శంకరానికి మేష్టారులో ఒక మహానుభావుడు కనిపిస్తాడు. ఒక రంతిదేవుడు సాక్షాత్కరిస్తాడు.

"మరి నన్ను వెళ్ళమంటారా?" శంకరం ప్రశ్న.

"కాఫీ నువ్వు తాగావా?" ఆదినారాయణరావు గారి వాకబులో ప్రశ్న.

"మీరు తాగకుండా నేనెలా తాగనండీ! సాయంత్రం వస్తాగా. అప్పుడు కలుపుకుని తాగుతాలెండి" వెళ్ళబోతూ అన్నాడు శంకరం.

"ఇలాంటి కబుర్లు బోలెడు చెప్తుంటావుగానీ ముందు కాఫీ కలుపుకో" మేష్టారి హుకుం జవదాట లేదు శంకరం.

"మీరు తాగకుండానే .. అయితే రెండు క్షణాలు లోపలికొచ్చెయ్యండి. ఇద్దరం కలిసే తాగుదాం" స్టవ్ దగ్గరికెళ్తూ శంకరం అన్నాడు.

"ఆ రెండు క్షణాలేవో నువ్వే ఆగితే ఇక్కడ నా పని పూర్తయిపోతుందికదా. ఇద్దరం ప్రశాంతంగా కాఫీ తాగొచ్చు. ఏమంటావు?" చివరి మేడిచెట్టుకి నీళ్ళు పడుతున్నాడు మేష్టారు.

"సరే... సరే... బళ్లో మేష్టారి ఆజ్ఞ, గుళ్లో దేవుడి ఆజ్ఞ ఎవరు దాటగలరు చెప్పండి."

ఆదినారాయణకి చప్పున నవ్వొంచ్చిందామాటకి "నలభై వసంతాలు దాటినా నీలో ఆ వెటకారం మాత్రం పోలేదు శంకరం. ఇద్దరి ఆజ్ఞల్ని దాటేస్తే పోయేదేమీ వుండదు. పాటిస్తే వచ్చేదేమీ వుండదు".

కాళ్లు చేతులు కడుక్కొని లోపలికి వచ్చాడు ఆదినారాయణ. ఇద్దరూ కాఫీ తాగటం పూర్తయ్యాక "మరి సెలవండి. ఇవాళ కాస్త పెందరాళే రమ్మని కబురు పెట్టారు డాక్టరు గారు" అంటూ బయల్దేరడానికి సిద్ధమయ్యాడు శంకరం.

"సాయంకాలం ఓసారి ఇటొచ్చి వెళ్తావుగదా?"

"నేను రాకుండా, పెరట్లో మీతో సాయంకాలం పాదులు సరిచేయకుండా మనవూళ్లోకి రాత్రికూడా అడుగెట్టలేదు కదండీ!"

శంకరం మాటకి మళ్ళీ నవ్వుకున్నాడు ఆదినారాయణ.

***

కొడుకు అశ్వత్థనారాయణ, కూతురు శిరీష సిటీలో లక్షణంగా సెటిలైపోయారు. వాళ్ళు గోకవరం రారు.

తను సిటీకి వెళ్ళడు. ఎన్ని మార్లు రాకపోకలు సాగినా అవన్నీ చుట్టపుచూపు పలకరింపులే. ఫోన్ చేసి పిలిస్తే ఆదినారాయణ వెళ్ళకుండా ఉండలేడు. తను వెళ్ళని పక్షంలో తండ్రి దగ్గరికి వాళ్ళు రాకుండానూ ఉండలేరు. కాని పిల్లాపాపలతో పాటు వాళ్ళు రావాలంటే ఎంతో శ్రమ. కాబట్టే కాదనకుండా ఆదినారాయణ సిటీకి వెళ్ళొస్తూ ఉంటాడు. కొడుకు పిలిస్తే కొడుకు దగ్గర నాలుగు రోజులు. కూతురు పిలిస్తే కూతురి దగ్గర ఓ నాలుగు రోజులు.. అంతేకాని ఏకబిగిన ఇద్దరి దగ్గర ఏనాడూ గడపలేదు. కారణం తన పెరటి చెట్టే.

అస్తమానూ ఆదినారాయణకి పెరటిచెట్ల గురించే దిగులు. గోకవరంలో అర ఎకరాస్థలంలో కట్టిన ఇల్లది. ముందు లంకంత వసారా. వెనక అయోధ్య అంత పెరడు. మధ్యలో ఒంటి ఇటుకరాయితో సెంటున్నర జాగాలో కట్టిన బొమ్మరిల్లు అది. తన సహోపాధ్యాయుడు పామిటి నరసింహరాజు పాతికేళ్ళ క్రితం పట్టుబట్టి మరీ కొనిపించాడు తనచేత. నలుగురు పిల్లలతో, ఇల్లాలి ముచ్చట్లతో కళకళలాడిన ఇల్లది. ఇంటివెనక పెరట్లో అప్పటికే పదేళ్ళక్రితం నాటిన మామిడి, నేరేడు, మేడి, పనస, కాంచనార, ఉసిరి శిరీష చెట్లతో ఇంటికి పెట్టనికోటలాగ వేసవిలో ఎండ, వర్షాకాలం నీళ్ళ నుండి రక్షిస్తున్నాయవి. పాతికేళ్ళుగా వాటితో అనుబంధం పెంచుకున్నాడు ఆదినారాయణ. రోజూ వాటికి సంతృప్తిగా నీళ్ళు పెట్టడం తన దినచర్యలో భాగం చేసుకున్నాడు. సాయంకాలం చెట్లన్నింటినీ తడమటం, కౌగలించుకోవడం... అందులోనే ఆత్మతృప్తి అతడికి. ఆ కారణంగానే పిల్లల దగ్గర కూడా ఎక్కువ రోజులు గడపలేకపోతున్నాడు. కొడుకులకీ, కూతుళ్లకీ వాటిపేర్లే పెట్టుకోవటం చేత, చివరికి మనవలకి మనవరాళ్లకి సైతం చెట్లపేర్లే పెట్టుకోవడంతో వాటితో అనుబంధం మరింత పెరిగిపోయింది.

ఆదినారాయణ ఊరొదిలి వెళ్ళినరోజుల్లో తన పెరటిచెట్ల బాధ్యత శంకరం తీసుకుంటాడు. ఆ నాలుగు రోజులూ ముళ్ళపైన గడిపినట్టున్నా తప్పనిసరై కొడుకు దగ్గరో, కూతురు దగ్గరో ఉండి పోతుంటాడు ఆదినారాయణ.

"వయసై పోతోంది కదా, ఒంటరిగా ఇంకా ఆ ఊళ్ళోనే ఎందుకు? ఇక్కడికొచ్చెయ్‌రాదూ. కలిసుంటే ఎప్పుడే అవసరం వచ్చినా తోడొకరుంటారు కదా?" అన్నాడు అశ్వత్థనారాయణ ఆపై నెలలో వెళ్ళినప్పుడు.

"ఇప్పుడేమైందని? బానే ఉన్నానుగా. అంతగా పెద్దగా జబ్బుచేస్తే నీ దగ్గరికే వస్తాను. ఇంకెవరున్నారని నన్ను చూడటానికి" అన్నా వినలేదు.

"అదేమంత తెలివైన పద్ధతి కాదునాన్నా! ముందుగానే వచ్చేస్తే వచ్చే ప్రమాదాన్ని కొద్దోగొప్పో ఆపే వీలుంటుంది కదా" అన్నాడు.

"ఒరే అశ్వత్థం! ప్రేమ గుడ్డిదంటారే. అదే ఇది. దేన్ని అపగలవురా నువ్వు. వచ్చేచావుని కొద్దోగొప్పో ఆపగలవా? పైబడుతున్న వయసుని ఆపగలవా? ఏదీ మన చేతుల్లో ఉండదు" అదిగో అప్పుడు వచ్చింది పదిహేనేళ్ళ జ్యోతిష్మతి రంగంలోకి.

ఏదీ మనచేతుల్లో లేనప్పుడు బతకడమే దండగ అంటాడు తాతయ్యా! ఆల్కెమిస్ట్‌లో రచయిత" పుల్ల విరిచినట్టుంది మాట.

"ఏది ఉన్నా, ఏది లేకున్నా పెరట్లోవున్న ముప్ఫైయేడు మహావృక్షాల బతుకు మాత్రం నా చేతుల్లోనే ఉందమ్మా! వాటికి రోజూ నీళ్ళు పెట్టాలి. వాటి బతుకు వాటి చేతుల్లో కాదు. నా చేతుల్లో ఉంది" గొంతు పూడికను కప్పిపుచ్చుతూ దగ్గినట్టు చెప్పాడు.

"మా కంటే నీకు చెట్లే ఎక్కువా తాతయ్యా!" అంది సిసింద్రీ. దాని నోరు మరీ పెద్దది. అవునన్నట్టు తలాడించాడు. జ్యోతిష్మతి తన తండ్రివైపు ఓ చూపు చూసి పెదవి విరిచి లోపలికెళ్ళిపోయింది.

వెంటనే అలకమొహం వేసుకొని అశ్వత్థనారాయణ కూడా ఇంట్లోకెళ్ళిపోయాడు. ఆ తర్వాత నెలలో ఓసారి తండ్రికి ఫోన్‌చేసి, చూడాలని ఉందన్నాడు. సరే అన్నాడేగానీ కొడుకుదగ్గరకు వెళ్ళలేదు ఆదినారాయణ. అలకతో మాత్రం కాదు. వెళ్ళాలనిపించలేదంతే. నిన్న మళ్ళీ ఫోన్ చేశాడు. జ్యోతిష్మతి, కాంచనార ఇద్దరికీ సంక్రాంతి సెలవులు వచ్చాయని, నువ్వొవస్తే పండగ కళకళలాడుతుందని సారాంశం.

అదిగో అందుకే సాయంకాలం శంకరాన్ని రమ్మని చెప్పాడు ఆదినారాయణ.

***

ఏమో, ఏమైందో కాని మునుపటిలా ఆనందంగా ఉండలేకపోతున్నాడు ఆదినారాయణ కొడుకు దగ్గర. కలుపుగోలుతనం స్థానంలో ఇమడలేనితనం, కలివిడిగా మాట్లాడే స్థానంలో మౌనం చోటు చేసుకున్నాయి. పండగ ఎప్పుడెప్పుడైపోతుందా, ఎప్పుడు తను గోకవరం వెళ్ళిపోదామా అని నిరీక్షిస్తూ గడుపుతున్నాడు. భోగినాడు పాతసామానంతా తగలబెడుతుంటే తనూ కాలిబూడిదై పోతున్న భావన... ఆదినారాయణ భరించలేకపోయాడు. పచ్చని చెట్లకొమ్మలన్నీ కొట్టి మంటల్లో వేయటమంటే మనిషిని సజీవంగా




తగలబెడుతున్నట్టుగానే అనిపించింది. చెట్టుకూ ప్రాణం ఉంటుందని, దానికీ ఆకలి, గాయం మనిషిని బాధించినట్టే బాధిస్తాయనీ తెలుసుకున్నరోజే వాతావరణ కాలుష్యం సగానికి పైగా తగ్గిపోతుందని అతడి విశ్వాసం. కాని ప్రపంచంలో పక్కవాడి బాధ పట్టించుకునే నాథుడే కరువయ్యాడు. ఇంక చెట్టూ చేమా గురించి ఆలోచించే వాళ్ళెక్కడుంటారు?

పండుగ అయిన మరునాడే సామాను సర్దుకోవడం ప్రారంభించాడు ఆదినారాయణ. "ఏమిటి నాన్నా! పెనంమీద నిల్చునట్టు, ఇంకో రెండు రోజులుండి వెళితే నీ పెరటి బ్యాచి కంప్లయింటు చేసేదేం ఉండదుగా. అక్కడ శంకరం చూసుకుంటాడులే" అన్నాడు అశ్వత్థం. కాని తండ్రికి సుతారమూ ఇష్టం లేదు.

"ఇప్పుడు సమస్య ఉన్నదల్లా శంకరంతోనే బాబూ! అదేదో గాలికుంటువ్యాధితో చుట్టూ ఉన్న గ్రామాల పశువులన్నీ సతమతమౌతున్నాయని ప్రభుత్వం వీళ్ళ డాక్టరుగారికి క్యాంపులపైన క్యాంపులు విధిస్తున్నారట. పెరట్లో చెట్లకి రెండు రోజులకోసారైనా నీళ్ళు పెడదామంటే కుదరట్లేదు. మాష్టారు మీరు వెంటనే బైల్దేరిరండి అంటూ ఫోన్ల మీద ఫోన్లు చేస్తున్నాడు. అందుకే ఈ తొందర" అంటూ సర్దటం ముగించాడు ఆదినారాయణ.

"భోగిరోజు నేను ఫోన్ చేసినప్పుడు ఈ విషయం నాతో చెప్పలేదు. ఆ మనిషి చెట్టుకీ మీరు పెట్టే నీళ్ళు అవసరమయ్యాయేమో!"

కొడుకు వైపే చూస్తూ ఉండిపోయాడు ఆదినారాయణ. తర్వాత అన్నారు "భోగిరోజు నువ్వు ఫోన్ చేసిన విషయం నాతో చెప్పనే లేదెందుకని?".

"మీరు మరీనండీ! చిన్న పిల్లాణ్ణి కాదు కదా నా ప్రతి కదలిక మీకు చెప్పడానికి" అంటూ కొడుకు వంటింట్లోకి వెళ్ళిపోయాడు.

అశ్వత్థనారాయణ ధోరణి నచ్చలేదు ఆదినారాయణకి. మరీ జవాబుదారీతనం లేదనిపించింది. శంకరం, అశ్వత్థం కలిసి చదువుకున్నారు. కలిసి పెరిగారు. ఊళ్ళో వాళ్ళిద్దరూ ఒక జట్టు. ఓ రకంగా చెప్పాలంటే ప్రాణ స్నేహితులు కూడా.

అయినప్పటికీ అతడికి ఫోన్ చేసిన విషయం తనకు చెప్పకపోవటం ఏమిటనిపించింది. ఎంతయినా కన్నతల్లికే కాదు, కన్నతండ్రికి కూడా ఢిల్లీకి రాజైనా బిడ్డ చిన్నపిల్లాడి లాగానే కనిపిస్తాడు. కాని అశ్వత్థ మాటల్లో దానికి విరుద్ధ ధోరణి స్ఫురించింది.

పైగా పొడిపొడిగా నాలుగు మాటలు సంజాయిషీ కింద కాకుండా సమర్థింపుగా చెప్పేసి వెళ్ళిపోవటమూ అస్సలు రుచించలేదు.

వెంటనే బయల్దేరి గోకవరం ప్రయాణమై వెళ్ళిపోయాడు ఆదినారాయణ!

***

పదకొండో రోజు ఉత్తరకర్మలు ప్రారంభిస్తూ ఆదినారాయణ ఫొటో దగ్గర తలదీపం పెట్టాడు అశ్వత్థనారాయణ. కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లాయి. గుండె బాధగా మూల్గింది. అప్పుడే తండ్రిపోయి పదకొండు రోజులైంది. అసలింకా ఇంట్లోనే తిరుగుతున్నట్టు, తనతో, మనవరాళ్లు కాంచనారా, జ్యోతిష్మతితో మాట్లాడుతున్నట్టు అనిపిస్తుంది.

బంధువులందరూ ఒకొక్కరే వస్తున్నారు. వాళ్లందర్నీ చెల్లి శిరీష, బావగారు పొడినవ్వుతో పలకరిస్తున్నారు. పక్కనే మేనల్లుడు రోహిత్, మేనకోడలు వకుళ నిలబడ్డారు. అందరి ముఖాల్లో దైన్యం కొట్టొచ్చినట్టు కనపడుతోంది.

సరిగ్గా అప్పుడే ఫోన్ మోగుతున్న శబ్దం. వెతుకుతున్నాడు అశ్వత్థ నారాయణ. తన సెల్‌ఫోన్ తన జేబులోనే ఉంది. తీరా చూస్తే బల్లసొరుగులో ఆదినారాయణ ఫోన్ మోగుతోంది. ఆశ్చర్యం అనిపించినా వెంటనే బల్లసొరుగు తీశాడు. ఫోన్ అందుకున్నాడు. ఓ ముసలాయన ఫొటో. దానికింద పామిడి నరసింహారావు అన్నపేరు. ఆన్‌చేసి "హలో..." అన్నాడు అశ్వత్థనారాయణ.

"క్షమించాలి బాబూ! నా దగ్గర మీ నెంబరు లేదు. అందుకే నాన్నగారి నెంబరుకే రింగ్ చేశాను. ఆరోగ్యం బావుండటం లేదు, కాబట్టే అంత్యక్రియలకి రాలేకపోయాను. ఇప్పుడూ అంతే. ఏమీ అనుకోకండి. మీ దుఃఖం పంచుకోలేక పోయానన్న బాధ ఎప్పుడూ ఉంటుంది. ఉంటాను బాబూ! శిరీషని అడిగినట్టు చెప్పు" ఫోన్ కట్ అయ్యింది.

ఆదినారాయణ టచ్‌స్క్రీన్ సెల్ పైన పెరట్లోని చెట్టు ఫొటో ఒకటి ప్రత్యక్షమైంది. వసంత రుతువులో తీసుకున్నట్టుంది. పచ్చగా, పూలతో కళకళలాడుతున్న చెట్లు, ముఖ్యంగా కడిమిచెట్టు. ఎర్రని పూబంతులతో ముచ్చటగా ఉంది. చెట్టునిండా పువ్వులే. అశ్వత్థ నారాయణ భోరున ఏడ్చేశాడు. అంతటి పచ్చదనాన్ని, ఆహ్లాదాన్ని, ఆనందాన్ని పచ్చిగా తగులబెట్టిన పాపం అతనిదే.

భోగి పండుగనాడు పచ్చికొమ్మలు కూడా మంటల్లో తగులబెడుతున్నప్పుడు వచ్చిన ఆలోచన అది. పెరట్లో చెట్ల కారణంగానే తండ్రి తనకు, తన వాళ్ళకు దూరంగా ఉంటున్నాడన్న పాడు ఆలోచన. వెంటనే శంకరానికి ఫోన్ చేశాడు. పండుగనాడు తనకు కానుకగా తన తండ్రిని ఇవ్వమని అడిగాడు. 'మీ నాన్న నీ దగ్గిరేగా ఉన్నాడు?' అన్న శంకరం మాటకి కౌంటర్‌గా 'ఇలా అతిథిలా కాదు, శాశ్వతంగా నాదగ్గరే ఉండిపోవాలి. ఆ పెరట్లో మొక్కలన్నీ పెట్రోలుపోసి తగులబెట్టు. లేదంటే మీ గురువుమీద ఒట్టే.." అంటూ ఒట్టు పెట్టాడు.

గోకవరం వెళ్ళిన సాయంత్రమే ఫోనొచ్చింది ఆదినారాయణ శాశ్వతంగా వెళ్ళిపోయాడని! అనుకోకుండా స్క్రీన్‌ని టచ్ చేశాడు అశ్వత్థనారాయణ. కాంటాక్ట్స్ ఓపెన్ అయిపోయి స్క్రీన్‌పైన పచ్చని మద్ది చెట్టొకటి వచ్చింది. దానికింద పెద్దోడు అని రాసుంది. పెద్దకొడుకు అర్జున్‌ని పెద్దోడు అని పిలిచేవాడు నాన్న. వెంటనే చిన్నోడు అని టైప్ చేశాడు. వెంటన్ స్క్రీన్‌పైన పెద్ద పెద్ద ఆకులతో, నిండా రామ చిలకలతో రావి చెట్టు ప్రత్యక్షమైంది. ఉద్వేగం ఆపుకోలేక శిరీష అని టైప్ చేశాడు. ఈసారి స్క్రీన్‌పైన నిండా పూలతో దిరిసెన చెట్టు. ధారగా కన్నీళ్ళు కారుతూనే ఉన్నాయి. ఎడం చేత్తో కన్నీళ్ళు తుడుచుకుంటూ రోహిత్ అనుకోవటం ఆలస్యం ఎర్రని గుత్తులు గుత్తులుగా పూచిన మోదుగచెట్టు. వకుళ పొగడచెట్టు... అంటే నాన్న ఆ చెట్లలో తమని చూసుకుంటూ కాలం గడపుతున్నాడన్న విషయం అర్థం అవగానే నాన్ననే కాదు, ఇంటిల్లిపాదినీ తనే తగలబెట్టించాడన్న నేరభావనతో అశ్వత్థనారాయణ ముఖం కందిపోయింది. అన్ని మనిషిచెట్లు తగలబడిపోయాక బతికున్న తనపైన తనకే అసహ్యం వేసింది.

గుమ్మంలో శిరీష పిలుస్తూనే ఉంది 'అన్నయ్యా! అన్నయ్యా!!'

అశ్వత్థనారాయణ ప్రాణం భూమికీ ఆకాశానికీ మధ్య ఊగిసలాడుతూనే ఉంది!

**సెల్: 944 05 29 785**

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## హార్మోన్ సమస్యలకు సరైన పరిష్కారం



డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

ప్రస్తుత కాలంలో చాలామంది థైరాయిడ్, పీసిఓడి, సంతానలేమి మరియు డయాబెటిస్ వంటి దీర్ఘకాలిక ఆరోగ్య సమస్యలతో బాధపడటం జరుగుతోంది. ఇలాంటి అసమతుల్యతలు తలెత్తటానికి చిన్న కారణం చాలు – ఇది తీవ్రమైన దీర్ఘకాలిక వ్యాధులకు దారితీస్తోంది కాబట్టి అలాంటి కారణం పట్ల అవగాహన పెంచుకోవడం వలన హార్మోన్ సంబంధిత వ్యాధుల బారిన పడకుండా మనల్ని మనం కాపాడుకోవచ్చు. హార్మోన్‌లు అనేవి శరీరంలోని ఎండోక్రైన్ గ్రంథుల నుండి ఉత్పత్తి అయ్యే రసాయన వాహకాలు. ఇవి శరీరంలో ఒక ప్రాంతపు కణజాలం అవయవాల నుండి ఉత్పత్తి అయి, రక్తప్రసరణ ద్వారా వివిధ శరీర భాగాలకు చేరుకుని, నిర్దిష్ట అవయవాలను ప్రభావితం చేస్తూ శరీర జీవక్రియల సమతుల్యతకు తోడ్పడతాయి. ఇవి శరీరంలో సూక్ష్మమోతాదులో ఉత్పత్తి అయినప్పటికీ, శరీర సాధారణ జీవక్రియలైన "జీర్ణక్రియ మొదలుకొని శారీరక, మానసిక ఎదుగుదల ప్రక్రియలు, ప్రత్యుత్పత్తి వ్యవస్థ, మానసిక సమతుల్యత వంటి అన్ని ప్రధాన జీవక్రియలపై" వీటి ప్రభావం ఖచ్చితంగా ఉంటుంది. ఏ కారణం వల్లనైనా ఈ హార్మోన్‌లు అసమతుల్యతకు గురి అయితే, అది తీవ్రమైన దీర్ఘకాలిక ఆరోగ్య సమస్యలకు దారితీస్తుంది.




**వివిధ హార్మోన్‌లు - వాటి అసమతుల్యత వలన కలిగే వ్యాధులు:** థైరాయిడ్ హార్మోన్‌లు (T3, T4): థైరాయిడ్ గ్రంథి ద్వారా ఉత్పత్తి అయ్యే వీటి ప్రభావం 90% మేర మానవ జీవనక్రియలపై ఉంటుంది. ఈ హార్మోన్‌ల అసమతుల్యత వలన హైపోథైరాయిడ్, హైపర్‌థైరాయిడ్, గాయిటర్ మొ॥ దీర్ఘకాలిక వ్యాధులు వస్తాయి.
**హైపర్‌థైరాయిడిజం:** శరీరంలో థైరాయిడ్ హార్మోన్‌లు ఎక్కువ మోతాదులో ఉత్పత్తి కావటం వలన ఈ సమస్య ఏర్పడుతుంది. **లక్షణాలు:** బరువు తగ్గడం, నీరసం, గుండెదడ, కాళ్ళు-చేతులు వణకడం మొ॥వి.
**హైపోథైరాయిడిజం:** థైరాయిడ్ హార్మోన్‌లు తక్కువ మోతాదులో ఉత్పత్తి కావటం వలన ఈ సమస్య ఉత్పన్నమవుతుంది. **లక్షణాలు:** బరువు పెరగటం, జుట్టు రాలటం, నీరసం, మతిమరుపు, ఋతుచక్ర సమస్యలు మొ॥ లక్షణాలు కనిపిస్తాయి.
**గాయిటర్:** గొంతు క్రింద ఉండే థైరాయిడ్ గ్రంథి వాపునకు గురి కావటాన్ని గాయిటర్ అంటారు. ఇది ముఖ్యంగా అయోడిన్ అనే మూలకం లోపం వలన కలుగుతుంది. ఇది హైపోథైరాయిడ్ లేదా హైపర్‌థైరాయిడ్ సమస్యలతో కూడుకుని ఉండవచ్చు.

**హోమియోకేర్ చికిత్స:** ప్రస్తుత పరిస్థితులలో మానవుడి ప్రకృతి విరుద్ధమైన జీవన విధానం, అధిక ఒత్తిడికి గురికావటం, వ్యాయామ లోపం వలన ఎక్కువ శాతం థైరాయిడ్ వ్యాధుల బారిన పడటం మనం గమనిస్తున్నాము. థైరాయిడ్ సమస్యలకు జీవితకాలం మందులు వాడే అవసరం లేకుండా, వీటికి గల మూలకారణాన్ని గుర్తించి, థైరాయిడ్ సమస్యకు గురి కాబడిన వారి శారీరక, మానసిక తత్వానికి అనుగుణంగా సరైన హోమియో వైద్యం అందించడం ద్వారా థైరాయిడ్ హార్మోన్ సమస్యను సంపూర్ణంగా నయం చేయవచ్చు.

**స్త్రీలలో ఉండే హార్మోన్‌లు:** ఈస్ట్రోజెన్, ప్రొజెస్టిరాన్, ప్రొలాక్టిన్, ఆక్సిటోసిన్ హార్మోన్‌లు స్త్రీలలో రజస్వల, ఋతుచక్రం, ద్వితీయ లైంగిక లక్షణాలు, సంతానోత్పత్తి మరియు ప్రసవంలో ఉపకరిస్తాయి. ఈ హార్మోన్‌ల అసమతుల్యత వలన స్త్రీలలో ఋతుచక్ర సమస్యలు (పీసిఓడి), హిర్సుటిజం (అవాంఛిత రోమాలు) మరియు సంతానలేమి సమస్యలు ఏర్పడతాయి. స్త్రీలలో మెనోపాజ్ మరియు రజస్వల అయ్యే సమయంలో హార్మోన్‌ల ప్రభావం ఎక్కువగా ఉంటుంది. మెనోపాజ్‌లో హార్మోన్‌ల హెచ్చుతగ్గుల వలన Hot Flushes, మానసిక అశాంతి, నీరసం, కీళ్ళ నొప్పులు మరియు కండరాల నొప్పులు ఉత్పన్నమవుతాయి.
**పురుషులలో ఉండే హార్మోన్‌లు:** TSH, LH మరియు టెస్టోస్టిరాన్ హార్మోన్‌లు పురుషులలో శుక్రకణాల ఉత్పత్తికి తోడ్పడతాయి. టెస్టోస్టిరాన్ హార్మోన్‌ల అసమతుల్యత వలన శ్రీఘ్రస్కలనం, అంగస్తంభన సమస్యలు, శుక్రకణాల సమస్యలు ఏర్పడటం, తద్వారా అవి సంతానలేమికి దారితీయటం జరుగుతుంది.

**హోమియోకేర్ చికిత్స:** హార్మోన్ సమస్యలు ఒకదానితో మరొకటి అనుసంధానమై ఉంటాయి. హోమియోకేర్ వైద్యప్రక్రియలో భాగంగా ఎలాంటి హార్మోన్‌లను బయట నుండి ఇచ్చే అవసరం లేకుండానే హార్మోన్‌ల అసమతుల్యతలను సరిచేయటం ద్వారా ఎలాంటి దుష్ప్రభావాలు లేకుండా – ఋతుచక్ర సమస్యలు, పీసిఓడి, సంతానలేమి మరియు శుక్రకణాల సమస్యలను సంపూర్ణంగా నయం చేయవచ్చు.

**డయాబెటిస్ - హార్మోన్ సమస్యలు: డయాబెటిస్ ఇన్‌సెపిడిస్:** ADH (యాంటీ డైయూరెటిక్ హార్మోన్) లోపం వలన తలెత్తే ఈ సమస్యను అతి మూత్ర వ్యాధి అని కూడా అంటారు. **డయాబెటిస్ మెల్లిటస్:** ఇది క్లోమ గ్రంథి ఉత్పత్తి చేసే ఇన్సులిన్ లోపం వలన లేదా తక్కువ మోతాదులో ఇన్సులిన్ ఉత్పత్తి కావడం వలన కలుగుతుంది. ఇది 2 రకాలు. **టైప్-1 డయాబెటిస్:** ఇది ఇన్సులిన్ ఉత్పత్తి కాకపోవటం వలన ఏర్పడుతుంది. దీనిని జువెనైల్ డయాబెటిస్ అని అంటారు. ఈ వ్యాధిగ్రస్తులు పూర్తిగా ఇన్సులిన్ ఇంజెక్షన్లపై ఆధారపడవలసి వస్తుంది. **టైప్-2 డయాబెటిస్:** ఇది ఇన్సులిన్ ఉత్పత్తి తగ్గటం వలన వస్తుంది. ఇది ఎక్కువగా 30 సం॥లు పైబడిన వారిలో వచ్చే అవకాశం ఉంటుంది. కానీ ఈ మధ్యకాలంలో యుక్తవయస్కులు కూడా ఈ వ్యాధికి గురి కావటం జరుగుతోంది. డయాబెటిస్‌తో బాధపడే వారి రక్తంలోని చక్కెర శాతాన్ని సరిగ్గా నియంత్రణ చేయక పోవడం వలన దీర్ఘకాలంలో డయాబెటిక్ నెఫ్రోపతి, డయాబెటిక్ న్యూరోపతి, రెటినోపతి, గుండె సమస్యలు, అంగస్తంభన సమస్యలు మొ॥గు కాంప్లికేషన్స్ వస్తాయి.

**హోమియోకేర్ చికిత్స:** డయాబెటిస్‌ను తొలిదశలోనే గుర్తించి, హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వారి ప్రత్యేక 'హార్మోన్ సెల్' మరియు కాన్స్టిట్యూషనల్ విధానం ద్వారా డయాబెటిస్ బాధితులలో – దీర్ఘకాలం పాటు ఎలాంటి దుష్ఫలితాలు లేకుండా వ్యాధిని అదుపులో ఉంచటంతో పాటు అన్ని డయాబెటిక్ కాంప్లికేషన్‌లను నివారించవచ్చు.

**అన్ని విధాలైన హార్మోన్ సమస్యలకు హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** హోమియోకేర్ సొంతమైన ప్రత్యేక 'హార్మోన్ సెల్' మరియు జెనెటిక్ కాన్స్టిట్యూషనల్ సిమిలిమం పద్ధతుల ద్వారా అన్ని హార్మోన్ సమస్యలకు ఖచ్చితమైన మరియు ఎటువంటి దుష్ఫలితాలు లేని వైద్యం అందించబడుతుంది. తద్వారా ఇక మరోసారి తిరగబెట్టకుండా హార్మోన్ సమస్యలను సంపూర్ణంగా నయం చేసే అవకాశం ఉంది.




# అందుకు ఇదా శిక్ష?

**'నేను ఇంటికి రావటం ఆలస్యం అయింది. చీకటి పడిపోయింది. ఇంటిగేటు తీస్తుంటేనే ఎవరో చీకట్లోంచి వచ్చి నన్ను తోసి బైటకు పరుగెత్తారు. నేను సరిగ్గా చూడలేదు. భయంతో గుండె ఆగినంత పనైపోయింది. నన్ను నేను నియంత్రించుకుని లోపలకు పరుగెత్తాను. లోపల ....' ఏడుపు ముంచుకు రావటంతో ఆమె మాట్లాడలేక పోయింది.**

ఆమెవైపు సానుభూతితో చూశాడు డిటెక్టివ్ శరత్.

బ్యాంకు మేనేజర్ మాధవరావు హత్యకు గురయ్యాడు. దొంగ దాడిచేసి మాధవరావును కొట్టి చంపాడు. విలువైన వస్తువుల కోసం వెతికి ఇల్లంతా చిందరవందర చేశాడు. ఏమీ దొరికినట్టు లేదు. అతడు పారిపోయే సమయానికి మాధవరావు భార్య లత ఇంటి గేటు తెరిచి లోపలికి వచ్చింది. ఆమె ఓ ప్రైవేట్ కంపెనీలో సి.ఇ.ఓగా ఉద్యోగం చేస్తోంది. ఇంటికి వచ్చేసరికి ఆలస్యం అవుతుంది. కానీ ఆ రోజు మాత్రం రోజూకంటే ఆలస్యం అయింది.

'పారిపోయే వ్యక్తి చేతిలో ఆయుధం ఏమైనా ఉందా?' అడిగాడు శరత్ మృదువుగా. ఆమె కాస్సేపు ఆలోచించింది. తల అడ్డంగా ఊపింది.

'ఏమో... చీకట్లోంచి ఆకారం మీదకు దూకగానే బెదిరాను. గమనించలేదు. కానీ చేతుల్లో ఏమీ ఉన్నట్టు లేదు' అంది మెల్లిగా.

'మీరు గుర్తు తెచ్చుకుని ఆ ఆకారాన్ని వర్ణించగలరా?'

'అంతాచీకటి. నేను యథాలాపంగా ఉన్నాను. హఠాత్తుగా ఆకారం పరుగెత్తుకు వచ్చింది. పొడుగ్గా ఉన్నాడతడు. ముఖం కనబడలేదు. కానీ చాలా పొడుగ్గా ఉన్నాడు. అంతకన్నా ఏమీ చెప్పలేను' అంది లత.

'మీరు రిలాక్సవ్వండి. నేను ఇల్లు పరిశీలిస్తాను' అంటూ లేచాడు శరత్.

అప్పటికి ఇన్‌స్పెక్టర్ విజయ్, అతని జట్టు సభ్యులు ఇల్లంతా పరిశీలించారు. శరత్‌ను చూడగానే నవ్వాడు విజయ్. 'మాధవ్‌కు దొంగకు నడుమ పోరు బాగానే జరిగినట్టుంది' గదిలో పగిలిన సామాన్లు చూస్తూ అన్నాడు విజయ్.

తల ఊపాడు శరత్. ఒకటొకటిగా పడి ఉన్న వస్తువులను, విరిగిన ముక్కలను పరిశీలించటం ఆరంభించాడు.

కాస్సేపటికి విజయ్‌ని అడిగాడు. 'హత్య ఆయుధం దొరికిందా?'

'అదే మిస్టరీగా ఉంది. బలమైన దానితో కొట్టినట్టు తెలుస్తోంది. చూస్తుంటే పోరు ఘోరంగా సాగినట్టుంది. కానీ అతడికి ఒంటిమీద గాయలు లేవు. తలమీద తగిలిన దెబ్బతో వెంటనే ప్రాణంపోయి ఉంటుందని డాక్టరు ప్రాథమిక పరీక్షలో అన్నాడు. పోస్ట్ మార్టమ్ అయితే కానీ నిర్ధారణగా తెలియదు.

'బలమైన ఆయుధం దొంగ వెంట తీసుకుని పరుగెత్తటం కుదరదు. కాబట్టి ఇంట్లోనే ఉండాలి' అన్నాడు శరత్ చుట్టూ చూస్తూ.

శవం పడి ఉన్న గదిలోనూ ఇదే పరిస్థితి.

'ముందు గదిలో ఆరంభమయిన యుద్ధం లోపలి గదిలో పూర్తయినట్టుంది' అనుకున్నాడు శరత్.

కానీ ఆ గదిలో కూడా ఆయుధం లాంటిది కనబడలేదు.

ఆలోచిస్తూ ఇల్లంతా తిరిగాడు. పెరట్లో రోలు రోకలి ఉన్నాయి.

'ఇంకా వీళ్ళు రోలు రోకలి వాడుతున్నారా?' అనుకున్నాడు శరత్.

'మా ఆయనకు మిక్సీపచ్చళ్లు నచ్చవు. రోటిపచ్చళ్లే అసలైన పచ్చళ్ళు అంటారు' కళ్ళు తుడుచుకుంటూ చెప్పింది లత.

'ఇంట్లో విలువైన వస్తువులేవీ పోలేదు కదా?' అడిగాడు శరత్ మరోసారి.

'ఏమీ పోలేదు. ఆయన ఎదురు తిరిగేసరికి దొంగ బెదిరి ఉంటాడు. ఆయన పడిపోయేసరికి ఇంకా బెదిరి ఉంటాడు. పూచికపుల్ల కూడా పోలేదు' చెప్పింది లత.

***

అసిస్టెంట్ రాము, శరత్ ఎదురుగా వచ్చి కూర్చున్నాడు.

'బాస్, చిల్లర మల్లర దొంగలందరినీ విజయ్ ప్రశ్నించాడు. ఆ ఏరియాలోని ఛోటా మోటా దొంగల్నీ ప్రశ్నించాడు. ఇటీవల బెయిల్‌మీద విడుదలైన వారినీ ప్రశ్నించాడు. ఎవ్వరూ తమ పని కాదంటున్నారు' చెప్పాడు.

'నాకు ఓ అనుమానం ఉంది. ఈ పని మామూలు దొంగది కాకపోవచ్చు. మాధవ్ ఫ్రెండుతో ఏదైనా వాగ్వాదం మొదలై ఉంటుంది. ఆవేశంలో హత్య జరిగి ఉంటుంది. మాధవ్ ఫ్రెండ్సందరినీ ప్రశ్నించు. ఓ జాబితా తయారు చెయ్యి' చెప్పాడు శరత్.

'అది చేస్తాను బాస్... కానీ ఎలాంటి ఆధారాలు లేకుండా ఎవరినైనా ఎలా అనుమానిస్తాం?' అడిగాడు రాము.

'వేలిముద్రల రిపోర్టు రానీ. దాని ద్వారా ఏదైనా ఆధారం దొరకవచ్చు. నాకు అతడి భార్య ఎందుకో ఏదో దాస్తోందనిపిస్తోంది. వారిద్దరి నడుమ సంబంధం ఎలా ఉండేదో తెలుసుకో. నేనూ ఓసారి వాళ్ల ఆఫీసు వాళ్లతో మాట్లాడతాను. లేచాడు శరత్.

***

'లత మంచి అమ్మాయి. తన పరిమితులు తెలుసు. అందరితో స్నేహంగా ఉంటుంది. కానీ ఎవరినీ హద్దు దాటనీయదు' చెప్పాడు కొలీగ్.

'లత చాలా తెలివైనది. మాధవ్ ఆమెకి సరిపోడు. కానీ ఈ కాలంపిల్లల్లా అసహనం చూపలేదు లత. అతనికి తగ్గట్టుగా మారాలని ప్రయత్నిస్తోంది. జీవితంతో రాజీ పడుతోంది. చాలా అరుదైన పిల్ల ఈ కాలంలో' అంది ఓ కొలీగు.

'ఎందుకు సరిపోడు మాధవ్, లతకు?' అడిగాడు శరత్ కాజువల్‌గా.

'మాధవ్ మంచివాడే కానీ జీవితంలో పైకి ఎదగాలన్న తపనలేదు. బద్ధకం ఎక్కువ. కానీ లత చాలా డైనమిక్. పైగా మాధవ్‌కి ప్లానింగ్ లేదు. ఎప్పుడు ఏదితోస్తే అది చేసేస్తాడు. ఫలితాల గురించి, పరిణామాల గురించి ఆలోచన అస్సలే లేదు. లత అలా కాదు. పద్ధతి ప్రకారం ఉంటుంది'.

'లతకు ఎవరితోనైనా.. లేక ఎవరైనా లతను ఇష్టపడే వాళ్లున్నారా?'

'ఛీ... లత గురించి అలాంటి ఆలోచనలే తప్పు'.

ఆలోచిస్తూ కుర్చీలో వెనక్కు వాలాడు శరత్.

***

బలమైన వస్తువుతో తలమీద దెబ్బకొట్టారు. అందువల్ల మరణం సంభవించింది. బయట గాయం కనబడటం లేదు. కానీ లోపల తగిలింది' చెప్పాడు పోస్ట్‌మార్టమ్ డాక్టర్ ఫణి.

'ఒంటిమీద ఇతర గాయాలేవీ లేవు కదా?' అడిగాడు శరత్.

'లేవు. తలమీద కూడా దెబ్బ తగిలినచోట గీసుకున్నట్టుంది. లేకపోతే తలమీద దెబ్బ తగిలిందని గుర్తించటం కష్టం అయ్యేది'.

'ప్రాణం పోయిన సమయం గుర్తించారా?'

'రాత్రి పదిన్నర నుంచి పన్నెండులోపు పోయి ఉండవచ్చు. పదిన్నర తరువాత అని మాత్రం కచ్చితంగా చెప్పవచ్చు' చెప్పాడు ఫణి.

**ఆమె ఒక పెద్ద ఆఫీసరు. రోజూ ఇంటికొచ్చేసరికి ఆలస్యం అవుతుంది. ఆ రోజు మరీ ఆలస్యమైంది. గేటు తీసుకొస్తుంటే, చీకట్లో ఎవరో ఆమెను డీకొట్టి బైటకు పారిపోయారు. భయపడిపోయిందామె. లోపలికి వెళ్ళి చూసింది. భర్త హత్యకు గురయ్యాడు . ఇంట్లో దొంగతనం జరగలేదు. డిటెక్టివ్ శరత్‌ను ఆశ్రయించిందామె. మరి ఈ కేసును అతడెలా పరిష్కరించాడు?**

***

'బాస్... ఇంటి చుట్టుపక్కల వారిని ప్రశ్నించాను. మాధవ్‌కీ లతకీ పడేది కాదని చెప్తున్నారు. వాళ్లిద్దరి నడుమ తరచు కీచులాటలు జరిగేవట. అప్పుడప్పుడు ఆ కొట్లాటలు హింసాత్మకంగా కూడా పరిణమించేవట. ఆరోజు ఇంట్లోకి ఎవరూ వెళ్లినట్టు గానీ బయటకు వచ్చినట్టు కానీ ఎవరూ గమనించలేదట'.

'లత ఎన్ని గంటలకు వచ్చిందో ఎవరూ చూడలేదా?'

'బాస్.. ఆ రోజు తొమ్మిది గంటల వరకూ ఆఫీసులోనే ఉంది. ఆఫీసునుంచి ఇంటికి రావటానికి కనీసం గంట పడుతుంది. ట్రాఫిక్ ఎక్కువగా ఉంటే ఇంకో అరగంట ఎక్కువ పట్టవచ్చు' అంటూ ఆగాడు రాము. ఆలోచనగా శరత్ వైపు చూశాడు.

'ఇంకా ఇల్లు పోలీసుల ఆధీనంలోనే ఉంది కదా?' అడిగాడు శరత్.

'యెస్ బాస్' లత ప్రస్తుతం వాళ్ల అమ్మ దగ్గర ఉంటోంది' చెప్పాడు రాము.

'అయితే పద' అన్నాడు శరత్ లేస్తూ.

***

హత్య జరిగిన ఇంటికి చేరుతుండగానే శరత్ దాన్ని గమనించాడు. మనసులో తనని తాను తిట్టుకున్నాడు.

వాళ్ల ఇంటి ఎదురుగానే పెద్ద వీధి దీపం ఉంది. వెలుతురు వాళ్ల వాకిట్లో ధారాళంగా పడుతోంది.

గేటు దగ్గర నిలబడి రామువైపు చూశాడు శరత్.

రాము గేటు తీసుకుని లోపలకు వెళ్ళాడు. శరత్ గేటు బయటే నుంచున్నాడు.

రాము ఇంటి తలుపు నుంచి గేటువైపు పరుగెత్తుకు వచ్చాడు. మరోసారి శరత్ దూరం నుంచి నడుస్తూ గేటు దగ్గరకు వచ్చాడు. రాము మళ్లీ పరుగెత్తుకు వచ్చాడు. ఈసారి శరత్ సరిగ్గా గేటు చేరేసరికి రాము గేటు వద్దకు వచ్చాడు.

శరత్ ముఖం గంభీరంగా అయింది.

ప్రశ్నార్థకంగా శరత్‌వైపు చూశాడు రాము.

శరత్ మౌనంగా లోపలకు నడిచాడు. ఈసారి జాగ్రత్తగా ఇల్లంతా వెతకటం ప్రారంభించాడు. పెరట్లో దొరికిందది.

దాన్ని చూసి తనని తాను తిట్టుకున్నాడు శరత్.

'కళ్ళ ఎదురుగా ఉన్నదాన్ని చూడలేక పోయాను' అనుకున్నాడు.

జాగ్రత్తగా గ్లవ్స్ చేతులతో దాన్ని తీసుకున్నాడు. అది చూసి రాము నవ్వటం ఆరంభించాడు.

***

ఫింగర్‌ప్రింట్ ఎక్స్‌పర్ట్ రిపోర్టు జేబులో పెట్టుకుని తలుపు తట్టాడు శరత్.

బయట నుంచున్న శరత్, రాము, విజయ్‌లను లోపలకు ఆహ్వానించింది లత.

'ఇల్లు ఎప్పుడు నాకు హ్యాండోవర్ చేస్తారు?' అడిగింది.

'త్వరలోనే. పరిశోధన చివరకు వచ్చింది' చెప్పాడు విజయ్.



'హంతకుడు దొరికాడా?' అడిగిందామె.

'మేడమ్... ఆ రోజు బాగా గుర్తు తెచ్చుకోండి. మీరు ఇంటికి చేరేసరికి ఇంట్లో కరెంటు ఉందా? లేదా?' అడిగాడు శరత్.

'ఇదేం ప్రశ్న?' అన్నట్టు శరత్ వైపు చూసింది. అంతలోనే ఆమె ముఖంలో భయం కనిపించింది ఏమీ మాట్లాడలేదు.

'మీరు ఒక్కమాటతో మొత్తం పరిశోధనను తప్పుదారి పట్టించారు. సాధారణంగా నేరం నిరూపణ అయ్యేదాకా ప్రతి ఒక్కరినీ అనుమానించాలన్న మౌలిక సూత్రం విస్మరించాను. మీరు అమాయకులని నమ్మాను. అందుకే హంతకుణ్ణి పట్టుకొనేందుకు ఇంతకాలం పట్టింది. లేకపోతే చాలా సులువైన పరిశోధన ఇది అన్నాడు శరత్.

లత తల ఎత్తలేదు.

'ఇంట్లో వస్తువులు చిందరవందరగా పడివున్నప్పుడు అనుమానం వచ్చింది. వస్తువులు ఒకరిపై ఒకరు విసిరేసుకున్నట్టున్నాయి తప్ప, దొంగ వెతికినట్టు లేదు.

రోటి పచ్చళ్లు, అతడికి ఇష్టం అన్నప్పుడైనా నాకు అనుమానం రాలేదు. కానీ ఇది దొంగ పని కాదు, స్నేహితుల నడుమ వాగ్వాదం అనుకున్నానుగానీ భార్యాభర్తల పోరాటం అనుకోలేదు' అన్నాడు శరత్.

నీళ్ళు నిండిన కళ్ళతో శరత్‌వైపు చూసింది లత.

'పెళ్ళయ్యాక ఒక్కరోజు కూడా శాంతిలేదు. అతనిది బ్యాంకు ఉద్యోగం. నాది ప్రైవేటు ఉద్యోగం. పెద్ద బాధ్యత. పెద్ద జీతం. అది అతడికి నచ్చేది కాదు. అందుకని ఎప్పుడూ నన్ను కించపరచాలని ప్రయత్నించేవాడు. నాకేమీ తెలీదన్నట్టు ప్రతి చిన్న విషయంలో తిట్టేవాడు. అన్నీ భరించాను. మారతాడని ఎదురుచూశాను. రానురాను హింస పెరిగిపోయింది. మాటలుపోయి చేతులు ఎత్తేవరకూ వచ్చింది. ఒంటిమీద చెయ్యిపడితే ఊర్కోనన్నాను. అయినా అతడి ప్రవర్తన మారలేదు. ఇంకా తీవ్రత పెరిగింది. నేను సి.ఇ.ఓ.ను ఆఫీసులో ఆలస్యం అవుతుంది. రోజూ ఇంటికి వచ్చేసరికి గోల చేసేవాడు. ఆరోజు ఎప్పటిలాగే గోల చేశాడు. విసుగొచ్చింది. రోజూ ఈ గోల ఏమిటి? నేను అంతగా నచ్చకపోతే మా అమ్మ దగ్గరకు వెళ్ళిపోతానన్నాను. కొట్టాడు. నేను తట్టుకోలేక పోయాను. వస్తువులు విసిరేశాను. ఆయన కూడా విసిరాడు. ఒంటిమీద దెబ్బపడటం అలవాటు లేదు నాకు. అమ్మ నాన్న నన్ను ప్రేమగా పెంచారు. 'కానీ పెళ్ళయినప్పటినుంచీ...' ఆమె ఏడవటం మొదలు పెట్టింది.

జాలిగా చూస్తూ కూచున్నారు శరత్, రాము, విజయ్.

'నన్ను కొడితే నేను తిరిగి కొట్టాను. రోలు ఎత్తాడు నన్ను కొట్టటానికి. నేను కోపం పట్టలేక పోయాను. రాతిరోకలి ఎత్తలేక పోయాను. పక్కనే ఉన్న కర్ర రోకలి ఎత్తాను. కొన్ని పచ్చళ్లకు రాతి రోకలి సరిపోదట. పచ్చడి చేయటం కూడా ఓ ఇష్యూనే. నేను కోపంతో రోకలితో కొట్టాను. అంత బలంగా కూడా కొట్టలేదు. కానీ చచ్చిపోయాడు. నేను రోలు రోకళ్లను యథాస్థానంలో ఉంచాను. దొంగ వచ్చినట్టు కథ అల్లాను. చెప్పండి, వాడి నుంచి నాకు విముక్తి లేదా? వాడు చచ్చినా నేను జైలులో జీవితం వ్యర్థం చేసుకోవాల్సిందేనా? వాణ్ణి పెళ్ళి చేసుకున్నందుకు నాకు ఇదా శిక్ష?' శరత్ మాట్లాడలేదు. ఫింగర్‌ప్రింట్ రిపోర్టు విజయ్‌కి అందించి బయటకు నడిచాడు.

*—కస్తూరి మురళీకృష్ణ*
*సెల్: 98496 17392*




**కీర్తిలాల్‌కు షాక్ తగిలినట్టయింది. నేను పెట్టిన మెలికను అతను సులువుగానే అర్థం చేసుకున్నాడు.**

**"సార్! మళ్ళీ ఆ ఫిటింగ్ ఎందుకు సార్! మూడేళ్ళకు ఒకేసారి రాసుకుందాం సార్!" అని బ్రతిమిలాడాడు.**

**"అయితే, మూడేళ్ళకు యాభై లక్షలు ప్లస్ ఈ నెక్లెస్. ఇప్పుడు అడ్వాన్సుగా ఇరవై ఐదు లక్షలు ప్లస్ నెక్లెస్. మిగతావి టూ ఇయర్స్‌లో" అన్నాను.**

**"సార్! యాభై ఎక్కువ సార్! మళ్ళీ నెక్లెస్ కూడా అంటున్నారు. నెక్లెస్ కాస్ట్ ఎయిట్ లాక్స్ సార్! ఒక మాట చెప్తాను. ఫార్టీ లాక్స్ ప్లస్ నెక్లెస్. ఇప్పుడు ట్వంటీ, తర్వాత ఇయర్లీ టెన్ చొప్పున" అన్నాడు.**

నేను కూడా తెగేదాకా లాగకూడదని 'సరే' అన్నాను.

"మీరు ఓకే అన్నారు. మరి మేడం ఒప్పుకుంటారా?" సంశయంగా అడిగాడు. నేను ముసిముసిగా నవ్వాను.

శ్రావణి పది నిమిషాల తర్వాత వచ్చింది. ఆమె చేతుల్లో పూలదండలు, బొకేలు, చాక్లెట్లు ఉన్నాయి.

"ఉష్" మని సోఫాలో వాలిపోయింది.

"మేడం! సార్‌తో మాట్లాడాను. మీరేమంటారు?" అని అడిగాడు.

"సార్ ఏదంటే అదే ఫైనల్!" అంది. అప్పటికే ఆమె మెడలో కంఠాభరణం తళుకులీనుతోంది.

"సరే సార్! అగ్రిమెంట్ సైన్ చేయగానే, అడ్వాన్సు ఇస్తాము. మరి... ఈ నెక్లెస్ ఇప్పుడే తీసుకెళ్తారా?" అని అడిగాడు.

"ఇప్పుడే తీసుకెళ్ళాలి. మీకు నమ్మకం లేకపోతే దాని కాస్ట్ నేను కట్టేస్తాను" అంటూ బ్యాగులో నుంచి కొత్త రెండు వేల నోట్లకట్టలను తీశాను.

"అయ్యో, అయ్యో! మాఫ్ కరో సాబ్! మీ మీద నమ్మకం లేక కాదు సార్! నెక్లెస్ మేడం మెడలోనే ఉండనివ్వండి సాబ్!" అన్నాడు కీర్తిలాల్.

నేను ఆ డబ్బులు అతని చేతిలో పెట్టి,

"నాకు ఇట్లాంటిదే ఇంకో నెక్లెస్ కావాలి, మా అమ్మ కోసం. ఉంటే చూపించండి" అన్నాను.

"ఉంది సార్! కానీ, రెండూ ఒకే డిజైన్ ఎందుకు సార్? వేర్వేరు డిజైన్లలో తీసుకోండి. మార్చి మార్చి మేడం, అమ్మగారు పెట్టుకో వచ్చు!" అన్నాడు కీర్తిలాల్.

'గుడ్ సజెషన్' అనుకున్నాను.

శ్రావణి అమ్మకు, వయసుకు తగ్గట్టుగా, హుందాగా ఉండేలా ఒక నెక్లెస్, నాలుగు గాజులు సెలెక్ట్ చేసింది.

ఇక వెళ్దామని బయలుదేరుతుండగా, "నాకు చిన్నప్పటి నుండి ఓ కోరిక ఉంది. 'రవ్వ ముక్కుపుడక' అని నవలల్లో చదివేవాణ్ణి. అట్లాంటిది ఒకటి చూపించండి తనకు" అన్నాను.

నా కోరిక విన్న శ్రావణి పగలబడి నవ్వింది. కీర్తిలాల్ శ్రావణినే విస్మయంగా చూస్తుండిపోయాడు.

కీర్తిలాల్‌ను ప్రేమ దోమ కుట్టిందని అనుకున్నాను.

మరుక్షణంలో వజ్రాలు పొదిగిన ముక్కు పుడకలు తెచ్చి పెట్టారు.

"రవ్వల ముక్కుపుడక అంటే ఇవేనా?"

"ఇవే సార్!"

వాటిల్లో నుంచి నెక్లెస్‌కు సూటయ్యే ముక్కు పుడక తీసి శ్రావణికి ఇచ్చాను. అటెండెంట్ అమ్మాయి, ఆ ముక్కు పుడకను, అపురూపంగా శ్రావణికి తొడిగింది.

నా కళ్ళ ముందు నా కలల రాణి ప్రత్యక్షమైంది. శ్రావణి మెడలో నెక్లెస్, ముక్కుపుడక మెరిసిపోతుండగా నాకు పాదాభివందనం చేసింది. నేను



### జరిగిన కథ

ఆస్కార్ అవార్డుల పోటీల్లో అతడి చిత్రం ఎంపికయిన సందర్భంగా అమెరికా వెళుతూ, గతం గుర్తు చేసుకున్నాడు ఆ తెలుగు దర్శకుడు. డీసీపీ పుష్పా కిరణ్ సహాయంతో సినిమా నిర్మించేందుకు సిద్ధమవుతాడు. హీరోయిన్ శ్రావణిని ప్రేమిస్తాడు. తన గతాన్ని చెప్పి, దర్శకుడికి దూరంగా వెళ్ళిపోతుంది శ్రావణి. డైరెక్టర్ ఇంట్లో హార్డ్‌డిస్క్ దొంగిలించిందన్న నెపంతో శ్రావణిని అరెస్ట్ చేస్తారు. డీసీపీ మేడం శ్రావణికి బెయిల్ ఇచ్చి, డైరెక్టర్ ఇంటికి తీసుకువస్తుంది. ఆమెని పెళ్ళి చేసుకోవాలనుకుంటాడు దర్శకుడు. తన ఆఫీసుపై ఐటీ రెయిడ్ జరగటంతో, చకచకా ఆర్థిక లావాదేవీలన్నీ చక్కబెట్టేస్తాడు దర్శకుడు. పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళి హార్డ్‌డిస్క్ చోరీ వెనుక ఉన్నవారిని కలుసుకుంటాడు. తరువాత శ్రావణిని తీసుకుని జ్యూయలరీ షాపుకి వెళతాడు దర్శకుడు. శ్రావణి ఫోటోలు చూసిన ఆ షాపు యజమాని ఆమెను తమ షాపు యాడ్ క్యాంపెయిన్ చేయాల్సిందిగా కోరతాడు. అందుకు పాతికలక్షలు ముట్టచెబుతానంటాడు.

ఆ తర్వాత.....

కంగారుపడి, "ఏయ్! ఛ, ఛ, ఏమిటిది?" అని తనను పైకి లేపాను. తలెత్తిన శ్రావణి కళ్ళనిండా నీళ్ళు. వాటి అర్థం నాకు తెలుసు.

కీర్తిలాల్, అతని తండ్రి కూడా, ఆ దృశ్యం చూసి, చలించిపోయారు. కీర్తిలాల్ వెళ్ళి మంచినీళ్ళు తెచ్చి ఇచ్చాడు. శ్రావణి వద్దని తల అడ్డంగా ఊపుతూ, నవ్వింది.

షోరూములో సప్తవర్ణాల ఇంద్రధనుస్సు విరిసింది.

"ఇక బయల్దేరుదాం!" అని తను మేలి ముసుగు ధరించగానే వెనుక ద్వారం గుండా బయటకొచ్చాం. వాలెట్ బైక్ పట్టుకొచ్చి నిలబడ్డాడు. అతని చేతిలో యాభై రూపాయల నోటు పెట్టాను. శ్రావణి బైక్ ఎక్కి, ఆ షాపు ముందు నిలబడి అద్దాల గుండా తన కోసం చూస్తున్న అభిమానులకు 'బాయ్' చెప్పగానే, బైక్ ముందుకు దూకించాను.

నా ఫ్లాట్‌కి వెళ్ళాము. ఇద్దరికీ 'ఫుడ్ పాండా'లో డిన్నర్ ఆర్డర్ చేశాను.

"మొత్తానికి మనం ఒకందుకు బయల్దేరితే మరొక విధంగా మనకు లాభమయింది" అన్నాను.

కొత్త బంగారు లోకపు మహాసామ్రాజ్ఞిగా వెలిగిపోతోంది శ్రావణి. బంగారంది ఏముందిలే అనుకుంటాం గానీ అది స్త్రీ మోముకు ఎంత వింత శోభనిస్తుందో శ్రావణి ముఖం చూస్తేనే తెలిసిపోతుంది.

"నువ్వు నాతోపాటూ అమ్మకు బంగారం కొనడం నాకు బాగా నచ్చింది" శ్రావణి అంది.

"అవును. నా దగ్గర ఇన్ని రోజులూ డబ్బులు లేవు. అదీగాక నీకో బహుమతి కొనివ్వాలన్న ఆలోచనే రాలేదు నాకు ఇన్నాళ్ళూ. నీ పుట్టినరోజు ఎప్పుడో కూడా నాకు తెలియదు" అన్నాను.

నోట్లోనుంచి ఆ మాట జారిన మరుక్షణం నేను పొరపాటయిందని గ్రహించాను. ఆ మాట వినగానే తన ముఖం చిన్నబోయింది. నేను లేచి ఆమెను కౌగిట్లోకి తీసుకుని,

"సారీరా! వేరే ఉద్దేశంతో అనలేదు" అన్నాను. 'సరే' అన్నట్లుగా తలూపింది.

"ఈ సండే అమ్మా నాన్నల దగ్గరకు వెళ్దాం. వారికి కోడలుగా నిన్ను పరిచయం చేస్తాను" అన్నాను.

"వాళ్ళు నన్ను మనస్ఫూర్తిగా స్వీకరిస్తారా? ఒప్పుకుంటారా నన్ను?" అని సంశయం వెలిబుచ్చింది.

"తప్పకుండా ఒప్పుకుంటారు. నువ్వే చూస్తావుగా?" అని హామీ ఇచ్చాను.

భోజనం చేసిన తర్వాత నేను కారులో దించి వచ్చాను. ఇంటికొచ్చాక చూశాను. రెండు నెక్లెస్‌లతో పాటూ ముక్కు పుడక కూడా ఇక్కడే పెట్టి వెళ్ళింది.

"సరే, అమ్మ చేతుల మీదుగా ఇప్పించేద్దాం" అనుకున్నాను.

శ్రావణి యాడ్‌కు సంబంధించిన అమౌంట్ ఎంత అని కూడా నన్ను అడగలేదన్న విషయం కూడా అప్పుడే మదిలో మెదిలింది.

***

చీకటి తెరలు కప్పుకుని రాత్రి రాణి మత్తుగా నిద్ర పోతోంది. అది చూసి కన్ను కుట్టిందేమో బాల భానుడు పరుగు పరుగున వచ్చేస్తున్నాడు, నిశీ రాణి నిద్ర చెడగొట్టి, లేపి పశ్చిమాద్రికి పంపేస్తూ, టాటా చెప్పడానికి.

తెలి తొలి వెలుగుల్లో, మా ఊరికి బయలుదేరడానికి శ్రావణి వాళ్ళ ఇంటి ముందు, కారులో వెయిట్ చేస్తున్నాను.

"ఐదు నిమిషాల్లో వస్తానని" శ్రావణి చెప్పి ఇరవై నిమిషాలు అవుతోంది. 'అత్తారింటికి దారేది' అనుకుంటూ బయలుదేరుతుంది కాబట్టి ఆ మాత్రం ఆలస్యాన్ని భరించవచ్చునని నేననుకుంటుండగానే, రానే వచ్చింది.

"హాయ్!" కత్తులేల, యుద్ధాలేల, కంటి చూపుతో కవ్విస్తే కాళ్ళ దగ్గర సామ్రాజ్యాలు విసిరి పారేసి, జీవితాంతం దాస్యం చేయడానికి ఎందుకు రాజులు, చక్రవర్తులు ప్రేయసిలకు దాసోహం అన్నారో, ఆకుపచ్చని పట్టుచీర కట్టుకుని తలుపు ముందు నిలబడిన శ్రావణిని చూసిన క్షణాన నాకు అర్థమయింది.

తను రాకముందే శ్రావణి వెళ్ళిపోతుందేమోనని హడావుడి పడి వచ్చిన బాలభానుడు, శ్రావణి అక్కడే నిలబడి ఉండడం చూసి, ఒక చిరునవ్వు విసిరాడు. ఆ లేలేత కిరణం వెలుతురులో వసంతవనంలా మెరిసిపోతూ, నన్ను చూసి నవ్వింది శ్రావణి.

కారు వరకు రాయంచలా నడిచివచ్చి, నా పక్కనే కూర్చుంటే, నా చుట్టూ హరితవనం కమ్ముకున్నట్టయింది. ఎప్పుడూ తనను అంటిపెట్టుకుని, మనసులను గుబాళింపచేస్తూ వీచే లేత పున్నాగ పూల పరిమళంతో నేనూ, మేనూ పులకించాయి. స్తబ్దుణ్ణై పోయాను. ఏదో ఒకటి మాట్లాడాలి కాబట్టి,

"నెక్లెస్ పెట్టుకోమన్నాను గదా?" అడిగాను, ఇంకేం మాట్లాడాలో తోచని మోహావేశంలో.

"అత్తయ్యా, నేనూ ఒకేసారి పెట్టుకుంటాం" అని ఒక్క క్షణం ఆగి బుంగమూతి పెట్టి, "నేనెలా ఉన్నానో చెప్పవేంటి?" అని అడిగింది, నా భుజం మీద తల వాల్చుతూ.

"అబ్బా! నువ్వు గుండెల్లో గుచ్చిన మోహపు చూపుల గాయాలనుండి ఇప్పుడిప్పుడే తేరుకుంటున్నాను. మళ్ళీ ఎందుకు చంపుతావ్? నీకేమమ్మా! అందం గానే ఉంటావ్, మేమే చచ్చిపోతున్నాం" అన్నాను.

శ్రావణి గలగలా నవ్వింది.

నేను టక్కున కారు ఆపి, దిగి వెనుకకు పరిగెత్తాను.

శ్రావణి ఆశ్చర్యంగా "ఏమైంది?" అని అడిగింది.

నేను తిరిగొచ్చి "అలా సడెన్‌గా నవ్వితే ఎలా? నవరత్నాలన్నీ కింద పడిపోయాయి. ఏరుకుని తెచ్చుకున్నాను" అన్నాను సీరియస్‌గా.

ముందు శ్రావణికి అర్థం కాలేదు. తరువాత, "ఛీ, ఫో!" అంటూ నా భుజం మీద తట్టింది.

ఒక్కోరోజు ప్రపంచమంతా అందాల హరివిల్లులు పరుచుకున్న సుందరలోకంలా అనిపిస్తుంది. ఒక్కోరోజు అంతులేని విషాదం నింపుకుని రోదిస్తున్న కలతల ప్రపంచంలా అనిపిస్తుంది. ఆకసాన్ని మబ్బులు కమ్మేసినట్టుగా, మానసాన్ని విషాద తలపుల మేఘాలు ముసురుకుంటాయి.

ఆ భావం, ముఖ్యంగా మన మనఃప్రవృత్తి మీదనే ఆధారపడి ఉంటుందన్నది యదార్థం.

కానీ, నేను మాత్రం, ఆ ఉదయం మధురోహల్లో తేలిపోతూ కారు నడుపుతున్నాను.

శ్రావణిని మా అమ్మానాన్న కోడలుగా ఒప్పుకోరన్న డౌటే లేదు నాకు. కానీ, పల్లెటూరి సమాజపు కట్టుబాట్లు గమ్మత్తుగా ఉంటాయి. వాళ్ళ జీవన విధానంలో కులం, మతం వంటి అంశాల ప్రభావం ఎక్కువగానే ఉంటుంది.

వీటికి తోడు, శ్రావణి మామూలు పెళ్ళికూతురు కాదు.

కలల లోకపు యువరాణి. యువకుల స్వప్న సామ్రాజ్యాల సౌందర్య దేవత.

సినిమాల్లో ఆమె ఎంతోమందితో ప్రేమ సన్నివేశాల్లో నటించి ఉంటుంది. అప్పుడు శారీరకంగా ఒకరి కౌగిలిలో ఒకరు ఉండడం, కొంత సాన్నిహిత్యం ఉండడం సహజమే.

కానీ, ప్రజలకు తెలియని విషయం ఏమిటంటే వాళ్ళు నటించేటప్పుడు చుట్టూ కనీసం యాభై నుంచి వంద మంది వరకు కళ్ళు కాయలు కాచేలా, తదేక దృష్టితో చూస్తూ ఉంటారు. ఎక్కడ మేకప్ చెదిరిపోయిందోనని మేకప్ ఆర్టిస్టులు; దుస్తుల అమరిక సరిగ్గా ఉందో లేదోనని కాస్ట్యూమర్స్; యాంగిల్ సరిగ్గా కుదిరిందా లేదా అని కెమెరా అసిస్టెంట్లు; లైటు సరిపోయిందో లేదోనని లైట్ బాయ్స్... ఇలా సవాలక్ష మంది వారి వారి క్రాఫ్ట్‌లకు సంబంధించిన అంశాల గురించి క్షుణ్ణంగా, హీరో హీరోయిన్లనే పరీక్షగా చూస్తూ ఉంటారు. ఇంత మంది మధ్య స్త్రీ సహజమైన బిడియాన్ని వదిలి హీరోయిన్‌గా నటించడమే ఒక ఎత్తు.

ఇక, ఆ సమయంలో నటీనటుల మధ్య ప్రేమ, వలపులు పుట్టడం కొంచెం కష్టమే. అయితే, కొందరు హీరోలు, మగ నటులు, నటిస్తూ, కెమెరా కన్ను చూస్తుండగానే, ఆ కాస్త సమయంలోనే తమ కక్కుర్తి తీర్చుకునే ప్రయత్నం చేయరని చెప్పలేం.

అలాగే, పాపులర్ హీరో హీరోయిన్ల మధ్య ప్రేమ పెరిగి పెళ్ళి వరకు దారితీసిన సందర్భాలు కూడా లేకపోలేదు. అట్లాంటివి, సెట్ మీద కాక షూటింగ్ పూర్తయిన తర్వాత మిగిలిన సమయాల్లో వృద్ధి చెందుతుంటాయి.

కానీ, శ్రావణికి అట్లాంటి ప్రేమ వ్యవహారాలు లేవు. తను ప్రేమలో పడింది మొదటిసారిగా నాతోనే.

పర పురుషుణ్ణి తాకడంతో ఆమె పాతివ్రత్యం కలుషితమవుతుందని నేనయితే అనుకోను. ఇట్స్ జాబ్! అది ఒక పని. అన్ని ఉద్యోగాల మాదిరే, ఇదీ ఒక ఉద్యోగం.

ఆధునిక సమాజపు ఆర్థికరంగంలో స్త్రీలు అనేక రంగాల్లో క్రీడలు, పోలీస్, సైన్యం, మెడిసిన్, డ్రైవింగ్, బ్యాంకింగ్, పైలట్... ఈ మధ్య మరీ ముఖ్యంగా సాఫ్ట్‌వేర్ రంగంలో స్త్రీలు చురుగ్గా, పురుషులతో సమానంగా పని చేస్తున్నారు. వాళ్ళ మధ్య కూడా అప్పుడప్పుడు శారీరకంగా తగలడం ఉంటుంది. అంత మాత్రం చేత వాళ్ళు మైలపడినట్టు కాదు కదా!

కానీ, ఎంతయినా సినిమారంగానికి వచ్చేసరికి, ఈ విశ్లేషణ వర్తించదని వాదిస్తుంటారు. సినిమా ఫీల్డుకున్న గ్లామర్, కళ్ళు చెదిరిపోయే మేకప్పులు, డిజైనర్ దుస్తులు, విలాసవంతమైన లైఫ్‌స్టైల్స్, కార్లు, బంగళాలు, హై ప్రొఫైల్స్‌తో పాటు, సినిమా

**అమ్మానాన్నల దగ్గరకు వెళ్దాం. వాళ్ళకి నిన్ను కోడలిగా పరిచయం చేస్తాను అన్నాడు దర్శకుడు. భయపడింది శ్రావణి. వాళ్ళు నన్ను కోడలిగా అంగీకరిస్తారా అంటూ అతని భుజం మీద తలవాల్చింది. నువ్వలాంటి అనుమానాలేమీ పెట్టుకోవద్దంటూ ఆమెను ఊరికి బయలుదేరదీశాడు దర్శకుడు. మరి అతడి తల్లిదండ్రులు ఏమన్నారు? శ్రావణిని కోడలిగా అంగీకరించారా?**

చాన్సులు రావడం కోసం వారు ఇచ్చే పొంతన లేని రకరకాల ఇంటర్వ్యూలతో వాళ్ళొక మిథ్యాప్రపంచంలో నివసిస్తుంటారని సామాన్య ప్రజలే కాక, విజ్ఞులు కూడా భావిస్తుంటారు.

అది కొంతవరకు నిజం కూడా!

కానీ, అది ఒక అందమైన పేక మేడని, వాళ్ళ జీవితాల్లోనూ అంతులేని విషాదం ఉంటుందని, దాన్ని గుండెల్లోనే అణచుకుని, చిరునవ్వులు అంటించుకుని, లేని హుషారును తెచ్చుకుని, దినదినగండంగా బ్రతుకుతుంటారని, నిన్నగాక మొన్నటి 'మాధవీలత' ఇంటర్వ్యూ తెలియచేస్తుంది.

కానీ, వారి గుండెల్లో కూడా ప్రేమ, అభిమానం, ఆర్ద్రత, ఆత్మాభిమానం ఉంటాయనే నిజాన్ని చాలా కొద్దిమందే గ్రహిస్తారు.

అందుకే, అమ్మా వాళ్ళ అభిప్రాయం ఎలా ఉంటుందోనని నేను భయపడ్డాను.

ఇప్పటికీ హీరోలపై గానీ, హీరోయిన్లపై గానీ సంప్రదాయ పెళ్ళిళ్ళ మార్కెట్లో అంతగా సదభిప్రాయం లేదు. సినిమాను ప్రేమించే ప్రేక్షకులు అందులో నటించే హీరో, హీరోయిన్లను అభిమానిస్తారు గానీ, పెళ్ళి వరకు వచ్చేసరికి అమ్మానాన్నలు చూసిన సాంప్రదాయ పెళ్ళికే మొగ్గు చూపుతారు. కొంత అవగాహనా లోపం, కొంత సినిమా రంగంలో జరిగే సంఘటనలు వారిని అలా ఆలోచింపచేస్తాయి.

ఈ విషయాలన్నీ అమ్మానాన్నలకు ముందే కూలంకుషంగా చెప్పి ఒప్పించాను.

అందుకే, నా మదిలో కల్యాణరాగం మారుమోగుతోంది. శ్రావణికి ఈ విషయం తెలియదు. సర్ప్రైజ్! అందుకే తను కొద్దిగా టెన్షన్‌గా ఉంది.

ఆలోచనల్లో ఉండగానే ఊరి పొలిమేరలకు చేరుకున్నాము.

నేను అక్కడి దృశ్యం చూసి నోరెళ్ళబెట్టాను. పొలిమేరల్లోని చౌరాస్తా చుట్టూ రంగు రంగుల ఫ్లెక్సీలు వెలిశాయి. అన్నింటిలోనూ శ్రావణే! అందరూ, అన్ని రాజకీయ పార్టీల వారూ శ్రావణికి స్వాగతం పలికారు.

శ్రావణి అన్ని రకాల ఫోజుల్లో ఫోటోలు దిగిందన్న విషయం నాకయితే తెలియదు. శ్రావణి కూడా ఆశ్చర్య పోయింది. "దేవుడా! ఇక్కడ కూడానా?"



అంటూ తలపట్టుకుంది.

అంతటితో ఆగలేదు. ఊళ్ళోకి ప్రవేశించేసరికి బ్యాండ్ మేళాలు, పూలదండలు, బాంబులు, ఫైర్ క్రాకర్స్ వంటి స్వాగత సన్నాహాలతో ఊరి జన మంతా సెంటర్లో గుమికూడి ఉన్నారు.

మా కారు అక్కడికి చేరేసరికి బాంబులు, చిచ్చు బుడ్లు, టెన్ థౌజండ్ వాలాలు పేలడం మొదలైంది. బాంబులు దద్దరిల్లుతుండగానే మా ఊరి వాళ్ళంతా కారును చుట్టుముట్టారు. నేను నిజం గానే బిత్తరపోయాను.

అప్పుడు శ్రావణి 'నేను మేనేజ్ చేస్తానన్నట్టుగా' నా వైపు చూసింది. శ్రావణి కారు తలుపు తీసి కిందికి దిగింది. అన్ని దిక్కులా చూస్తూ, అందరికీ రెండు చేతులెత్తి నమస్కరించింది. "సైలెన్స్‌గా ఉంటే తను మాట్లాడతానని" చెప్పింది. దాంతో ఊరు ఊరంతా నిశ్శబ్దమై పోయింది.

"నేను ఈ ఊరు ఎందుకు వచ్చానో తెలుసా?" అని వారిని అడిగి నా వైపు చూసింది.

బిత్తరపోయి, నేను కూడా కారు దిగాను.

నేను కూడా అందరికీ నమస్కరించాను. నేను ఆ ఊరివాడినే అయినా, నాకు అంత గౌరవం ఏనాడూ దక్కలేదు. మనవాళ్ళను అభిమానిస్తాము కానీ ఒకరినొకరు గౌరవించుకోము కదా. కానీ, ఇప్పటి పరిస్థితి వేరు.

శ్రావణి నన్ను చూపిస్తూ, "మీ ఊరివాడయిన డైరెక్టర్‌గారి ఊరు చూద్దామనీ, వారి అమ్మానాన్న లను కలిసి వారి ఆశీర్వచనం తీసుకుందామనీ వచ్చాను. మీ అందరినీ కలుసుకోగలిగాను. థాంక్స్.



ఇక మీరు మమ్మల్ని వదిలేస్తే ఇంటికి వెళ్తాం" అని నవ్వుతూ, టాటా చెప్పింది.

"మళ్ళీ ఎప్పుడొస్తారు మేడం?" అని ఒకరు ప్రశ్నించారు.

"మళ్ళీ మళ్ళీ వస్తూనే ఉంటాను."

"ఎందుకు మేడం? మీరిద్దరూ ప్రేమించుకుంటు న్నారా? పెళ్ళి చేసుకోబోతున్నారా?" అని ఒక కొంటె కోణంగి అడగనే అడిగాడు.

"ఊc, ప్చ్!" అంది నవ్వుతూ.

శ్రావణి ఈ రూపం నాకు కొత్తది. క్రౌడ్‌ని ఎలా కంట్రోల్ చేయాలో శ్రావణికి బాగా తెలుసులా ఉంది. వాళ్ళ ప్రశ్నకు సమాధానం చెప్పకుండానే, చెప్పినట్టుగా భ్రమింపచేసి కారెక్కింది.

ఇంతలో నా మిత్రులు కనపడ్డారు.

"ఏంట్రా, ఇదంతా?"

"ఇదంతా నీ గురించి కాదులేరా! మా హీరో యిన్ శ్రావణి గురించి! చూశావా, అంతమందిని ఎలా హ్యాండిల్ చేసిందో! ఇంకా ఇక్కడ ఉండడం మంచిది కాదు."

"ఈ గుంపులో నుంచి బయటపడి, ఇంటికి ఎలా వెళ్ళాల్రా?" అని అడిగాను.

"ఇక్కడి నుంచి మీ ఇంటి వరకు నడిచి వెళ్తే...." అన్నాడు వాడు.

నాకు అంతకన్నా ఒక బెటర్ ఐడియా వచ్చింది. 'ఆడి' కారుకు ఉన్న సన్‌రూఫ్ తెరిచాను. శ్రావణి నిలబడితే అందరికీ కనపడుతుంది. శ్రావణి నిలబడి అందరికీ టాటా చెబుతుంటే; ఈలలు, చప్పట్లు, డాన్సులతో ఆ ప్రదేశమంతా మారుమోగుతుంటే, నేను మెల్లిగా కారుని ఇంటి దారి పట్టించాను.

కారులో నుంచే అమ్మకు ఫోన్ చేసి,

"ఏంటమ్మా! ఊరంతా సర్కస్‌లా తయారయింది. మేమొస్తున్న విషయం ఎందుకు చెప్పావ"ని అడి గాను.

అమ్మ చిన్నగా నవ్వింది.

"సరే గానీ, మెయిన్ గేట్ తీసి ఉంచు. మేము కారులో లోపలికి రాగానే గేటు వేస్తే గానీ వీళ్ళు మమ్మల్ని బ్రతకనిచ్చేటట్టు లేరు" అని చెప్పాను.

ఇంట్లోకి వెళ్ళగానే శ్రావణి అమ్మానాన్నల పాదాలకు నమస్కరించింది. తను తెచ్చిన నెక్లెస్‌ని ఆప్యాయంగా తనే అమ్మ మెడకు అలంకరించింది.

అమ్మ కళ్ళు చెమర్చాయి.

నేను ప్రయోజకుడిని అయ్యానో లేదో తెలి యదు కానీ, అమ్మ కళ్ళల్లో మెరుపు చూసిన తర్వాత, నేను ఈ పని ఎప్పుడో చేసి ఉండాల్సిందని అనిపించింది. కానీ, ఇది కూడా ఒకందుకు మంచిదే. శ్రావణి చేతుల మీదుగా అమ్మను అలంకరించడం

ఒక శుభ పరిణామం.

నాన్నకు కూడా కొత్త బట్టలు పెట్టింది.

అమ్మ శ్రావణిని దగ్గరకు తీసుకుని,

"చక్కగా దేవుడి గుళ్ళో దేవతా విగ్రహంలా ఉన్నావు తల్లీ" అంది.

శ్రావణి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"ఎందుకు తల్లీ! ఏడవకమ్మా! ఇక నుంచి నీ కంట్లో కన్నీరు రాకూడదు. మేము తెలుసుకోవాల్సిన విషయాలన్నీ మా వాడు మాకు చెప్పాడు. నువ్వు మా ఇంటి కోడలివి కావాలి. మా వాడి జీవితాన్ని నందనవనం చేయాలి" అంటూ శ్రావణి చేతులను ఆప్యాయంగా నిమిరింది.

అమ్మకు శ్రావణిని కేవలం చూడడంతో తనివి తీరడం లేదు. తనను ఏదో ఒక వంకతో ముట్టుకుంటూనే ఉంది.

మా ఇంటి పెరట్లో పూసిన సన్నజాజి మల్లెల దండ శ్రావణి తలలో పెడుతూ, "నీ జుట్టు ఎంత బావుందో" అని ఆశ్చర్య పోయింది.




ఎర్రని రంగులో మెరిసిపోతున్న శ్రావణి గోరింటాకు అరచేతులను చూస్తూ, మురిసిపోతూ,

"ముట్టుకుంటే మాసిపోయేటట్టున్నావమ్మా!" అంది.

శ్రావణి సిగ్గుపడుతూ, "అదేం లేదత్తయ్యా!" అంది.

మేము ఇంటికి చేరుకున్న తర్వాత రెండు మూడు గంటల వరకు కూడా మా ఇంటి చుట్టుపక్కల సందడి తగ్గలేదు. చెట్లు, పుట్టలు, బంగ్లాలు, గోడలు ఎక్కి చూడసాగారు. శ్రావణి అప్పటికే ఐదారుసార్లు బయటకు వచ్చి అందరికి నమస్కరించి, టాటా చెప్పడంతో వాళ్ళు శాంతించారు.

అందరం కలిసి కింద కూర్చుని, అమ్మ అరిటాకులలో పెట్టిన అన్నం తిన్నాము.

సాయంత్రం, ఊరి చివర గుట్ట మీద ఉన్న, మా ఇంటి ఇలవేల్పు, అమ్మవారి గుడికి వెళ్ళాము. అక్కడ అమ్మ మా ఇద్దరి పేరు మీద అర్చన చేయించింది. అందరికీ శ్రావణిని కాబోయే కోడలిగా పరిచయం చేసింది.

పడవలాంటి నా కారూ, నేను తెచ్చిన లక్షల విలువైన నగలూ చూసి అమ్మ తృప్తి చెందింది. ముఖ్యంగా శ్రావణిని చూసి నేను ప్రయోజకుణ్ణయ్యానన్న గర్వం ఆమె ముఖంలో ప్రస్ఫుటంగా కనిపించింది. అది నేను డబ్బులు ఖర్చులు పెట్టినందుకు కాదు. నా జీవితం ఒక గాడిలో పడుతూ, ఒక స్థిరత్వం వచ్చినందుకని నాకనిపించింది.

కానీ, నేనింకా త్రిశంకు స్వర్గంలోనే ఉన్నాననీ, ఇంకా స్థిరపడేంత స్థోమత సంపాదించలేదనీ అమ్మకు తెలియదు. కానీ, ఈ విషయాలన్నీ చెప్పి ఆమెను బాధపెట్టడం ఎందుకని నేను కూడా చెప్పలేదు.

కొంచెం వెలుతురుండగానే తిరుగు ప్రయాణానికి తయారయ్యాము.

అమ్మ నన్ను ఒంటరిగా లోపలికి రమ్మని పిలిచింది.

"ఒక్క మాట నిజం చెప్పరా? ఆ అమ్మాయి నిజంగా నిన్ను పెళ్ళి చేసుకుంటుందా? లేక ఇద్దరూ కలిసి మా ముందు నటిస్తున్నారా?" అని అడిగింది.

నేను ఫక్కున నవ్వాను.

నేను నవ్వేసరికి అమ్మ బుంగమూతి పెట్టింది.

"నీకెందుకే ఆ అనుమానం? ఎందుకలా అడుగుతున్నావ్?"

మా అమ్మ కూడా తక్కువ తినలేదు. అవకాశం దొరికింది కదా అని,

"ఎందుకా? తను చూస్తే బంగారు బొమ్మలా ఉంది. నీలాంటి కోతి ముఖాన్ని చేసుకుంటుందా అని డౌటొచ్చింది. అందుకే అడిగాను" అంది చిలిపిగా నవ్వుతూ.

ఇప్పుడు అలగడం నా వంతు అయ్యింది.

అమ్మ నన్ను దగ్గరకు తీసుకుని, బుగ్గలు పులిమి, నుదుటిమీద ముద్దుపెడుతూ,

"చూడ్డానికి చాలా నెమ్మది మనిషిలా ఉంది. తనను చేజారనీయకు!" అంది.

నా కళ్ళు చెమర్చాయి. బిడ్డ మనసును తల్లి మాత్రమే గ్రహిస్తుంది. మా అమ్మ కూడా అంతే. అమ్మను కౌగలించుకుని,

"లేదమ్మా! చేజారనీయను" అన్నాను.

అమ్మానాన్నల దగ్గర వీడ్కోలు తీసుకుని బయల్దేరుతుంటే, అమ్మా శ్రావణి కళ్ళనీళ్ళు పెట్టుకున్నారు. మళ్ళీ రమ్మని అమ్మ చెప్పింది. వస్తానని శ్రావణి చెప్పింది, కళ్ళు తుడుచుకుంటూ.

అమ్మానాన్నా శ్రావణిని చూసి సంతోషపడడం, అక్కున చేర్చుకోవడం నాకు బాగా నచ్చింది. హాయినిచ్చింది. గాల్లో తేలుతున్నట్లే హైదరాబాదుకు బయల్దేరాం.

దారిలో శ్రావణి అడగనే అడిగింది. నేనూహిస్తూనే ఉన్నాను. అమ్మ నన్ను లోపలికి పిలిచి మాట్లాడినప్పటి నుంచి శ్రావణి కొంచెం అన్యమనస్కంగానే ఉంది.

"అత్తమ్మ నా గురించి ఏమైనా చెప్పిందా?"

"చెప్పింది!"

"ఏమంది?" అని అడిగింది ఆత్రుతగా.

"నిన్ను నిజంగానే పెళ్ళి చేసుకుంటుందా అని అడిగింది."

"ఛీ పోండి. నిజం చెప్పండి."

"నిజమే! కోతి లాంటి నిన్ను చేసుకోవడానికి ఎందుకు ఒప్పుకుందిరా అని అనుమాన పడింది."

"అది మాత్రం నిజం. ఎందుకండీ నేను మీలాంటి కోతి ప్రేమలో పడ్డాను?" అని అడిగింది అమాయకంగా ముఖం పెడుతూ.

"ఏయ్!" అన్నాను.

"వ్వె వ్వె" అని వెక్కిరించి, నా భుజం మీద వాలిపోయింది.

****

హైదరాబాద్‌కి చేరుకునే సరికి రాత్రయింది. మళ్ళీ యాంత్రిక జీవనంలోకీ, మరమనుషుల మధ్యన జీవనం గడపాలనుకునేసరికి నీరసం వచ్చింది. అమ్మ ప్రేమ, ఊరి వాళ్ళ ఆప్యాయత తాలూకు పరిమళాలు, ఇంకా మమ్మల్ని అంటిపెట్టుకునే ఉన్నాయి. కానీ, తప్పదు.

అది జన్మభూమి.

ఇది ఖర్మభూమి.

నాకయితే కర్మలు అనుభవించాల్సిన భూమి అనిపిస్తుంది. మళ్ళీ రేపటి నుండి పోరాటాలు, ఎత్తుకు పై ఎత్తులు, ఎదుటివాణ్ణి ఎలాగయినా ఓడించాలనే మూర్ఖత్వం తప్పవు.

ఈ ఒక్క రోజు అనుభవం, మలయ సమీరంలా మనసును ఉల్లాసపరిచింది. అభిమానపు సరస్సులో ఓలలాడించింది. ఈ ఉత్సాహంతోనే ముందుకు సాగాలి. ఎప్పుడూ ఊళ్ళో ఉండే వారికి పట్నం మీద మోజు. పట్నవాసులకు పల్లెలు స్వర్గధామాలు.

వస్తూ దారిలో దాబాలో లైటుగా, వేడిగా, చెరో రెండు రుమాలీ రోటీలు తిన్నాము.

ఆ రాత్రిపూట మురికి కూపంలా ఉన్న సందులో, తన ఇంటి ముందు శ్రావణిని దించి వస్తుంటే నా పంచ ప్రాణాలు అక్కడ వదిలి వస్తున్నంత బాధ కలిగింది.

రాత్రంతా శ్రావణి గురించిన కలలు కంటూ నిద్రపోయాను. కలలో అమ్మా, శ్రావణి పట్టుచీరలు, రకరకాల నగలు పెట్టుకుని ఇల్లంతా హడావుడిగా తిరుగుతున్నట్లు కలలు వచ్చాయి. ఎంత బావుందో!

**(ఇంకా వుంది)**






## లైఫ్ రికార్డర్

జ్ఞాపకాలు పదిలపరుచుకోవడం అంటే చాలా మందికి ఇష్టం ఉంటుంది. డైరీ రాయడం ద్వారానో, ఫొటోలు, వీడియోల ద్వారానో మధురస్మృతులను పదిల పర్చుకుంటారు. అలా స్పెయిన్‌కి చెందిన ఓ వ్యక్తి ఆరేళ్ళుగా తన జీవితాన్ని రికార్డు చేస్తున్నాడు. ప్రతీ క్షణం ఏం చేశాడన్న విషయాన్ని ఎప్పటికప్పుడు డైరీలో రాస్తూ, కెమెరాలో బంధిస్తున్నాడు.

దానికో కారణం ఉంది. స్పెయిన్‌లోని మాడ్రిడ్‌లో ప్రొఫెసర్‌గా పని చేస్తున్న మారిస్ విల్లారోయెల్‌కు 46 ఏళ్లు. ఆరేళ్ల క్రితం వరకు తన జీవితం అందరిలాగే ఉండేది. అయితే 2010లో తన 40వ పుట్టిన రోజు జరుపుకున్న అతనిలో ఒక ఆలోచన కలిగింది. ఈ 40ఏళ్లలో తాను ఏం చేసింది.. ఎక్కడికి వెళ్లింది తన జ్ఞాపకాల్లో తప్ప మరెక్కడ లేదనిపించింది. అందుకే వచ్చే 40ఏళ్లలో ప్రతీ క్షణం ఎలా గడిచిందో సజీవంగా గుర్తుండిపోవాలని భావించాడు. దీంతో 2010 నుంచి తన వెంట నిత్యం ఒక బుక్ పెట్టుకున్నాడు. ఫిట్‌నెస్ ట్రాకర్ ధరించి ఛాతికి ఒక కెమెరా అమర్చుకున్నాడు. ఆ కెమెరా ప్రతి 30 సెకన్లకో ఫొటో తీస్తూ ఉంటుంది. తను వెళ్లిన ప్రతిచోటటా చోటుచేసుకున్న సంఘటనలను, చేసే ప్రతీ పనిని బుక్‌లో రాసుకుని, ఫొటోల్లో బంధిస్తున్నాడు. ఇప్పటికి ఆరేళ్లు అయింది. వృద్ధాప్యం వచ్చాక గతంలో తనేం చేశాడో తనతో పాటు తన వారసులు కూడా తెలుసుకునే ఛాన్స్ ఉందని అతను చెబుతున్నాడు.

## డబ్బు చెట్లు

ఎవరైనా విపరీతంగా డబ్బు ఖర్చుపెడుతుంటే 'డబ్బేమైనా చెట్లకు కాస్తోందనుకుంటున్నావా?' ఎలా పడితే అలా ఖర్చు పెడుతున్నావ్? అంటూ మందలిస్తుంటారు. ఆ ఊళ్లో మాత్రం అలా అన్నప్పుడు 'అవును అనే సమాధానం వినిపిస్తుంది. ఆ విశేషాలేంటో తెలుసుకోవాలనుకుంటున్నారా? చదవండి మరి! ఇంగ్లండ్‌లోని ఉడ్‌ల్యాండ్‌లో చాలా చోట్ల రకరకాల దేశాలకు చెందిన నాణేలతో నిండిన వృక్షాలు కనిపిస్తుంటాయి. ఈ చెట్లను అనుకోకుండా చూసిన వారు ఎవరైనా సరే అవాక్కవ్వాల్సిందే. ఒకటో రెండో కాదు వేలాది నాణేలు చెట్ల బెరడుపై అతుక్కుని ఉంటాయి. అందుకే వీటిని 'మనీ ట్రీ'లు అని పిలుస్తారు. అవి నిజంగా డబ్బు చెట్లేమో అనుకునేరు ఇవన్నీ మనుషులు పెట్టినవే. ఈ నాణేలు ఎలా వచ్చాయి అంటే.. కొన్ని వందల ఏళ్ల క్రితం అక్కడి స్థానికులు కొన్ని రకాల వృక్షాల్లో చిల్లర డబ్బులు ఉంచేవారట. ఇలా చేస్తే అదృష్టం కలిసివస్తుందనీ, ఈ చెట్లలో ఉన్న ఆత్మలు సంతోషించి తమ కోరికలు తీరుస్తాయనీ నమ్మేవారు. ఇప్పటికీ ఈ చెట్లపై ఉన్నాయని భావించే దైవ సంబంధ ఆత్మల ప్రీతి కోసం స్థానికులు క్రిస్మస్ రోజు మిఠాయిలు, బహుమతులు ఉంచుతారు.

## బొరియల గుహలు

అనగనగా ఓ చిన్న పల్లెటూళ్ళో ఓ పొలం. ఆ పొలంలో నేలపై రంధ్రాలు. చూడటానికి అచ్చం కుందేళ్ళ బొరియలో, ఎలుకల బొరియలో అనుకుంటారు. కాని నిజానికి అవి బొరియలు కావు. పేద్ద పేద్ద గుహలు.

ఇంగ్లండ్‌లోని ఓ చిన్న పల్లెటూరులో బొరియల్లాంటి పెద్ద పెద్ద రంధ్రాలు ఉన్నాయి. పైకి చూడటానికి రంధ్రాల్లా కనిపించినా తవ్విచూస్తే అడుగున గుహలు బయటపడ్డాయి. వాటి లోపలికెళ్తే ఎన్నో ఆశ్చర్యకరమైన విషయాలు వెలుగు చూశాయి. ఈ గుహలు 12వ శతాబ్దానికి చెందినవని కొందరు, 18వ శతాబ్దానికి చెందినవని మరికొందరు వాదిస్తున్నారు. ఈ రహస్య మార్గాల ద్వారా జెరూసలెం వెళ్తున్న యాత్రికులపై నిఘా వేయడానికే నిర్మించారని కొందరంటే, మరికొందరు క్వారీ తవ్వకాల వల్ల భూగర్భం డొల్లగా మారిందని, దాన్నే క్వారీ యజమానులు కొన్ని మార్పులు చేసి గుహలుగా మార్చారని అంటున్నారు.



ఈ చీకటి గుహల గోడలపై అక్కడక్కడా చిన్నచిన్న గూళ్ళు, దీపాలు పెట్టడానికి అనువుగా కనిపిస్తాయి.

ఎన్నాళ్లుగానో మరుగునపడిన ఈ గుహలు ఓ ఫొటోగ్రాఫర్ తీసిన ఫొటోలతో ఒక్కసారిగా వెలుగులోకి వచ్చాయి. అప్పట్నుంచి వీటిని రహస్య గుహలని పిలుస్తున్నారు.

## హాట్ హాట్ పెళ్ళి

ప్రతి ఒక్కరూ ప్రతీ విషయంలోనూ ఏదో ఒక కొత్తదనం కోరుకుంటున్నారు. అది పెళ్ళయినా, ఫంక్షనయినా, ఇతరత్రా ఏ కార్యక్రమమైనా సరే. అలాంటి ఆలోచనతోనే పదహారు జంటలు కలిసి వినూత్నంగా పెళ్ళి వేడుకలు జరుపుకున్నారు, అదీ గాల్లో ఎగురుతూ! పెళ్ళిమండపాలు, బాజాభజంత్రీలు ఇవన్నీ ఎందుకూ? కాస్తంత భిన్నంగా పెళ్ళి చేసుకుందాం అనుకున్నారు చైనాలోని యునాన్ రాష్ట్రానికి చెందిన పదహారు జంటలు. ప్రణాళిక సిద్ధమైంది.




రంగురంగుల హాట్ ఎయిర్‌బెలూన్లలో పెళ్ళికి సిద్ధమయ్యారు. గొలియాంగ్ పర్వతాలకు సమీపంలో ఉన్న ర్యాప్ పూలతోటను తమ పెళ్ళి వేదికగా నిర్ణయించుకుని, ఆకాశంలో హాట్ ఎయిర్‌బెలూన్లలో విహరిస్తూ, ప్రకృతి అందాలను తనివితీరా ఆస్వాదిస్తూ పెళ్ళి చేసుకున్నారు. వార్తల్లో నిలిచి, అందరి దృష్టినీ ఆకర్షించారు.

–నర్మద వాసిరెడ్డి



ఉంటే, చిన్నవయసులోనే ఒక ఆడబిడ్డకు తల్లయిన శంకరమంచి జానకి చంటిబిడ్డను చంకనెత్తుకుని నటిగా అవకాశాల కోసం సినిమా ఆఫీసుల చుట్టూ తిరిగారు. 'షావుకారు'లో హీరోయిన్ అవకాశం సాధించి, తొలి చిత్రంతోనే మంచి సహజనటిగా అందరి ఆదరాభిమానాలూ సంపాదించి, 'షావుకారు జానకి'గా పేరు తెచ్చుకున్నారు.

మరి కృష్ణకుమారి విషయానికొస్తే ఆమెకు అవకాశం రావడం 'కేక్ వాకింగే' అయింది. ఆ రోజుల్లో చెన్నై పాండీబజార్‌లోవున్న రాజకుమారి థియేటర్‌లో 'స్వప్నసుందరి' సినిమా చూడ్డానికి వెళ్ళారు కృష్ణకుమారి. ముందు వరసలో కూర్చున్న ఓ యువతి అప్పుడప్పుడు వెనక్కి తిరిగి కృష్ణకుమారినే చూస్తూ, ఆమె మాటతీరునే గమనిస్తున్నారు. ఆమె ఓ దర్శకనిర్మాత కూతురు! వాళ్లు తీయబోయే తెలుగు చిత్రం 'నవ్వితే నవరత్నాలు'కు నూతన కథానాయికను వెతుకుతున్నారు. ఇంకేముంది? వాళ్లకు సినిమా థియేటర్‌లోనే హీరోయిన్ దొరికేసింది! అలా కృష్ణకుమారి ఆ చిత్రంలో ఆనాటి హీరో రామశర్మ సరసన హీరోయిన్‌గా అవకాశం దక్కించుకుంది! 'నవ్వితే నవరత్నాలు' (1951) ఆమె నటించిన తొలి చిత్రమే అయినా ఆ తర్వాత నటించిన 'మంత్రదండం' దీనికంటే ముందుగా విడుదలైంది. అందులో నాయకుడు అక్కినేని!

జానకి, కృష్ణకుమారిల చెల్లెలు దేవకి. ఆమె ఆ రోజుల్లోనే కొన్ని చిత్రాల్లో నటించి, ఆ తర్వాత చిత్రసీమనుంచి నిష్క్రమించారని అప్పట్లో అనేవారు. మరి ఆమె గురించిన వివరాలు కూడా ఈ పుస్తకంలో ఉండొచ్చునేమో!

### గట్టిపోటీ ఎదుర్కొన్న నటి

అప్పట్లో కృష్ణకుమారి నటిగా గట్టి పోటీ ఎదు

# అపురూప నటి కృష్ణకుమారికి అరుదైన కితాబు

**ఓ అసుర సంధ్యవేళ 'నవ్య' వీక్లీ ఎడిటర్ జగన్నాథశర్మగారి దగ్గర్నుంచి ఫోన్! తప్పనిసరిగా ఏదో విశేషమే అయివుండాలి. "నాటి ప్రముఖతార కృష్ణకుమారి దగ్గర్నుంచి ఓ కబురొచ్చింది. ఆమె కుమార్తె దీపిక, కృష్ణకుమారి లైఫ్ గురించి, ఆమె సినిమాల గురించి ఇంగ్లీషులో భారీఎత్తున అద్భుతమైన వర్ణచిత్రాలతో ఓ పుస్తకం రూపొందించారట. దాని ఖరీదే మూడువేల రూపాయలు! మన 'నవ్య' వీక్లీకి మాత్రమే 'ఎక్స్‌క్లూజివ్'గా పంపిస్తున్నట్లు చెప్పారు. అది రేపో, ఎల్లుండో వస్తుంది. ఆ పుస్తకాన్ని మీరు 'రివ్యూ' చెయ్యాలి అన్నారు.**

'ఇంగ్లీషులో రాసిన పుస్తకాన్ని 'ఎక్స్‌క్లూజివ్'గా 'నవ్య'కు పంపించడంలో కృష్ణకుమారిగారి ఉద్దేశం ఏమిటో అర్థమైంది. అవును మరి.. సాహిత్య, సాంస్కృతిక, రాజకీయ, సినీ విశేషాలను పాఠకులకు ఆసక్తిదాయకంగా అందించడంలో 'నవ్య' నిత్యనూతనంగా చేస్తున్న కృషే ఆ ప్రత్యేకతను సంతరింపజేసిందనడంలో ఆశ్చర్యమేమీలేదు. ఇక ఆ పుస్తకం చేతికి అందేలోగా కృష్ణకుమారి, ఆమె అక్క 'షావుకారు' జానకిగార్ల ఆలోచనలు నన్ను చుట్టుముట్టాయి.

టేకుమళ్ళ కృష్ణకుమారి జీవితంలోకూడా జానకిగారి జీవితంలోలాగే ఎన్నో ఆసక్తిదాయకమైన ఘట్టాలు. ఆ అక్కాచెల్లెళ్ల జీవితాల్లో ఎన్నో వైరుధ్యాలు ఉన్నాయి!

### సినిమా థియేటర్‌లో దొరికిన హీరోయిన్

తన భర్త బాధ్యతారహితంగా వ్యవహరిస్తూ




**మై మదర్ టి. కృష్ణకుమారి** (ఆంగ్లం)
**రచన:** దీపికా వి.మైయా
**ధర:** మూడు వేల రూపాయలు
**పేజీలు:** 290
**ప్రతులకు:** మైయా పబ్లిషింగ్
నెం.17/1, III క్రాస్, హెచ్. సిద్ధయ్యరోడ్,
బెంగళూరు–560 027

ర్కోవలసి వచ్చింది. అంజలీదేవి, భానుమతి, ఎస్.వరలక్ష్మి, సావిత్రి, జమునవంటి హీరోయిన్స్‌తో పాటు, అక్క జానకి కూడా పోటీయే మరి! (ఇద్దరూ కలిసి 'పిచ్చిపుల్లయ్య', 'గంగాగౌరీ సంవాదం', 'డా. చక్రవర్తి' చిత్రాలలో నటించారు:) మరి ఆ పోటీని విజయవంతంగా ఆమె ఎలా ఎదుర్కోగలిగారన్నది తప్పని సరిగా ఆ పుస్తకంలో చర్చించి ఉండాలి!

సాధారణంగా అగ్రహీరోలతో నటించిన హీరోయిన్లు ఆ తర్వాత చిన్నహీరోలతో నటించడానికి పెద్దగా ఆసక్తి చూపరు. కానీ కృష్ణకుమారి నట జీవితాన్ని పరిశీలిస్తే ఆమె అక్కినేని, ఎన్‌టిఆర్ వంటి అగ్ర హీరోలతో నటిస్తూనే మరోప్రక్క కాంతారావు, జగ్గయ్య, బాలయ్య, చలం, అమర్‌నాథ్, హరనాథ్ వంటి హీరోల సరసన కథానాయిక పాత్రలు పోషించేవారు. కొన్ని అతిసాధారణ చిత్రాల్లో కూడా నటించారు. ఎందుకలా...? అనే విషయం పుస్తకంలో చెప్పకుండా ఎలా ఉంటారు?

షావుకారు జానకి ఎప్పుడూ 'రెబెల్' అనిపించుకునే వారు. తనకు నచ్చిన, తను కోరుకున్న జీవితానికి ప్రతిబంధకంగా నిల్చిన శక్తులను ధీటుగా ఎదుర్కొని, ఆ విషయాలను వ్యక్తం చేయడానికి వెనుకాడే వారు కాదు. అరవైలలోనే ఆమె నేటి 'ఫెమినిస్టు' భావాలను బహిరంగంగా ప్రకటించేవారు !

## ఎన్టీఆర్, కృష్ణకుమారిపై పుకార్లు!

మరి కృష్ణకుమారి మాత్రం ఎప్పుడూ 'లో ప్రొఫైల్' లోనే ఉండేవారు. 'లక్షాధికారి' చిత్రం షూటింగ్ మద్రాసు బీచ్ ఒడ్డున జరుగుతున్నప్పుడు, సముద్ర అలల తాకిడికి ఒక్కసారిగా కృష్ణకుమారి పడిపోయి, నీళ్ళల్లో కొట్టుకుపోతుంటే, హీరో ఎన్.టి.ఆర్ ఆమెను గట్టిగా పట్టుకుని ఒడ్డుకుచేర్చి కాపాడారు. ఆ రోజు షూటింగ్ కూడా కాన్సిల్ అయిందట. ఆ తర్వాత ఇద్దరిమధ్య అనురాగం చిగురించినట్లు, అది పెళ్ళిదాకా దారి తీసినట్లు పుకార్లు షికార్లు చేశాయి. మరి వాటి నిజానిజాలను కృష్ణకుమారి ఈ పుస్తకంలో ప్రస్తావించకుండా ఎలా ఉంటారు?

కృష్ణకుమారిది 'థర్టీ ఇయర్స్ ఇండస్ట్రీ'! ఎన్నో మిట్టపల్లాలు అధిగమించి ఉంటారు. చిత్ర విచిత్రమైన సంఘటనలను 'ఫేస్' చేసి ఉంటారు. వాటిని ఎప్పుడూ ఇంటర్వ్యూలలో చెప్పలేదు కాబట్టి ఆ అనుభవాలన్నీ ఇప్పుడు రికార్డుచేసి ఉండాలి.

## బికినీకి కత్తెర !

సెక్సీ పాత్రలు లేదా హీరోయిన్ పాత్రల్లో మోతాదు మించిన గ్లామర్‌ను కృష్ణకుమారి ఎప్పుడూ ప్రదర్శించలేదు. అలా అని ఆమె 'మోడరన్' కాదనుకోడానికి లేదు. ఎందుకంటే ఆమె 'లక్షాధికారి' (1963) చిత్రంలో 'బికినీ' ధరించి నటించారు. 'దురదృష్టవశాత్తూ' అది సెన్సారు కత్తెరకు బలైపోయింది గానీ, ఆ దృశ్యాలు చిత్రంలో ఉండి ఉంటే, ఆ రోజుల్లో అదో పెద్ద 'సంచలనం' అయి ఉండేది. ఈ సందర్భంగా బాపు కార్టూన్ ఒకటి కృష్ణకుమారి గురించి రాసింది గుర్తుకొస్తోంది. "అద్భుత నటనము హీరోయినులకు/అక్కరలేదని నమ్మిక జనులకు/వంపుల సొంపులు చెంపల కెంపులు/తారకు తప్పనిసరియగు నింపులు/సన్నటి చక్కటి చిన్నది యన్నది/కృష్ణకుమారికి బిరుదైయున్నది".

## గొప్ప నటీమణి కృష్ణకుమారి

కృష్ణకుమారి వైవిధ్యంగల పాత్రలలో ఎంత ప్రతిభావంతంగా మెప్పిస్తుందో చెప్పడానికి ఉదాహరణగా కె.ప్రత్యగాత్మ దర్శకత్వంలో పి.ఎ.పి వారు వరసగా ఆమెతో తీసిన భార్యాభర్తలు (61), కుల గోత్రాలు (62), పునర్జన్మ (63) చిత్రాలే చాలు! ముఖ్యంగా 'భార్యాభర్తలు' చిత్రంలో శారదగా ఆమె పాత్ర పోషణ! జులాయిగా అమ్మాయిల వెంటబడి తిరిగే నాయకుడు ఆనంద్ (అక్కినేని) తన సిరిసంపదలను అడ్డు పెట్టుకుని, తనంటే ఇష్టంలేని శారదను బలవంతంగా పెళ్ళి చేసుకుంటాడు.

అప్పుడొక ఘట్టంలో 'మనసు ప్రమేయంలేని ఈ దేహమేగా మీకు కావలసింది.., అనుభవించండి' అని శరీరాన్ని అప్పగిస్తున్నట్లుగా ఆమె ముందుకొచ్చి నిలబడుతుంది. ఆ సన్నివేశంలోని నటన మోతాదులో ఏ మాత్రం తేడా వచ్చినా కరుణ రస భరితమైన అద్భుతమైన ఆ సీన్ కాస్తా అభాసుపాలవుతుంది. అక్కడే కృష్ణకుమారి ఎంత గొప్ప నటీమణి అన్నది మనకు స్ఫురిస్తుంది! మరి అలాంటి క్లిష్టమైన సన్నివేశాలెన్నిటినో ఆమె వివిధ చిత్రాలలో నటించి మెప్పించారు. అందుకు ఆమె ఎలాంటి శ్రద్ధ తీసుకునే వారు? 'యమగోల'కు ముందే 1960లో అలాంటిదే 'దేవాంతకుడు' వచ్చింది. అలాంటి హాస్య చిత్రాలలో హాస్యరస పోషణలో కూడా కృష్ణకుమారి రాణించారు. 'హాస్యరస పోషణలో ఆమెకు స్ఫూర్తి ఎవరో? అసలు అక్క షావుకారు జానకి ప్రభావం తనమీద ఉందా? లేదా?.. ఇలా ఎన్నో అంశాలు ఆ 'భారీ' పుస్తకంలో ఉంటాయని రకరకాలుగా ఊహించుకుంటూ ఉంటే ఆ పుస్తకం చేతికి రానే వచ్చింది.





## అరుదైన ఛాయాచిత్రాలు

## అభిప్రాయాల మాలిక

'మై మదర్ టి.కృష్ణకుమారి' రచన దీపికా వి. మైయా అని రాసి ఉన్న ఆ బరువైన పుస్తకంలో సినిమా విశేషాలకంటే వంటలే ఎక్కువగా చోటు చేసుకున్నాయి. చక్కని ఖరీదైన పేపర్‌పై అరుదైనవి, అపురూపమైన వర్ణచిత్రాలు, నలుపు-తెలుపు చిత్రాలు కృష్ణకుమారి బాల్యం, కుటుంబసభ్యులతో వివిధ సందర్భాలలో దిగిన ఫొటోలు కృష్ణకుమారికి ఇష్టమైన వంటల ఛాయాచిత్రాలు. ప్రముఖులతో కృష్ణకుమారి...వీటి మధ్య అక్కడక్కడా ఆమె సినిమా జీవితాన్ని అతి క్లుప్తంగా పరిచయం చేసే అంశాలు మనల్ని ఆశ్చర్యపరిచేలా ఉన్నాయి!

'మా అమ్మ కృష్ణకుమారి' అనగానే ఆమె జీవితంలోని వైవిధ్యాన్ని, వైరుధ్యాలను ఆమె పెంపుడు కూతురు దీపిక లోతుగా చర్చిస్తుందని నాలా ఆశించిన వారికి నిరుత్సాహం కలిగినా, కృష్ణకుమారి అభిమానులు, సినిమా అభిమానులను ఆకట్టుకునే కొన్ని అంశాలు ఈ పుస్తకంలో లేకపోలేదు. ఉదాహరణకు కృష్ణకుమారి జీవితంలో భర్తగా అజయ్ మోహన్ ఖైతాన్ ఎలా ప్రవేశించారు? కృష్ణకుమారి గురించి అక్కినేని, బి.సరోజాదేవి, శ్రీదేవి, డి.రామానాయుడు వెలిబుచ్చిన అభిప్రాయాలు, ఆమె నటించిన ఏకైక హిందీ చిత్రం 'కభీ అంధేరా కభీ ఉజాలా' (హిందీలో ఆమెపేరు 'రతి'గా మార్చారు) స్టిల్స్, ఇంకా ఆమె నటించిన తమిళం, కన్నడ చిత్రాల స్టిల్స్, కృష్ణకుమారి గృహప్రవేశ కార్యక్రమంలో జయలలిత నృత్య ప్రదర్శన ఫొటోలు మరెన్నో అరుదైన ఛాయా చిత్రాలు.. అన్నిటికంటే ముఖ్యంగా కృష్ణకుమారి చిత్రరంగ ప్రవేశం చేశాక ఆమె కవర్ పేజీలలోవచ్చిన కినిమా, ఢంకా, చిత్రవాణి, చిత్రసీమ, ధ్వని, ఆనాటి ఆంధ్రప్రభ, ఆనాటి ఆంధ్రపత్రిక ముఖచిత్రాలను ఒక్కచోట ప్రచురించిన తీరు ప్రశంసనీయంగా ఉంది.

షావుకారు జానకి నటనలోనే కాదు పాక శాస్త్రంలో కూడా ప్రవీణురాలని నిరూపించుకున్నారు. (ఆమె 'కోకోనట్ గ్రోవ్' అనే హోటల్ కూడా నిర్వహించారు) అలాగే కృష్ణకుమారి కూడా వంటల్లో తానూ వెనుకబడలేదని ఈ పుస్తకంలో నిరూపించారు.

చిత్రసీమలో సాధారణంగా స్టోరీ సిట్టింగ్స్ ఫైవ్ స్టార్ హోటల్స్‌లో విలాసవంతమైన వాతావరణ నేపథ్యంలో జరుగుతూ ఉండడంపై ఓ చతురోక్తి ఉంది. అక్కడ జరిగే కథా చర్చల్లో కథతప్ప తక్కిన వన్నీ చర్చిస్తారట! కృష్ణకుమారిపై అట్టహాసంగా వచ్చిన ఈ భారీ పుస్తకం ఆసాంతం చదివాక, అదే గుర్తుకొచ్చింది!

**–బి.కె.ఈశ్వర్ , సెల్ 98854 47306**



# సాఫ్ట్‌వేర్‌లో సరిగమలు

18



-కంఠంనేని స్వప్న

**సోనీ మెలికలు తిరుగుతోంది.**

**ఈ పిల్లకి ఇప్పుడు సర్జరీ అర్జంట్‌గా అవసరమంటే తను కార్లో ఎక్కించిన పిల్లలకోసం వెతకటం మొదలెడతారేమో! వాళ్ళు బయటికి వెళ్ళే లోపే దొరికి పోతారేమో! అప్పుడు గాప్ ఇవ్వకుండా వాళ్ళ అవయవాలన్నీ ఒలిచేసు కుంటారు వీళ్ళు.**

**ఆందోళనగా ఉంది అక్షయ్‌కి.**

**రూమ్ లోపలికి ప్రవేశించాడు.**

**ఎమర్జెన్సీలో అవసరం అయితే నర్స్ లేక డాక్టర్ కోసం ప్రెస్ చేయాల్సిన బెడ్‌కి ఉన్న బటన్ నొక్కాడు.**

సోనీ వాళ్ళ తాతని తట్టిలేపాడు.

డ్యూటీలో ఉన్న కన్సల్టింగ్ డాక్టర్‌కి మెసేజ్ వెళ్ళింది.

కార్నియా రీప్లేస్‌మెంట్ సర్జరీలు పూర్తిచేసి డ్యూటీ ముగించుకున్న డాక్టర్ కార్ దగ్గరికి చేరుకున్నాడు.

రిమోట్‌తో కార్ అన్‌లాక్ చేశాడు.

డిక్కీలో ఉన్న పిల్లలు ఊపిరి బిగ పట్టి కూర్చున్నారు.

డ్రైవింగ్ సీట్‌లో కూర్చుని తన స్నేహితుడు, కార్డియాలజిస్ట్‌కి ఫోన్ చేశాడు.

తొందరగా బయలుదేరడేమిటి? పిల్లలకి టెన్షన్‌గా ఉంది. అవతల ఫోన్ రింగవుతోంది కాని ఎత్తడం లేదు.

'ఎప్పుడూ ఫోన్ దగ్గర పెట్టుకోడు.

ఎమర్జెన్సీ వస్తే ఎలా తెలుస్తుంది?' విసుక్కుంటూ కార్ స్టార్ట్ చేశాడు.

'బ్లూ టూత్' చెవికి అమర్చుకుని, మళ్ళీ ఫోన్ రింగ్ చేసి రివర్స్ తీసుకుంటున్నాడు. అప్పుడు ఆన్సర్ చేశాడు కార్డియాలజిస్ట్.

'పని లేకపోయేసరికి కునుకు పట్టేసింది. అందుకే ఇందాక నీ కాల్ చూసుకోలేదు' సంజాయిషీ ఇచ్చాడు.

'ఫర్వాలేదు. ఈ మధ్య కొంచెం గుండె దడగా ఉంటోంది. నువ్వు చూడాలొకసారి' అన్నాడు.

'రేపు కొంచెం తొందరగా వర్క్ ముగించుకుని వచ్చేయి. అన్ని టెస్ట్‌లు చేస్తాను. స్ట్రెస్ వల్ల అయి ఉంటుంది. ఏమి ఉద్యోగాలో మనవి. పగలూ, రాత్రీ ఉండదు. పైగా ఇక్కడ డీల్ చేసే వాళ్ళంతా హైప్రొఫైల్ పేషెంట్స్ కావటంతో ఏమితేడా వస్తుం దోననే టెన్షన్ ఒకటి. యాంగ్జయిటీ వల్లనేమో!" చెప్తున్నాడు కార్డియాలజిస్ట్.

'ఎమర్జెన్సీ అట. మెసేజ్ వచ్చింది. నేను వెళ్ళాలి' చెప్పి ఫోన్ పెట్టేశాడు. అప్పుడే కార్ బిల్డింగ్ గేట్ వద్దకి చేరుకుంది.

కారు ఆపి డాక్టరు గేట్ దగ్గర ఉన్న సెక్యూరిటీ సిస్టమ్ మీద చూపుడు వేలు ఆనించాడు.

రిజెక్ట్ చేస్తోంది సిస్టమ్.

***

సోనీ ఉన్న గదిలోకి హడావుడిగా వచ్చారు డాక్టర్లు, నర్స్‌లు.

'మాసివ్ అటాక్' కళ్ళతో సైగలు చేసుకున్నారు. కదలిక లేదామెలో. అప్పటికే స్పృహ కోల్పోయింది. సి.పి.ఆర్ మొదలెట్టారు.

నోటి ద్వారా గాలి అందించేందుకు ప్రయ త్నిస్తూ, చేతితో ఛాతిమీద ప్రెస్ చేస్తున్నారు.

చలనం కలగటం లేదు. సోనీలో ఎటువంటి ప్రతిస్పందనా లేదు.

ఆమె తాత నోటమాట రానట్లుగా నిలబడి పోయాడు.

'షి ఈజ్ డెడ్' అక్షయ్‌తో మెల్లగా అన్నాడు డాక్టర్.

విషయం తెలుసుకున్న అతుల్ తన సహాయ కుడితో చక్రాల కుర్చీ తోసుకుంటూ అక్కడికి చేరు కున్నాడు.

'ఇప్పుడు ట్రాన్స్‌ప్లాంటేషన్ చేద్దాము. మొదటి సారి ఇక్కడ పేషెంట్ చనిపోవటం. అలా జరగ నివ్వను' కార్డియాలజిస్ట్‌తో అన్నాడు.

అక్షయ్‌కి కంగారుగా ఉంది. పిల్లలను బంధిం చిన రూమ్‌కి వెళ్తారేమో ఏదైనా డౌట్ వస్తే కార్స్‌ని గేట్ దాటనివ్వరు.

***

గేటు వద్ద డాక్టరు మళ్ళీ చూపుడు వేలు స్క్రీన్ మీద ఉంచాడు.

మళ్ళీ ఎరుపు రంగు అక్షరాలు – 'రిజెక్టెడ్'.

సెక్యూరిటీ అతను రూమ్ నుంచి బయటికొచ్చాడు.

టిష్యూ పేపర్ అందించి వేలు తుడుచుకుని మళ్ళీ ప్రయత్నించమన్నాడు.

ఈసారి ఫింగర్ ప్రింట్ మాచ్ అయినట్లుంది.

గేట్ తెరుచుకుంది.

సెక్యూరిటీ అతను నవ్వి డాక్టర్‌కి బొటన వేలెత్తి చూపించాడు.

కార్ బయటికి కదిలింది.

***

'బ్రెయిన్ కూడా డెడ్. ఏమీ చేయలేము'



చెప్పాడు కార్డియాలజిస్ట్.

అప్పుడు వైల్డ్‌గా రియాక్ట్ అయ్యాడు సోనీ తాత.

'ఇక్కడ అయ్యే పని కాదంటే నా మనవరాలిని

## జరిగిన కథ

అక్షయ్, కావ్య, సీమ, హర్ష ఓ మల్టీ నేషనల్ కంపెనీలో పనిచేస్తుంటారు. అక్షయ్ వాళ్ళ అక్కా, బావ యాక్సిడెంట్‌లో చనిపోవడంతో, వారి కూతురు నైరాని తన సంరక్షణలోకి తీసుకుంటాడు అక్షయ్. ఒకరోజు నైరా కనిపించకుండా పోతుంది. పోలీస్ ఇన్వెస్టిగేషన్ మొదలవుతుంది. పేపర్లలో వచ్చిన వార్తల ఆధారంగా, సీసీ ఫుటేజ్‌ల ద్వారా, ఇన్‌స్పెక్టర్ శ్రీకాంత్ ఇచ్చిన సమాచారం ఆధారంగా నైరా ఆచూకీ కోసం రకరకాలుగా ప్రయత్నిస్తుంటాడు అక్షయ్. ఆ ప్రయత్నాల్లో భాగంగా ఎంతోమంది చిన్న పిల్లలను కాపాడతాడు. నైరా ఆచూకీ కోసం కావ్య ఒక ఆన్‌లైన్ డిటెక్టివ్ ఏజెన్సీని కాంటాక్ట్ చేస్తుంది. ఓ పెద్ద బిజినెస్‌మాగ్నెట్ మనవరాలికి హార్ట్ ట్రాన్స్‌ప్లాంట్ చేస్తున్నారని తెలుసుకొని, డోనర్‌గా ఆ హా స్పిటల్లోకి ప్రవేశిస్తాడు అక్షయ్. అక్కడ ఓ గదిలో బంధించి ఉంచిన ముగ్గురు పిల్లలను ఎలాగయినా బయటకి పంపించాలని, కారు డిక్కీలో కూర్చోబెడతాడు. ఆ తర్వాత...

వేరే దేశానికి తీసుకెళ్ళేవాడిని. తీసుకొచ్చి రెండు రోజులవుతోంది. ఎందుకు లేట్ చేశారు?' కోపంతో ఊగిపోతున్నాడు. ఆయన.

'డోనర్ హార్ట్ మ్యాచ్ చేస్తున్నాము. ఈలో గానే ఇలా జరిగింది' సంజాయిషీ ఇస్తున్నాడు అతుల్.

ఈ వాగ్వాదం జరుగుతుండగానే అక్షయ్‌కి పిల్లలు సేఫ్ అనే మెసేజ్ వచ్చింది.

'మీ అంతు చూస్తాను. హాస్పిటల్ నేలమట్టం చేయిస్తాను' సోనీ తాత అరుస్తుండగా బయటికి జారుకున్నాడు అక్షయ్.

సాయంత్రానికి హాస్పిటల్‌లో పోలీస్ రెయిడ్స్ జరిగాయి.

మీడియాలో రెయిడ్స్ లైవ్‌గా చూపించే ఏర్పాట్లు జరిగాయి.

ఒక్కొక్క రూమ్ తెరుచుకుంటూ పోతున్నారు.

బేస్‌మెంట్‌లో ఉన్న రహస్యగదిని చూసి నిర్ఘాంతపోయారందరూ.

పెద్దపెద్ద ఇన్సినరేటర్లు ఉన్నాయక్కడ. ఎక్కువ వేడితో వేస్ట్ మెటీరియల్‌ని కాల్చేసే యంత్రాలు. ఆ రూమ్ చూసిన వారు అక్కడి ఏర్పాట్లుచూసి కళ్ళు తేలేశారు. అవయవాలు ఒల్చుకున్న తర్వాత మిగి లిన శరీరాన్ని వాటిలో వేసి కాల్చేస్తారు.

ఆ రూమ్‌ని ప్రెస్ లైవ్‌లో చూపిస్తుండగా ఒక విచిత్రం జరిగింది.

పోలీసుల నుంచి తప్పించుకునే ప్రయత్నంలో వీల్‌చెయిర్‌తో సహా పైనుంచి బట్టీలో పడి పోయాడు అతుల్.

కాసేపట్లో కాలి బూడిదయ్యాడు.

అక్కడ నుంచి మిగిలిన ఎముకలు ఆసిడ్ నిల్వ చేసిన డ్రమ్‌లో పడి కరిగిపోయాయి.

ఎంతోమంది ప్రాణాలు బలిగొన్న అతుల్ చరిత్ర క్షణాల్లో ముగిసిపోయింది.

టీవీ చూస్తున్న అక్షయ్‌కి 'నేను విక్టిమ్‌ని' అంటున్న అతుల్ గుర్తొచ్చాడు. ఒక్క క్షణం.

***

రాజేష్ సిస్టమ్ ముందు కూర్చుని ఈమెయిల్స్ చెక్ చేసుకుంటున్నాడు.

అతనికి ఆడవాళ్ళంటే ద్వేషం పెరుగుతోందీ మధ్య.

'సీమ... దీనికి ఒళ్ళంతా విషమే' తిట్టుకుంటున్నాడు.

సీమ, కావ్య, సెటిల్‌మెంట్ సాంబ అంతా అక్కడక్కడే కనబడుతుండడంతో అతనికి ఒళ్ళంతా కారం పూసుకున్నట్టుగా ఉంది.

'కావ్య కూడా ధైర్యంగా తిరుగుతోందీ మధ్య.

ఏదో ఒకటిచేసి అందరినీ తొక్కేయాలి' నిర్ణయించుకున్నాడు.

అప్పుడే అంతకుముందు రోజు యూ.ఎస్. మేనేజర్ నుంచీ తన బాస్‌కి వచ్చిన ఈ–మెయిల్, ఆ మెయిల్ తనకు పంపుతూ తన ఎక్స్‌ప్లనేషన్ అడుగుతున్న బాస్ ఈ–మెయిల్ చూశాడు.

సీమని తిట్టుకుంటూ మెయిల్ రిప్లయ్ ఇవ్వసాగాడు.

వెనక నుంచీ దగ్గు వినబడింది.

తిరిగి చూస్తే 'సాంబ'.

'ఏంకావాలి?' అడిగాడు రాజేష్.

అతనికి మంటగా ఉంది. వీడి వల్లే భయంగా ముడుచుకుపోయే కావ్య కూడా తలెత్తుకు తిరుగుతోంది.

సాంబ మొహం వెలిగిపోతోంది.

చాలా సంతోషంగా ఉన్నాడతను.

జీవితంలో మొదటిసారి అతను తనకి అప్పగించిన కేస్‌లో పురోగతి సాధించటం.

కళ్ళ ముందు కలలు దృశ్యాలుగా మారుతూ కనబడుతున్నాయి.

అందరూ సెటిల్‌మెంట్స్ కోసం తన దగ్గరికి వస్తుండటం, తమ కంపెనీకి, మరో ప్రొడక్ట్ కంపెనీకి ఏర్పడిన లీగల్ వివాదంలో సిఈఓ తన సహాయం కోరడం, సాఫ్ట్‌వేర్ ఉద్యోగులు ప్రతి సెటిల్‌మెంట్‌కీ తన దగ్గరకే రావటం, శేరిలింగంపల్లి ఏరియాలో తను కనబడితే అందరూ నమస్కారాలు పెట్టి, దండలు వేయటం, ఎలక్షన్స్‌లో గెలిచి తను ఎమ్మెల్యే అవటం... సంతోషం పట్టలేకుండా ఉన్నాడతను అవన్నీ ఊహించుకుని.

'మొన్న కావ్య భుజం మీద నువ్వు చేయి వేసిన ఫొటో విషయం ఎప్పుడు మాట్లాడదాము?' అడిగాడు సాంబ.

'మాట్లాడ్డానికి ఏముంది. పోయి హెచ్.ఆర్. మేనేజర్‌కి ఇచ్చుకో!' కచ్చగా అన్నాడు రాజేష్. అతనికి చేతులు కట్టేసినట్టుగా ఉంది.

కావ్యని వేధించడానికి లేదు ఈ ఫొటోల వల్ల.

సీమ ఏదో ఒకరకంగా ఎదురు వేధిస్తోంది తననే.

ఇదంతా కాక తన బాస్‌తో తిట్ల ఈ–మెయిల్.

వెధవ ఉద్యోగం మానేసి ఆడవాళ్ళెవరూ లేని చోటికి వెళ్ళిపోతే నయమనిపిస్తోంది అతనికి.

'లెట్స్ టాక్' అన్నాడు సాంబ.

'వీడికి కూడా లోకువయిపోయాడు అనవసరంగా తను. వెధవ జన్మ'

కేఫెటేరియాకి వెళ్ళారిద్దరు. వర్క్ పీక్‌లో ఉండే సమయానికి మనుషులెక్కువగా లేరు.

టీ తెచ్చుకుని కూర్చున్నారు.

'చెప్పు, ఏం కావాలి?' అడిగాడు రాజేష్.

'యాభై వేలు కాష్, నేను చెప్పిన కాండిడేట్‌కి ప్రమోషన్' తడబాటు లేకుండా చెప్పాడు సాంబ.

'లక్ష ఇస్తాను. ప్రమోషన్ ఇనిషియేట్ చేస్తాను. ఫొటోస్ డిలీట్ చేయి' ప్రపోజల్ పెట్టాడు రాజేష్.

యాభై అడిగితే పది వేలకి బేరమాడతామనుకున్నాడు. లక్ష ఇస్తాడా? కాండిడేట్ ప్రమోషన్‌కి ఇంకో లక్ష. సంతోషంలో విజిల్ వేసిందతని గుండె.

ఆ ఫొటో ఎటూ అంత క్లియర్‌గా లేదు. గట్టిగా మాట్లాడితే మార్ఫింగ్ అంటాడేమో, ఇదంతా తేలేసరికి ఈజీగా రెండేళ్ళు పడుతుంది. కావ్యని జాగ్రత్తగా వ్యవహారం డీల్ చేసుకోమంటే సరిపోతుంది.

పది నిమిషాల్లో అతని అకౌంట్‌లో లక్ష వేసినట్లు ఎస్సెమ్మెస్ వచ్చింది సాంబకి. అతని ముందే పర్‌ఫార్మెన్స్ టూల్‌లో తన టీమ్‌లోని అతనికి ప్రమోషన్ ఇనిషియేట్ చేశాడు రాజేష్.

**రాత్రి రెండవుతోంది. ల్యాప్‌టాప్‌లో ఏదో వర్క్ చేసుకుంటోంది కావ్య. స్క్రీన్ మీద ప్రైవేట్ మెసేజ్ పాప్ అప్ అవుతోంది. చూసి ఉలికిపడింది. ఆ విషయం మర్చిపోయినందుకు తనను తానే తిట్టుకుంది. మెయిల్ ఓపెన్‌చేసి రిప్లయ్ ఇచ్చింది. ఇంతకీ ఆ మెసేజ్ ఇచ్చింది ఎవరు? ఏముందా మెసేజ్‌లో?**

సంతోషంతో ఉబ్బి తబ్బిబ్బవుతున్నాడు సాంబ.

అన్నీ అనుకున్నట్లే జరుగుతున్నాయి.

బిజినెస్ పుంజుకుంటోంది.

ఫొటో డిలీట్ చేస్తుండగా అడిగాడు రాజేష్.

'కావ్య నీ ఫ్రెండ్ కదా. నిన్ను నమ్మింది కదా. ఆమెకి ఏం చెప్తావు?'

నవ్వి అన్నాడు సాంబ.

'రాజకీయాల్లో శాశ్వత మిత్రులు, శాశ్వత శత్రువులు ఎవరూ ఉండరు'.

'నీ బొంద రాజకీయం. రాజకీయమంటే ఏమిటో నీకు రేపు తెలుస్తుంది' పళ్ళు నూరాడు రాజేష్.

***

మర్నాడు ప్రొద్దున సమయం పదవుతోంది.

సాంబ ఆఫీస్‌కి రాగానే హెచ్.ఆర్. డిపార్ట్‌మెంట్ నుంచి పిలుపొచ్చింది.

అతని చేతిలో టర్మినేషన్ లెటర్ ఉంచారు.

కంపెనీ బాడ్జ్, డెస్క్ కీస్, ల్యాప్‌టాప్, ఆఫీస్ ఫోన్ హాండోవర్ చేసుకున్నారు.

సెక్యూరిటీ గార్డ్ అతణ్ణి గేట్ దాటేవరకూ ఎస్కార్ట్ చేశాడు.

అక్కడితో అతనికి ఆ కంపెనీ గేట్లు శాశ్వతంగా మూసుకుపోయాయి.

ఎక్కడా సాంబకి మాట్లాడే అవకాశం ఇవ్వలేదు.

అతనికి తెలీని మరో విషయం – 'కంపెనీకి చెందిన ఇంటలెక్చువల్ ప్రాపర్టీని వేరే కంపెనీకి ఇవ్వజూశాడనే అభియోగం మోపబడిందతదని మీద.

మరే సాఫ్ట్‌వేర్ కంపెనీ అతడిని రిక్రూట్ చేసుకోలేని విధంగా బ్లాక్‌మార్క్ చేయబడ్డాడు.

***

ప్రాజెక్ట్ మీటింగ్ మధ్యలో సాంబ విషయం ప్రస్తావనకి వచ్చింది.

'అనటమయితే అంటున్నారు కానీ వాడికి ఇంటలెక్చువల్ ప్రాపర్టీ ఏదో తెలిసే అవకాశం ఉందా?' అనుమానంగా అన్నాడు బ్రహ్మి.

'నాకయితే డౌటే. పాపం మంచివాడు' అంది కావ్య.

'నీ కిష్టమయితే వాళ్ళంత మంచివాళ్ళు లేరంటావు. ఇష్టం లేకపోతే వాళ్ళంత చెడ్డవాళ్ళు లేరం



# తాప్సీ కష్టాల కథ

ఇప్పుడంటే తనకి బాలీవుడ్‌లో సక్సెస్‌ఫుల్ హీరోయిన్ అన్న పేరు వచ్చింది కానీ, అంతకు ముందు టాలీవుడ్, బాలీవుడ్‌లలో తను పడిన కష్టాలు అన్నీ ఇన్నీ కావు అని వాపోతోంది తాప్సీ. టాలీవుడ్‌లో తనని మరీ ఘోరంగా ట్రీట్ చేసేవారని అంటోంది. సినిమా ఫ్లాప్ అయితే ఆ దురదృష్టాన్ని తన ఖాతాలో వేసి రెమ్యునరేషన్ ఇచ్చేవారు కాదని అంటోంది. ఒక సినిమాలో తీసుకుని మరుసటి రోజే వద్దని చెప్పేవారనీ, అలా ఎందుకు చేయవలసి వచ్చిందో కారణం కూడా చెప్పేవారు కాదనీ, ఇలాంటి వాటితో విసిగిపోయే బాలీవుడ్‌కి వెళ్ళినట్టు చెప్పుకొచ్చింది.

అక్కడ కూడా తన కష్టాలు ఏమాత్రం తగ్గలేదని, మినిమమ్ రెమ్యునరేషన్ కోసం ఫైటింగ్ చేయవలసి వచ్చిందని అంటోంది. అక్కడ 'పింక్' సినిమా తరువాతే తనలోనూ ఓ నటి దాగి ఉందన్న సంగతి అందరికీ తెలిసిందని అంటోంది. బాలీవుడ్‌లో ఇప్పుడు మంచి మంచి అవకాశాలు వస్తున్నాయని, అన్నిటినీ ఒప్పుకోకుండా జాగ్రత్తగా ఎంపిక చేసుకుంటున్నానని చెబుతోంది.

ఇప్పుడిప్పుడే దక్షిణాది దర్శకనిర్మాతలు తనను డేట్లు అడుగుతున్నారనీ, అక్కడ ఎదురైన చేదు అనుభవాలు ఇంకా మరిచిపోలేదనీ, అందుకే ఎవరికీ ఎలాంటి సమాధానం చెప్పడం లేదనీ స్పష్టం చేసింది. ఈ విషయంలో తాప్సీకి పొగరు అని అనుకున్నా తనకెలాంటి అభ్యంతరం లేదని అంటోంది.



టావు' అంది రోహిణి.

'ఏమై ఉంటుందో?' ఆలోచిస్తున్నారంతా.

'స్టేషనరీ లాంటి వాటి చోరీ ఏమైనా....?' అంది రోహిణి.

'దానికే అంత ఎందుకు చేస్తారు? రోజూ ప్రింటర్ నుంచీ వైట్ పేపర్లు, ఆఫీస్ పెన్స్, స్టేప్లర్లు, క్లిప్స్, ఫైల్స్ అందరూ పట్టుకెళ్తూనే ఉంటారు కదా! నువ్వు తీసికెళ్ళిన లిస్ట్ అంతా నా దగ్గర ఉంది' రోహిణితో అన్నాడు బ్రహ్మి.

'పోనీ అతనికి ఫోన్ చేసి చూద్దామా?' అన్నాడు సుధీర్.

'పర్సనల్ ఫోన్ నంబర్ ఎవరికీ ఇవ్వలేదతను. ఆఫీస్ ఫోన్ హాండోవర్ చేసేసుకున్నారు' చెప్పాడు బ్రహ్మి.

'ఫేస్‌బుక్, లింక్‌డ్ ఇన్‌లలో చూస్తే?'

'వాటిలో అతనికి అకౌంట్లు లేవు'.

'ఇన్నితెలుసు కానీ అతన్నెందుకు తీశారో తెలీదా మీకు? నాకు మళ్ళీ ఒక చిన్న కథ గుర్తొస్తోంది' అంది రోహిణి.

'చెప్పు' ఆసక్తిగా అన్నారు సుధీర్, కావ్య.

ప్రాజెక్ట్ మేనేజర్ మీద జోకేమోనని అనుమానంగా ఉంది బ్రహ్మికి. అందుకే ఆసక్తి కనబరచలేదు.

అయినా రోహిణి చెప్పుకుపోయింది.

'ఒకవ్యక్తి పారాషూట్‌లో ప్రయాణిస్తున్నాడు.

కాసేపటికి తను దారి తప్పానని అతనికి అనుమానం వస్తుంది. కొద్దిగా పారాషూట్ కిందికి దింపుకుని అక్కడ కనబడుతున్న ఒకతడిని చూస్తూ అతనికి వినపడేట్లు గట్టిగా అడుగుతాడు.

"ఎక్స్‌క్యూజ్‌మీ.. నా ఫ్రెండ్‌ని కలుస్తానని మాటిచ్చాను. కానీ నేనెక్కడున్నానో అర్థం కావటం లేదు. ఏమైనా సహాయం చేయగలరా?'

కిందున్న వ్యక్తి జవాబిచ్చాడు.

'నువ్వు పారాషూట్‌లో ఉన్నావు. ప్రస్తుతం అది భూమికి ఇరవై అడుగుల పైనుంది. నలభై డిగ్రీల ఉత్తర లాటిట్యూడ్ (అక్షాంశం), అరవై డిగ్రీల పశ్చిమ లాంగిట్యూడ్ (రేఖాంశం)లో ఉన్నావు'.

'నువ్వు ప్రోగ్రామర్‌వి కదూ!' అడిగాడు పారాషూట్‌లో వ్యక్తి.

'అవును. ఎలా తెలుసుకున్నావు?' అడిగాడు కిందున్న వ్యక్తి.

'నువ్వు చెప్పినదంతా టెక్నికల్‌గా కరెక్టే. కానీ దానిలో నేనెక్కడున్నానో తెలుసుకోవటం మానవ మాత్రులకి సాధ్యం కాదు. అందుకే ప్రోగ్రామర్ అయ్యుంటావనుకున్నాను.

'నువ్వు ప్రాజెక్ట్ మేనేజర్‌వి కదూ?' అడిగాడు కిందున్న వ్యక్తి.

'అరె. అవును. నీకెలా తెలిసింది?' ఆనందంగా అడిగాడు.

'నువ్వెక్కడున్నావో నీకుతెలీదు. ఎక్కడికి వెళ్ళదల్చుకున్నావో నీకు తెలీదు. ఎవరినో కలుస్తానని ప్రామిస్ చేశావు. అదెలా నిలుపుకుంటావో నీకు తెలియదు. కానీ నేను నీకు సహాయపడాలని కోరుతున్నావు. నేను కనపడక ముందు ఎక్కడ ఉన్నానో, ఇప్పుడూ అక్కడే ఉన్నావు. కానీ నీకు దారి తెలియకపోవటం ఇప్పుడు నా తప్పన్నట్లు మాట్లాడుతున్నావు. అందుకే ప్రాజెక్ట్ మేనేజర్‌వి అని తెలుస్తుంది' చెప్పాడు కిందున్న వ్యక్తి.

నవ్వుతున్నారు. కావ్య, సుధీర్, రోహిణి.

ఉడుక్కున్నాడు బ్రహ్మి.

***

శంషాబాద్ ఎయిర్‌పోర్ట్.

'ఇంటర్నేషనల్ ఎరైవల్స్' బోర్డ్ కనబడుతోంది.

తెలుపురంగు లాంగ్ స్లీవ్స్ టీ షర్ట్, బ్లూజీన్స్, స్నీకర్స్ వేసుకుని ఉన్నాడతను. తల నీట్‌గా ఒక పక్కకు దువ్వి ఉంది. ఎడమ చెవికి డైమండ్ స్టడ్ మెరుస్తూ కనిపిస్తోంది. చామనచాయలో డబ్బు వల్ల చేసిన గ్రూమింగ్‌తో బాగున్నాడో, లేదో అర్థం కాకుండా ఉన్నాడు.

నడకలో ఒక రకమైన పొగరు, అధికారం వల్ల వచ్చిన బలుపు కనబడుతోంది.

అతణ్ణి రిసీవ్ చేసుకోవటానికి ఎయిర్‌పోర్ట్‌కి స్నేహితులు వచ్చారు.

తన అడుగులకి మడుగులొత్తే వాళ్ళను చూసిన ప్రతీసారీ గర్వంతో అతని ఛాతీ ఉప్పొంగు తుంది.

'కార్ ఇక్కడే పార్క్ చేసుకుని వెళ్ళాను. మీరెందుకు రావటం?' అన్నాడు.

కాసేపు వాళ్ళతో మాట్లాడి తన కార్ వైపు నడిచాడు.

కార్ డోర్ ఓపెన్ చేస్తుండగా వినపడిందతనికి.

'కార్ నంబర్ రిజిస్ట్రేషన్ చేయించలేదా? నంబర్ లేని కార్లలో తిరగకూడదని తెలీదా?'

ఉలికిపడ్డాడు.

ఎదురుగా శ్రీకాంత్, మరో ఇద్దరు పోలీసులు యూనిఫామ్‌లో ఉన్నారు.

క్షణాల్లో సర్దుకున్నాడు.

'నేనెవరో తెలుసా?' అడిగాడు.

'కార్ సెర్చ్ చేయాలి' పట్టించుకోనట్లుగా

అన్నాడు శ్రీకాంత్.

కార్ అంతా వెతికారు. ఏమీ అనుమానాస్ప దంగా కనబడలేదు.

'అంతా క్లియర్ సర్. ఏమీ లేదు' వెనక డోర్ మూసేస్తూ అన్నాడు కానిస్టేబుల్.

'నీ సంగతి చూస్తాను' వేలితో శ్రీకాంత్‌ని బెది రిస్తూ డ్రైవింగ్ సీట్‌లోకి ఎక్కుతున్నాడతను.

అప్పుడు కొద్దిగా లేచింది డ్రైవింగ్ సీట్ వైపున్న మాట్ ఆ విసురుకి.

దాని కింద రక్తపు మరకలున్నట్లుగా అనిపిం చింది శ్రీకాంత్‌కి.

అతణ్ణి కిందకి దింపి చెక్ చేశాడు.

చిన్నగాజుముక్క, రక్తపు మరకలు కనబడుతు న్నాయి.

కత్తివాటుకి నెత్తురు చుక్క లేనట్లుగా అయిం దతని మొహం.

గబగబా ఎవరికో ఫోన్ చేయబోయాడు.

అతని మోచేయి వద్ద పట్టుకుని, రెండో చేత్తో ఫోన్ లాగేసుకున్నాడు.

పోలీస్‌స్టేషన్‌కి తీసుకెళ్ళి ఇచ్చిన ట్రీట్‌మెంట్‌లో




అతను ఒకమ్మాయిని రోడ్ మీద నడుస్తుండగా లాక్కొచ్చి తన గెస్ట్‌హౌస్‌లో పెట్టుకున్నట్లుగా వెల్ల డయింది. అతణ్ణి తీసుకుని గెస్ట్‌హౌస్‌కి వెళ్ళేసరికి ఆ అమ్మాయి ఫ్యాన్‌కి ఉరేసుకుని ఉంది.

మర్నాడు సాయంత్రానికి అన్ని పార్టీల వాళ్ళూ, పై అధికారులూ రంగంలోకి దిగారు.

ఎటువంటి కేస్ లేకుండా క్లీన్ చిట్‌తో అతన్ని విడుదలచేశారు.

శ్రీకాంత్‌కి అధికారం ఉండీ, లేనట్లున్న తమ డిపార్ట్‌మెంట్ మీద కసిగా ఉంది.

గన్ క్లీన్ చేసుకుంటూ కూర్చున్న అతణ్ణి చూసి కానిస్టేబుల్ అన్నాడు.

'అచ్చోసిన ఆంబోతులాంటి వాడు అతను. ఇటువంటి పనులెన్నో చేసి దొరికిపోయాడు ఇది వరకు. ఒక పార్టీ వాళ్ళు వేరే పార్టీ వాళ్ళని ఎన్నో తిట్టుకుంటారు. కానీ పిల్లల విషయానికొచ్చే సరికి అంతా ఒకటైపోతారు. ఎవరూ కిమ్మనరు. పైగా బయటికి తీసుకురావటానికి అన్ని రకాలుగా సహక రిస్తారు. ఛా!"

మళ్ళీ తనే అన్నాడు.

'మన వద్ద ఉన్న వివరాలను బట్టి చూస్తే ఇతను ఆత్మహత్య చేసుకున్న పిల్లని ఎత్తుకొచ్చాడు ఆ రోజు. కాబట్టి, నైరా కేస్‌లో ఇతని ప్రమేయం లేనట్లే!'

'కథ మళ్ళీ మొదటికొచ్చింది' అనుకున్నాడు శ్రీకాంత్.

***

చల్లగా గాలి వీస్తోంది.

కిటికీ పక్కగా వేసి ఉంది టేబుల్. దానిమీద లాప్‌టాప్ పెట్టుకుని వర్క్ చేసుకుంటోంది కావ్య.

శుక్రవారం రాత్రి.

టైమ్ పదవుతోంది.

కిటికీ పక్కనే ఉన్న నైట్ క్వీన్ సువాసనలు వెద జల్లుతోంది.

కుర్చీలో వెనక్కి జారగిలబడింది కావ్య.

కిటికీలో నుంచి బయటికి ఆకాశంలో చంద మామ వెన్నెలలా వెదజల్లుతోంది.

అక్షయ్ గుర్తొస్తున్నాడామెకి.

చంద్రుడిని చూసిన ప్రతిసారీ ఆమెకి అక్షయ్ గుర్తొస్తాడు.

'అక్షయ్, మళ్ళీ ఎప్పుడు కనిపిస్తావు? నువ్వు లేని లోటు తెలుస్తూనే ఉంది ప్రతిక్షణం. ఈ పూటెందుకో మరీ గుర్తొస్తున్నావు.

టేబుల్ మీద రెండు చేతులూ పెట్టుకుని తల ఆనించుకుంది.

ఏదో తెలీని నిరాశ... నిస్పృహ.

మళ్ళీ ఎప్పటికీ అక్షయ్ కనబడకపోతే...?

కనబడినా వేరే అమ్మాయిని ఇష్టపడితే...?

భోరున ఏడవాలనిపిస్తోందామెకు.

కారణం చెప్పకుండా ఏడిస్తే పిచ్చనుకుంటారు.

తనని తనే ఓదార్చుకుని కంప్యూటర్ ఆన్ చేసింది.

అప్పుడెప్పుడో ఆన్‌లైన్ గూఢచారుల సహాయం అర్థిస్తూ కేస్ వివరాలు పోస్ట్ చేసింది. ఆఫీస్ గొడ వల్లో పడి మళ్ళీ ఆ వెబ్‌సైట్ జోలికి పోలేదు.

వెబ్‌సైట్‌లోకి వెళ్ళి లాగిన్ అయింది.

తను పెట్టిన పోస్ట్‌కి అరవైకి పైగా రిప్లయ్‌లు ఉన్నాయి.

చాలావరకూ సింపతీ చూపిస్తూ, మరికొన్ని వివరాలు అడుగుతున్నవే, అన్నిటికి రిప్లయ్‌లు ఇవ్వసాగింది.

టైమ్ రాత్రి రెండవుతోంది.

ప్రైవేట్ మెసేజ్ పాప్ అప్ అవుతోంది.

తన కూతుర్ని పక్కింటివాడే కిడ్నాప్‌చేసి చంపేశాడనీ, ఎలాగయినా నైరాని కాపాడటానికి సహాయ పడతాననీ చెప్పిన ఇంటర్‌నెట్ గూఢచారి.

చాలాసార్లు మెసేజ్ చేసినట్లున్నాడు.

తనే చూసుకోలేదు.

తనని తనే తిట్టుకుంటూ రిప్లయ్ ఇచ్చింది.

మూడు రోజుల నుంచీ ఆమెను కాంటాక్ట్ చేయటానికి ప్రయత్నిస్తున్నానని పిల్లల విష యంలో ఇంత అలక్ష్యం పనికి రాదనీ, ఇంటరెస్ట్, నిజమైన ఆందోళన లేనప్పుడు వెబ్‌సైట్లలో పోస్ట్ చేసి వేరే వాళ్ళ టైమ్ వేస్ట్ చేయొద్దనీ క్లాస్ పీకాడ తను.

బిక్కమొహం వేసి సంజాయిషీ ఇచ్చుకుంది కావ్య.

'ఆన్‌లైన్‌లో కూడా ఎవడికో భయపడి సంజా యిషీలు ఇస్తుందేమిటి తను' ఆమె ప్రవర్తన ఆమెకీ చిన్నతనంగా అనిపించింది.

ధైర్యం పుంజుకుని ఎదురు ఏదైనా అనటానికి సిద్ధపడేసరికి చెప్పటం మొదలెట్టాడతను.

'లిజన్. నువ్వు చెప్పిన పాప తల్లిదండ్రుల ఫేస్ బుక్ అకౌంట్లు, సోషల్ మీడియాలో ఆమె మేన మామ అన్ని అకౌంట్లు చెక్ చేశాను. వాళ్ళ కాంటాక్ట్స్‌గా కనబడుతున్న వాళ్ళందరికి సంబంధించిన అకౌంట్లు వెరిఫై చేశాను".

"ఒక ఇంటరెస్టింగ్ విషయం బయటపడింది. పాప మేనమామకి చాలా దగ్గర వ్యక్తి చేసి ఉండే అవకాశాలు బాగా కనబడుతున్నాయి. అంతేకాదు ఆరోజు అతను అక్షయ్ ఇంటికి వచ్చినట్లుగా ఫేస్ బుక్ లొకేషన్ ట్రాకర్‌ని బట్టి చూస్తే అర్థమవు తోంది."

'నేను నీకు వందశాతం గ్యారంటీ ఇవ్వగలను. అతనే చేసి ఉంటాడని'.

కావ్యలో దిగులు, నిద్ర అన్నీ ఎగిరిపోయాయి.

'ఎవరు?' అడిగింది.

ఆగలేక పోతోంది ఆమె.

ఎంత అర్జంట్‌గా నైరా ఆచూకీ కనిపెట్టగలిగితే అంత తొందరగా అక్షయ్ తనకి కనబడతాడు.

అప్పుడు చెప్పాడతను.

కావ్య నెత్తి మీద బాంబ్ పడ్డట్లుగా నిర్ఘాంతపో యింది.

ఇదేమైనా కలా? నిజమేనా?

ఇన్ని రోజులూ పక్కనే ఉంచుకుని తాము తెలు సుకోలేక పోయారా! అయ్యో... అక్షయ్.. ఆ వ్యక్తినా అంతగా నమ్మావు' ఆక్రోశంగా ఉంది కావ్యకి.

అతను చెప్పిన పేరు. 'హర్ష....!'

**(ఇంకా వుంది)**

**జుత్తు ఊడిపోవడం ఇప్పుడు అతి సాధారణ సమస్యగా మారిపోయింది. ప్రతి అమ్మాయీ ఒత్తయిన నల్లని శిరోజాల కోసం ఆరాట పడుతూ ఉంటుంది. ఎన్నో జాగ్రత్తలు తీసుకుంటుంది. అయినా సరే వెంట్రుకలు రాలిపోవడం ఆగదు. ఒత్తుగా ఉండే జుత్తు రాలిపోవడానికి ఆరోగ్య పరంగానే కాకుండా, ఇంకా ఇతర కారణాలు కూడా ఉంటాయి. మనకున్న కొన్ని అలవాట్లు కూడా జుత్తు రాలిపోవడానికి కారణం అంటున్నారు సౌందర్య నిపుణులు. మరి శిరోజాల అందం పాడు చేస్తున్న మన తప్పిదాలేంటో తెలుసుకోండి !**



# శిరోజాలు అందంగా ఉండాలంటే...

మారుతున్న వాతావరణ పరిస్థితులు, కాలుష్యం వల్ల తలలో చుండ్రు పెరిగిపోతూ ఉంటుంది. జుత్తు రాలడానికి చుండ్రు ఒక కారణం. ఈ సమస్య తగ్గుముఖం పడుతుందనే ఉద్దేశంతో తలస్నానం సమయంలో ఎక్కువసేపు జుత్తు రుద్దుకుంటాం. గాఢత ఎక్కువగా ఉండే షాంపూ ఉపయోగిస్తుంటాం. దానివల్ల కుదుళ్ల బలహీన పడి జుత్తు రాలిపోయే అవకాశం ఉంది. ఎక్కువ సేపు తల రుద్దకుండా చుండ్రు సమస్య నుంచి బయటపడే చిట్కాలు పాటించడం మంచిది. నిమ్మరసం గోరువెచ్చని నూనెలో వేసుకుని తలకు అప్లయి చేసుకోవడం, తక్కువ గాఢత ఉండే షాంపూతో తలస్నానం చేయడం లాంటి చిట్కాలు పాటిస్తుంటే చుండ్రు సమస్య తగ్గుతుంది.



### అలంకరణ సమయంలో

శిరోజాల అలంకరణ కూడా కొన్నిసార్లు ఆరోగ్యాన్ని దెబ్బతీస్తుంటుంది. అదెలా? అనుకుంటున్నారా, కొందరు బిగుతుగా పోనీటెయిల్ లేకుంటే ముడి, కాకపోతే అప్పుడప్పుడూ కష్టమైన హెయిర్ స్టయిల్స్ వేసుకుంటారు. అందంగా ఉన్న వాటిని తీసుకుని మళ్లీ దువ్వుకునేటప్పుడు జుట్టు పాడయ్యే అవకాశంవుంది. దీనివల్ల శిరోజాలు సాగినట్లు తయారై తెగిపోతాయి. అంతే కాక కేశాలంకరణ చేసుకునే క్రమంలో కొన్ని హెయిర్ స్ప్రేలు ఉపయోగిస్తుంటారు. ఇవి కూడా కురుల ఆరోగ్యాన్ని దెబ్బతీస్తాయి. కాబట్టి వీలైనంత వరకు రసాయన ఉత్పత్తుల వినియోగం తగ్గించి జుత్తును లూజ్‌గా ఉంచడం, అలాగే వదిలేయడం, జడవేసుకోవడం లాంటివి చేయాలి.

### ఎప్పుడూ కురుల ధ్యాసేనా!

కొంతమంది మాటిమాటికీ కురులు సరిచేసుకుంటారు. అదే అలవాటు. జడ ముందుకు వేసుకుని లాగుతూ ఉంటారు. అలాగే అస్తమానం వెంట్రుకలు మెలిపెట్టుకోవడం, తాకుతూ ఉండటం మరికొందరి అలవాటు. ఇలా చేయడం వల్ల చేతులకు అంటిన మురికి కురుల్లో చేరుతుంది. దీనివల్ల జుత్తు జిడ్డుగా తయారవుతుంది. దీనివల్ల మరింత దుమ్ము జుత్తుల్లో వచ్చి చేరుతుంది. ఈ కారణంగా జుత్తు నిర్వీర్యమవుతుంది. అందుకే కురులను తరచు చేతులతో తాకే అలవాటున్నవారు, ఆ అలవాటు మానుకునే ప్రయత్నం చేయండి.

### తడిజుట్టుతో జాగ్రత్త

ఉదయం తలస్నానం చేసిన తర్వాత, ఆరక ముందే కాలేజీలకు, ఆఫీసులకు లేటవుతుందని చాలామంది దువ్వెనతో చిక్కుతీస్తుంటారు. ఇలా దువ్వేటప్పుడు కూడా చాలా గట్టిగా దువ్వుతుంటారు. ఫలితంగా జుట్టు చివర్లు వంకరతిరుగుతాయి. తెగిపోతుంది. అంతేకాక మరికొందరు ఆరినా ఆరకపోయినా సరే దువ్వి గట్టిగా జడవేసుకుంటారు. ఇది కూడా జుత్తు ఊడిపోవడానికి ఒక కారణమే.

### ఇతరత్రా

తలస్నానం తర్వాత వెంట్రుకలు ఆరబెట్టేందుకు సమయం లేకపోతే వదులుగా ఉండేలా రబ్బరు లేదంటే ఫ్లక్కర్ పెట్టుకోవాలి. అలాగే చిక్కు తీసేటప్పుడు ఒకేసారి పై నుంచి కిందకి దువ్వే ప్రయత్నం చేయకుండా కొంచెం కొంచెం చిక్కు తీయాలి. అప్పుడు జుట్టు సాగి తెగకుండా ఉంటుంది. అలాగే జుట్టు త్వరగా ఆరాలనే ఉద్దేశంతో చాలామంది బ్లోయింగ్ చేస్తుంటారు. ఇది కూడా జుట్టు ఆరోగ్యాన్ని దెబ్బతీస్తుంది. ఎందుకంటే అప్పటివరకు తడిగా ఉన్న జుట్టు ఒక్కసారిగా పొడిగా అవ్వడం వల్ల పాడయ్యే అవకాశాలున్నాయి. తలకు ఎక్కువ సేపు టవల్ చుట్టుకుని ఉండడం, అతిఎక్కువగా షాంపూ చేయడం కూడా జుట్టు ఆరోగ్యాన్ని దెబ్బతీస్తాయి.

**–విజేత**

# సౌభాగ్య చక్రం

ఏప్రిల్ 5 నుంచి
ఏప్రిల్ 11 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



## మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

ప్రేమానుబంధాలు, వృత్తి, వ్యాపారాలు పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో ప్రేమానుబంధాలు బలపడతాయి. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. చిన్నారులు, ప్రియతముల విషయాలపై శ్రద్ధ చూపిస్తారు. సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. 8,9 తేదీల్లో ఆరోగ్యం పట్ల శ్రద్ధ వహించాలి. వృత్తి, వ్యాపారాల్లో సన్నిహితుల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. హోటల్, పరిశ్రమల రంగాల వారికి శుభప్రదం. 10, 11 తేదీల్లో శ్రీవారు, శ్రీమతి విషయాల్లో కీలక నిర్ణయాలు తీసుకుంటారు. వేడుకల్లో పాల్గొంటారు. పందాలు, పోటీలకు దూరంగా ఉండాలి.



## వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)

వేడుకలు, విద్యావిషయాలు, సమావేశాలు, ప్రయాణాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో వేడుకలకు ఏర్పాట్లు చేస్తారు. ఇంటికి అవసరమైన వస్తువులు కొనుగోలు చేస్తారు. బదిలీలకు అనుకూలం. మార్పులు, చేర్పుల కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. 8, 9 తేదీల్లో విద్యార్థులకు శుభప్రదం. చిన్నారుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. 10, 11 తేదీల్లో ఆరోగ్యం పట్ల దృష్టి సారించాలి. వృత్తి, వ్యాపారాల్లో లక్ష్య సాధనకు గత అనుభవం తోడ్పడుతుంది. వైద్యం, పరిశ్రమలు, వ్యవసాయ రంగాల వారికి ప్రోత్సాహకరం.



## మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

బదిలీలు, ఆర్థిక విషయాలు, వృత్తి, వ్యాపారాలు, వేడుకలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో పెట్టుబడులకు సంబంధించిన సమాచారం సేకరిస్తారు. చర్చలు, ప్రయాణాలకు అనుకూలం. విద్యా సంస్థలతో పనులు పూర్తవుతాయి. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. 8, 9 తేదీల్లో వేడుకల్లో పాల్గొంటారు. రియల్ ఎస్టేట్, నిర్మాణరంగాల వారు ఆర్థిక విషయాల్లో నిదానం పాటించాలి. 10, 11 తేదీల్లో ఖర్చులు అంచనాలు మించుతాయి. చిన్నారులు, ప్రియతముల విషయంలో శుభపరిణామాలు సంభవం. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం.



## కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, ఆరోగ్యం, వేడుకలు, ఆర్థిక విషయాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో అదనపు ఆదాయం సమకూరుతుంది. ఆర్థిక విషయాల్లో పెద్దలు తోడ్పడతారు. ఉద్యోగ, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరం. 8, 9 తేదీల్లో ఉద్యోగ వ్యాపారాలకు సంబంధించిన ఒక సమాచారం కలవరపెడుతుంది. వాగ్వివాదాలకు దూరంగా ఉండాలి. 10, 11 తేదీల్లో బదిలీలు, మార్పులు కొంత అసౌకర్యం కలిగిస్తాయి. ఉన్నత పదవులు అందుకుంటారు. కుటుంబ వ్యవహారాల్లో శుభపరిణామాలు సంభవం.



## సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)

చిన్నారులు, విద్య, బదిలీలు, వృత్తి వ్యాపారాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో సమావేశాల్లో కీలకపాత్ర పోషిస్తారు. ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. ఉన్నత విద్యా విషయాలకు అనుకూలం. సంకల్పం నెరవేరుతుంది. 8, 9 తేదీల్లో ఆర్థిక వ్యవహారాల్లో ప్రోత్సాహకరం. విద్య, ప్రయాణాలకు అవసరమైన నిధులు సర్దుబాటు అవుతాయి. లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. 10, 11 తేదీల్లో ప్రయాణాలు, చర్చల్లో నిదానం పాటించండి. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లు లాభిస్తాయి. శుభవార్త అందుకుంటారు.



## కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)

బదిలీలు, రియల్ ఎస్టేట్, ఆర్థిక వ్యవహారాలు, వేడుకలపై ఈ వారం శ్రద్ధ పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో గత అనుభవంతో లక్ష్యాలు సాధిస్తారు. ఆధ్యాత్మిక కార్యక్రమాల్లో పాల్గొంటారు. రాజకీయ, సినీరంగాల వారికి ఆర్థికంగా లాభిస్తుంది. ఆధ్యాత్మిక కార్యక్రమాలు ఊరటనిస్తాయి. 8, 9 తేదీల్లో సంస్మరణల్లో పాల్గొంటారు. వాయిదా పద్ధతులపై వస్తువులు కొనుగోలు చేస్తారు. రుణ ప్రయత్నాలు ఫలించకపోవచ్చు. 10, 11 తేదీల్లో ఖర్చులు అంచనాలు మించే అవకాశం ఉంది. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. పెట్టుబడులు లాభిస్తాయి.



## తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)

కుటుంబ వ్యవహారాలు, స్పెక్యులేషన్లు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో వేడుకల్లో పాల్గొంటారు. శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. స్నేహానుబంధాలు బలపడతాయి. స్పెక్యులేషన్లు లాభిస్తాయి. 8, 9 తేదీల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. ప్రత్యర్థులపై ఒక కన్నేసి ఉంచండి. ప్రియతములకు సంబంధించి ఒక సమాచారం కలవరపెడుతుంది. 10, 11 తేదీల్లో పందాలు, పోటీలకు దూరంగా ఉండాలి. శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం.



## వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)

ఇంటర్వ్యూలు, ప్రేమానుబంధాలు, స్పెక్యులేషన్లపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. పెద్దల ఆరోగ్యం మెరుగుపడుతుంది. 8, 9 తేదీల్లో వృత్తిపరమైన సమావేశాలు సత్ఫలితాలనిస్తాయి. హోటల్, వైద్యం, రిటైల్ రంగాల వారు ఆర్థిక విషయాల్లో నిదానం పాటించాలి. 10, 11 తేదీల్లో వృత్తి, వ్యాపారాలకు సంబంధించిన ఒక సమాచారం ఆందోళన కలిగిస్తుంది. ఆరోగ్యం మెరుగుపడుతుంది. గత అనుభవంతో లక్ష్యాలు సాధిస్తారు.



## ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)

చిన్నారులు, పొదుపు పథకాలు, విద్యా విషయాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో సాంకేతిక విద్యకు సంబంధించిన సమాచారం సేకరిస్తారు. ప్రియతములతో చర్చలు ఉల్లాసం కలిగిస్తాయి. విద్యార్థులకు శుభప్రదం. సంకల్పం నెరవేరుతుంది. 8, 9 తేదీల్లో చిన్నారుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. వృత్తి, వ్యాపారాల్లో సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. 10, 11 తేదీల్లో ఖర్చులు అధికం. పెట్టుబడులు లాభిస్తాయి. ప్రియతముల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది.



## మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)

ఇల్లు, విద్య, వేడుకలు, ప్రేమానుబంధాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురు, శుక్రవారాల్లో వేడుకలు, ఆధ్యాత్మిక కార్యక్రమాల్లో పాల్గొంటారు. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. ఆర్థిక విషయాల్లో మీ వైఖరిని సమీక్షించుకుంటారు. సంస్మరణల్లో పాల్గొంటారు. 8, 9 తేదీల్లో గృహారంభ ప్రవేశాలకు అనుకూలం. సమావేశాలు, వేడుకలకు ఏర్పాట్లలో కొంత అసౌకర్యం కలుగుతుంది. 10, 11 తేదీల్లో సమావేశాల్లో నిదానం పాటించండి. బదిలీలకు అనుకూలం. పైఅధికారుల వైఖరి ఆనందం కలిగిస్తుంది.



## కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

విద్య, పెట్టుబడులు, బదిలీలు, నిర్మాణాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో సమావేశాలు, వేడుకల్లో పాల్గొంటారు. ప్రియతములతో చర్చలు ఉల్లాసం కలిగిస్తాయి. భాగస్వామికి సంబంధించిన కీలక సమాచారం అందుకుంటారు. 8, 9 తేదీల్లో పెట్టుబడులకు సంబంధించిన నిర్ణయాల్లో నిదానం అవసరం. విలువైన పత్రాలు అందుకుంటారు. ఆర్థిక విషయాల్లో సన్నిహితుల సహకారం అందుతుంది. 10, 11 తేదీల్లో పెట్టుబడులకు సంబంధించిన చర్చలు, సమావేశాల్లో నిదానం పాటించండి. విద్యార్థులకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి.



## మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, సోదరీసోదరుల వ్యవహారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో వృత్తి, వ్యాపారాల్లో అదనపు ఆదాయం సమకూరుతుంది. విందు, వినోదాల కోసం ఖర్చు చేస్తారు. వైద్యం, పరిశ్రమల రంగాల వారికి శుభప్రదం. 8, 9 తేదీల్లో స్పెక్యులేషన్లలో నిదానం పాటించాలి. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. ఆర్థిక విషయాల్లో భాగస్వామి వైఖరి ప్రోత్సాహకరం. 10, 11 తేదీల్లో పందాలు, పోటీలకు దూరంగా ఉండాలి. పెట్టుబడులు లాభిస్తాయి. రుణప్రయత్నాలు సఫలం అవుతాయి.



## అమెరికాలో రికార్డుకు సన్నాహాలు?

'**బా**హుబలి 2' తన రికార్డులను తనే తిరగరాస్తుందనడంలో ఎవరికీ ఎలాంటి సందేహాలు లేవు. కాకపోతే ఇప్పుడు ఆ సినిమా కన్ను అమెరికా మీద పడింది. అక్కడ ఎక్కువ థియేటర్లలో ఈ సిని మాను విడుదల చేయడానికి సినిమా యూనిట్ అప్పుడే ప్రయత్నాలు షురూ చేసింది అంటున్నారు ఇప్పటి వరకూ 'దంగల్' సినిమా ఎక్కువ కలెక్షన్లు రాబట్టిన భారతీయ సినిమాగా అక్కడ రికార్డు నెలకొల్పింది. ఇప్పుడు ఆ రికార్డును అధిగమించాలంటే ఎక్కువ థియేటర్లు అవసరమవుతాయి అనుకుంటున్నారట! ప్రస్తుతం ఈ సినిమాను అమెరికాలో 750 స్క్రీన్లలో విడుదల చేయాలని అనుకుంటున్నారట! ఇప్పటి వరకూ ఇన్ని స్క్రీన్లు ఏ భారతీయ సినిమాకు దక్కలేదు అని కూడా చెబుతున్నారు. ఈ సినిమా విడుదలకు ఇంకా నెలరోజులు సమయం ఉంది కనుక పై ఫిగర్ కన్నా ఎక్కువ స్క్రీన్లు దక్కించుకోవాలనే ఆలోచనలో చిత్ర యూనిట్ ఉందట! ఇదే కనుక జరిగితే వసూళ్ళలోనే కాదు స్క్రీన్ల విషయంలో కూడా ఈ సినిమా కచ్చితంగా రికార్డును సొంతం చేసుకుంటుంది అంటున్నారు సినీ అభిమానులు. కాకపోతే విడుదలకు ముందే బోలెడన్ని రికార్డులు మూటకట్టుకున్న ఈ సినిమాకు ఈ ఫీట్ పెద్ద కష్టం కాదనే వాదన కూడా వినిపిస్తోంది.

## సినిమాలు వద్దనుకుంటున్న అమల?

అలనాటి హీరోయిన్లు చాలా మంది రీ ఎంట్రీ ఇస్తున్నారు. వారిలో అక్కినేని అమల కూడా ఉంది. తెలుగులో చేసిన 'లైఫ్ ఈజ్ బ్యూటిఫుల్' పెద్దగా సక్సెస్ కాలేదు. ఆ తరువాత బాలీవుడ్, మాలీవుడ్‌లలో ఒక్కొక్క సినిమా చేసింది. అక్కడ కూడా సేమ్ సీన్ రిపీట్ అయ్యింది. ఇక మీదట సినిమాలు చేయకూడదన్న నిర్ణయానికి అమల వచ్చిందని అంటున్నారు సినీజనాలు. అందుకే చాలా మంది నటించమని అడుగుతున్నా ఒప్పుకోవడం లేదనీ, తన దృష్టి అంతా 'బ్లూ క్రాస్' మీదే పెట్టిందని చెబుతున్నారు. అయితే వీటి మీద దేనికీ అమల స్పందించలేదు. సమాధానమివ్వడం లేదు.





## ఆ హీరోకి బోయపాటి షాక్?

**బె**ల్లంకొండ శ్రీనివాస్‌తో బోయపాటి ఓ సినిమా చేస్తున్న సంగతి తెలిసిందే! ఇతగాడికి ఎలాగైనా ఓ భారీ హిట్టు ఇచ్చే పనిలో పడ్డాడట బోయపాటి! ఇంత వరకూ బాగానే ఉంది. కానీ, చిక్కంతా ఇక్కడే ఉంది అంటున్నారు సినీజనాలు. సక్సెస్ కోసం ఈ సినిమాలో భారీ తారాగణాన్ని దింపుతున్నాడు. ఇదంతా సినిమా సక్సెస్ కోసమే అయినా, వీరి ముందు బెల్లంకొండ తేలిపోయే అవకాశం ఉందని అంటున్నారు. ఈ సినిమాతో హిట్ కొట్టాలన్నది శ్రీనివాస్ పట్టుదల. ఈ సినిమాలో ఇద్దరు హీరోయిన్లు, కేథరిన్ ఐటెంసాంగ్, ఇద్దరు మాజీ హీరోయిన్లు ఇంత మంది మధ్య శ్రీనివాస్ ఎలా ఫోకస్ అవుతాడు? అన్నది చాలా మంది అనుమానం. ఇంతమంది భారీ తారాగణాన్ని దించి శ్రీనివాస్‌కు బోయపాటి షాక్ ఇచ్చాడని కొందరు అంటున్నారు.






## ఓ ట్వీట్‌కు పదికోట్లు?

**ఇ**ప్పుడు బాలీవుడ్‌లో ఇదే హాట్ టాపిక్ అయింది! ఇంత మొత్తం అందుకుంది బాలీవుడ్ కండల వీరుడు సల్మాన్ ఖాన్. ఇతగాడు ఓ కళ్ళ జోడు కంపెనీకి బ్రాండ్ అంబాసిడర్‌గా ఉన్నాడు. ఇప్పుడు ఈ కంపెనీకి సంబంధించి ప్రచారానికి ట్వీట్ చేయడానికే ఆ కంపెనీ వారు సల్మాన్‌కు పదికోట్ల మొత్తం సమర్పించుకున్నారట! అయితే ఆ కంపెనీ ఏమీ కళ్ళు మూసుకుని సల్మాన్‌కు అంత మొత్తం ఇవ్వలేదట! దానికీ ఓ బలమైన కారణం ఉందట! మామూలుగా సల్మాన్ సోషల్ మీడియాలో చాలా చాలా యాక్టివ్‌గా ఉంటాడు.

అతగాడు దేని మీద ట్వీట్ చేసినా ఆయన అభిమానులు వెంటనే అట్రాక్ట్ అవుతారట! మరి సల్మాన్‌కు సోషల్ మీడియాలో ఫ్యాన్ ఫాలోయింగ్ బీభత్సంగా ఉంటుంది కదా! ఇందులో అతగాడు ట్వీట్ చేస్తే రచ్చ రచ్చే అవుతుందన్న ఆలోచనతో ఆ కంపెనీ ఓ ట్వీట్‌కి అంత మొత్తం సమర్పించుకుందట!

కంపెనీ కష్టం ఎక్కడికీ పోలేదనీ, సల్మాన్ ట్వీట్ వైరల్‌గా మారి ఆయన ఫ్యాన్స్‌కే కాదు సోషల్ మీడియాలో ఉండే అందరికీ చేరుతోందని అంటున్నారు. మొత్తానికి ఈ ముదురు బ్రహ్మచారి సినిమాలు, అడ్వర్‌టైజ్‌మెంట్లు, ట్వీట్లు అంటూ కోట్ల కోట్లు వెనకేసుకుంటున్నాడనీ, ఇవన్నీ ఎవరికి ఇస్తాడో... అనీ బాలీవుడ్‌లో కొందరు అనుమానం వ్యక్తం చేస్తున్నారు.

# ఆ మాటంటే ఒప్పుకోను

## –కాజల్

ఆమె సినీ ప్రేక్షకుల కలల రాణి. 'లక్ష్మీ కల్యాణం'తో తెలుగువారిని పలకరించి, 'చందమామ'గా వారి హృదయాల్లో తిష్ఠ వేసుకుంది. 'మగధీర'తో టాలీవుడ్‌లో ఎదురులేని యువరాణి అయింది. ఈ పాటికే ఎవరో అర్థమైపోయి ఉంటుంది. ఆ హీరోయిన్ మరెవరో కాదు కాజల్ అగర్వాల్. కాజల్ సినీరంగానికి వచ్చి దాదాపు పది సంవత్సరాలు అవుతోంది. ఇన్ని సంవత్సరాలు గడిచినా... ఎన్ని సార్లు చూసినా బోర్ కొట్టని అందంతో అందరినీ కట్టిపడవేసే కాజల్‌తో....



**ఇన్ని సంవత్సరాలు ఈ రంగంలో ఉండగలనని ఎప్పుడైనా అనుకున్నారా?**

నిన్ననో, మొన్ననో సినిమాల్లోకి వచ్చినట్టు ఉంది. ఎప్పుడూ బోర్‌గా ఫీలవడమో లేదా, కష్టంగా అనిపించడమో జరగలేదు. దానికి కారణం ఉంది. చేసే పనిని ఆస్వాదిస్తే ఎలాంటి ఇబ్బందీ ఉండదు. నటనని ఆస్వాదిస్తాను.

**సినిమాల్లో నేర్చుకున్నది...**

ఇక్కడికి వచ్చిన తరువాతే చాలా నేర్చుకున్నాను. సెట్‌లో ప్రతిరోజూ ఓ కొత్త విషయం నేర్చుకుంటూనే ఉన్నాను. జీవితం గురించి ఓ అవగాహన వచ్చింది ఇక్కడికి వచ్చిన తరువాతే!

**ఓ సినిమా ప్రభావం మీ మీద ఎంత కాలం ఉంటుంది?**

షూటింగ్ జరుగుతున్నంత కాలం ఉంటుంది. ఆ తరువాత సినిమా గురించి అస్సలు ఆలోచించను. జయాపజయాలు మన చేతుల్లో ఉండవు కదా! ఓ సినిమా ఫ్లాప్ కావడానికి, సక్సెస్ కావడానికి బోలెడన్ని కారణాలు ఉంటాయి. వాటి గురించి ఆలోచించి టైమ్ వేస్ట్ చేసుకోను. నా సినిమా సక్సెస్ అయినా, ఫ్లాప్ అయినా ఒకే విధంగా తీసుకుంటా.

**వయస్సు పెరుగుతున్న కొద్దీ హీరోయిన్లకు అవకాశాలు తగ్గుతాయంటారు కదా? నిజమేనంటారా?**

మనలో సత్తా ఉన్నంత వరకూ అవకాశాలకు ఎలాంటి ఢోకా ఉండదు. వయస్సుతో పాటు పరిణతి కూడా వస్తుంది. నా మొదటి సినిమా కన్నా ఇప్పుడు నా నటనలో ఎంతో పరిణతి వచ్చింది. ఆ విషయం ఇట్టే అర్థమైపోతుంది. ఏమీ తెలియకుండా నటించడం వేరు. అర్థం చేసుకుని నటించడం వేరు. ఇప్పుడు నేను రెండో స్థాయిలో ఉన్నా. బహుశా నాకు అవకాశాలు అందుకే తగ్గలేదనుకుంటా!

**కుటుంబ కథా చిత్రాల్లోనే ఎక్కువగా నటించినట్టున్నారు?**

అలా అని కాదు. అన్ని రకాల సినిమాలు చేశాను. కుటుంబ కథా సినిమాలు చేసేటప్పుడు ఓ కుటుంబంతో కలిసి ఉన్న ఫీలింగ్ కలుగుతుంది. ఇంటిని మిస్ అవుతున్నామన్న బాధ అస్సలుకలగదు. నా మటుకు అలాంటి సినిమాలంటే చాలా ఇష్టం.

**'టెంపర్' తమిళ, హిందీ వెర్షన్‌లలో మీరే హీరోయిన్‌గా చేస్తున్నట్టున్నారు?**

సక్సెస్ కోసం ఎదురు చూస్తున్న సమయంలో మంచి కిక్ ఇచ్చిన సినిమా అది. ఆ పాత్రలో బోలెడన్ని వేరియేషన్స్ కనిపిస్తాయి. అందులో నా నటన నచ్చే నాకు అవకాశం ఇచ్చారు. హిందీలో రణవీర్‌తో చేస్తున్నాను. తనతో చేయాలని ఎప్పటి నుంచో అనుకుంటున్నాను. ఈ సినిమాతో ఆ







ముచ్చట తీరబోతోంది.

**హిందీలో మరో రెండు సినిమాలు చేస్తున్నట్టున్నారు?**

లేదు. అవి ఇంకా ఫైనల్ కాలేదు. డిస్కషన్స్ దశలోనే ఉన్నాయి. ఓకే అయితే చెబుతాను. తమిళంలో కూడా అంతే త్వరలో మరో రెండు సినిమాలు చేసే అవకాశం ఉంది.

**అన్ని భాషల్లోనూ బిజీ అవుతున్నారు కదా? మరి పెళ్లెప్పుడు?**

ఆ సమయం వస్తే తప్పకుండా అవుతుంది. అది ఎప్పుడనేది నాకూ తెలియదు. ఈ విషయంలో నాకు క్లారిటీ వస్తే అందరికీ తప్పకుండా చెబుతాను.

**మీ సినిమాల మీద మీ కుటుంబ సభ్యుల స్పందన ఎలా ఉంటుంది?**

బయటివారికన్నా ఇంట్లో వాళ్ళ విమర్శలు తట్టుకోవడమే కష్టం. నా సినిమా ఏదీ వదలకుండా చూస్తారు. టైము దొరికితే ఇక్కడ బాగా చేయలేదు. అక్కడ ఇంకా బాగా చేసి ఉండవచ్చు. అంటూ చీల్చిచెండాడేస్తుంటారు. బాగుంటే మాత్రం ఏమనరు. కామ్‌గా ఉండిపోతారు. వాళ్ళతో కలిసి నా సినిమా చూడాలంటే నాకు చాలా భయం. కానీ ఒక్కోసారి చూడాల్సి వస్తూంటుంది.

**ఇప్పటి వరకూ మీ వాళ్ళకు బాగా నచ్చిన సినిమా?**

నా మొదటి సినిమా 'లక్ష్మీకల్యాణం'. ఆ సినిమా చేసే సమయంలో నాకేమీ తెలియదు. డైరెక్టర్‌గారు ఎలా చెబితే అలా చేశాను. మొదటి సినిమా అయినా చాలా బాగా చేశావంటూ మా వాళ్ళు నన్ను బాగా మెచ్చుకున్నారు. ఆ తరువాత 'మగధీర', 'మిస్టర్ పర్‌ఫెక్ట్' ఇలా చాలా సినిమాలు ఉన్నాయి.

**అంటే మీమీద వచ్చే విమర్శలను పట్టించుకోరన్నమాట?**

ఎందుకు పట్టించుకోను? తప్పకుండా పట్టించుకుంటాను. నా మంచి కోరి చెప్పే ప్రతి విమర్శనూ పట్టించుకుంటాను. కొందరు పనిలేకుండా నోటికి పని చెబుతుంటారు. అలాంటి వారి మాటలనూ, చేతలనూ కూడా పట్టించుకోను. ఉదాహరణకి నా సినిమా ఫ్లాప్ అయితే కాజల్ కారణంగానే ఆ సినిమా ఆడలేదంటూ చాలామంది విమర్శించడం నాకు తెలుసు. నేననే కాదు. ఏ హీరోయిన్ వల్లనో, లేదా హీరో వల్లనో, కమెడియన్ కారణంగానో, విలన్ కారణంగానో సినిమా ఆడడం ఆడకపోవడం ఉండదు. సినిమా సక్సెస్‌కూ, ఫ్లాప్‌కూ చాలా కారణాలు దోహదం చేస్తాయి. ఆ సినిమాల్లో నా నటనలో ఉన్న లోపాలను ఎత్తి చూపితే సరిదిద్దుకుంటాను తప్ప నా వలనే సినిమా ఆడలేదంటే మాత్రం ఒప్పుకోను.

**ఇంట్లో కాజల్ ఎలా ఉంటుంది?**

సెట్ నుంచి ఇంటికి రాగానే మామూలు అమ్మాయిని అయిపోతాను. ఇంట్లో అందరు అమ్మాయిలు ఎలా ఉంటారో నేనూ అలాగే ఉంటాను. ఈ రోజుకీ మా చెల్లెలు, నేను ఇంట్లో పోట్లాడుకుంటూనే ఉంటాం. తనంటే నాకు ప్రాణం. అయినా చిన్న చిన్న గిల్లికజ్జాలు మామూలే!

**ఎక్కువగా ఇష్టపడేది?**

అమ్మ చేసే వంట! మా మదర్ వంట బాగా చేస్తారు. అమ్మలందరూ బాగా చేస్తారు. నేను మాత్రం బాగా తింటాను. ఒక్కోసారి తినాలన్న కోరికను ఆపుకోలేను. ఆరోజు నా డైటింగ్, ఎక్సర్‌సైజ్ అన్నీ పక్కన పెట్టేసి తినేస్తాను. ఆ తరువాత తీరిగ్గా కష్టపడతాను. లోపలికి వెళ్ళిన క్యాలరీలు కరగాలి కదా! అందుకు బాగా ఒళ్ళు వంచుతాను.

**మరిచిపోలేని జ్ఞాపకాలు...**

ఎవరికైనా కాలేజీ రోజులు మరిచిపోలేనివి. క్లాసులు ఎగ్గొట్టి ఫ్రెండ్స్‌తో పార్టీలు, సినిమాలు అంటూ తెగ ఎంజాయ్ చేస్తాం. అప్పుడు ఎలాంటి బరువూ బాధ్యతలూ తెలియవు. ఆరోజులే వేరు. వాటిని తలుచుకుంటుంటే కళ్ళలో నీళ్ళు తిరుగుతాయి. ఆ రోజులు తిరిగి రమ్మన్నా రావు. అప్పటిలా ఎంజాయ్ చేయమన్నా ఇప్పుడు చేయలేను.

**దేవుడంటే నమ్మకం ఉందా?**

బోలెడంత ఉంది. కంటికి కనిపించని శక్తే మనల్ని నడిపిస్తుందని నా నమ్మకం. మన నమ్మకమే మన దేవుడు.

**ఖాళీ సమయంలో ఏం చేస్తుంటారు?**

మా చెల్లెలితో గొడవ పడుతుంటాను. సరదాగానే, సీరియస్‌గా కాదు. ఇద్దరం గొడవ పడకపోతే నాకు తోచదు, తనకీ తోచదు. నన్ను అందరూ పుస్తకాల పురుగు అంటూంటారు. ఎక్కువగా పుస్తకాలు చదవడానికే ఇష్టపడతాను. ఆ తరువాత మ్యూజిక్, డ్యాన్స్ అంటే చాలా ఇష్టం. నేనూ, నా సిస్టర్ కలిసి డ్యాన్స్ చేస్తుంటాం.

—చిన్ని



## ఇంటర్వ్యూ

# అందుకే హీరోయిన్ కాలేకపోయా

**-గీత**

**విశిష్ట నటి గీత. దాదాపు మూడున్నర దశాబ్దాలుగా తెలుగు, తమిళ, మలయాళ, కన్నడ, హిందీ భాషలో 200 పైగా చిత్రాల్లో నటించారామె.. బుల్లి తెర వీక్షకులకు మరింత చేరువయ్యారు. నాట్యం నేర్చుకోలేకపోవడంవల్లనే హీరోయిన్ కాలేకపోయానంటున్న గీత ఇంటర్వ్యూ ....**

మా నాన్నగారు శేషాచారి. అమ్మ అంబుజ. వారిది ప్రేమ వివాహం. నాన్న తెలుగు. అమ్మ తమిళం. చెన్నై టి. నగర్‌లో జన్మించాను. నాకు చిన్నప్పటి నుంచీ తమిళమే. నాన్నగారు ఉద్యోగరీత్యా బెంగళూరులో ఉండటంవల్ల 8వ తరగతి వరకు అక్కడే చదివాను. కన్నడభాష కూడా బాగా నేర్చుకున్నాను. చెన్నైలో తొమ్మిదో తరగతి చదువుతుండగా సినిమా అవకాశం లభించింది.

కానీ స్టేజీ నాటకాల్లోగానీ, నాట్య ప్రదర్శనలు గానీ ఎప్పుడూ చేయలేదు. వాటిల్లో నాకెలాంటి ప్రావీణ్యం లేదు. అమ్మ, నాన్న ప్రోత్సాహానికి అనుగుణంగా నేను బాగా చదువుకునేదాన్ని. చదువు ధ్యాసలోనే ఉండేదాన్ని. అనుకోకుండా ఆకస్మాత్తుగా సినిమాల్లోకి వచ్చాను.

### హీరోగా రజనీకాంత్ మొదటిచిత్రంలో

చెన్నై వచ్చి తొమ్మిదో తరగతిలో చేరాను. ఒకరోజు నేను పాఠశాలకు వెళుతుంటే, ఒక ప్రొడక్షన్ మేనేజర్ నన్ను చూసి నా దగ్గరకు వచ్చి, "సినిమాల్లో చేరతావా" అని సూటిగా ప్రశ్నించారు. 'భైరవి' అనే చిత్రం నిర్మిస్తున్నారు, అందులో నటిస్తావా? అని అడిగే సరికి ఏం చెప్పాలో నాకు అర్థం కాలేదు. 'మా పెద్దమ్మని అడిగి చెప్తా' అన్నాను. 'నీది ఫొటోజెనిక్ ఫేస్, సినిమాల్లోకి వస్తే బాగా రాణిస్తావు' అంటూ నా బుర్రలో ఒక కొత్త ఆలోచనకు బీజం వేశాడు. మా పెద్దమ్మను కలిసి అన్నీ వివరంగా చెప్పాడు. మా పెద్దమ్మ అల్లుడు కూడా ఆ సమయంలో అక్కడే ఉన్నారు. వచ్చిన అదృష్టం చేజార్చుకోకూడదని వాళ్ళిద్దరూ ఆలోచించి ఓకే చెప్పేశారు. ఆ తర్వాత అమ్మా నాన్నల్ని ఒప్పించారు. రజనీకాంత్‌కి హీరోగా అదే మొదటి చిత్రం. అప్పటికి ఆయనకు అంతపెద్ద పేరు లేదు. ప్రొడక్షన్ మేనేజర్ చెప్పిన ప్రకారం, మేం స్టూడియోలో భైరవి చిత్ర దర్శకుణ్ణి కలిశాం. ఆ విధంగా నేను ఆ చిత్రంలో నటించాను. చెన్నై రాజ్‌కుమార్ థియేటర్‌లో 'భైరవి' చిత్రం విడుదలై సూపర్‌హిట్ కావడంతో తమిళ దర్శకుల నుండి ఆఫర్లు రావడం ఆరంభమైంది. ఈచిత్రంలో రజనీకాంత్ చెల్లెలుగా నటించాను. భాస్కర్ దర్శకత్వంలో, కలైజ్ఞానమ్ నిర్మాణ సారథ్యంలో 1978లో విడుదలైన చిత్రమిది.

### మన ఊరి పాండవులు

తెలుగులో నా మొదటి చిత్రం 'మన ఊరి పాండవులు'. భైరవి చిత్రం చూసి నన్ను పిలిచి ఈ చిత్రంలో నాకు అవకాశం ఇచ్చారు. భైరవి చిత్రం తర్వాత నటించకూడదనుకున్నాను, కానీ 'మన ఊరి పాండవులు' చిత్రంలో నటించడం నాకు ప్లస్ పాయింట్ అయింది. అప్పట్లో నాకు తెలుగు రాదు. కానీ బాపూగారు నన్ను బాగా ఎంకరేజ్ చేశారు. అయనే అన్నీ నేర్పించారు. "ఏం భయపడకు, నేను ఉన్నాను, నువ్వు నవ్వుతూ నటించు' అని ఎంతో ధైర్యం చెప్పారు. ఎలా నటించాలో, ముఖకవళికలు ఎలా ప్రదర్శించాలో చెప్పేవారు. ఆ చిత్రం విడుదలయ్యాక ఇక నేను వెనక్కు తిరిగి చూడలేదు. అటు తమిళం, ఇటు తెలుగు చిత్రాలే కాకుండా మలయాళం, కన్నడ చిత్రాల్లో ఆఫర్లతో జీవితం బిజీ బిజీగా గడిచిపోయింది. తెలుగులో నన్ను నటిగా నిలబెట్టింది 'మన ఊరి పాండవులు' చిత్రమే. కన్నడంలో 'పడువారల్లి పాండవరు', హిందీలో 'హమ్ పాంచ్' గా రీమేక్ చేశారు. తర్వాత ఇద్దరూ అసాధ్యులే, తోడు దొంగలు, అల్లుడుగారు జిందాబాద్, కార్తీకదీపం, కొండవీటి సింహం, పట్నం వచ్చిన పతివ్రతలు, గుప్పెడు మనసు, టింగురంగడు, ఆపద్బాంధవుడు, వారసుడు, తాతయ్యప్రేమ లేఖలు, సాగర సంగమం, అందమైన

